# అలసిన గుండెలు

## (కథల సంపుటి)

రాచమల్లు రామచంద్రారెడ్డి



విద్యోదయ పబ్లికేషన్స్

కడప

# ఇందులో

# పరిచయం

రెండేళ్ల క్రితం "అభ్యుదయ" లో ప్రచురణార్థం వచ్చిన కథలు చూస్తుండగా "ఎదురు తిరిగిన కథానాయకుడు" అన్న కథ తగిలింది. రచయిత పేరు కొత్తది, కాని ఒక్కొక్క వాక్యమే చదువుతుంటే, "ఇతనికి రాయటం బాగా చాతనవును" అన్నభావం ఏర్పడి, చివరకు గట్టిగా బలపడింది. తరవాత అతని రచన ఏదీ నాకు తగలలేదు. కారణం ఈ కథల సంపుటి నాచేతికి అందినాక గాని తెలియలేదు: ఇవి నేను చూడని పత్రికలలో ప్రచురితమైనాయి.

ఇందులో ఉండే కథలు చదవటం నాకు రెండు విధాల తృప్తి నిచ్చింది — ఒక్క కథ మాత్రమే చదివి మెచ్చుకున్న శ్రీ రాచమల్లు రామచంద్రారెడ్డి రచనలు ఒక్కసారిగా పన్నెండు చదివే అవకాశం లభించటం ఒకటీ; ఈ కథకుడి శైలిలోని పటుత్వమూ, కథనంలోగల సామర్థ్యమూ, జీవితంపట్ల గల వైఖరీ మరింత స్పష్టంగా గ్రహించటం మరొకటీనూ.

కథకుడికి ఉండవలసిన శక్తులన్నీ ఈ కథకుడిలో నాకు బలంగా కనిపించాయి. సూటీ, రచయితకు సహజమూ అయిన భాష; ఒక్క వ్యర్థ పదం లేదు. ఈ రచయితకు ఒక్క వాక్యంతో పాత్రను రూపకల్పనచేసే అరుదైన శక్తి ఉన్నది.

సాధారణంగా మనకు బాగున్నాయనిపించే కథలు మనని ఉల్లాస పెడతాయి, జీవితంలో లభించని సంతృప్తి కలిగిస్తాయి; అయితే ఈకథలు "షాక్" ఇస్తాయి. జీవితంలో చూసి ఉపేక్షించే విషయాలనే ఈ కథలలో చదివి "షాక్" తింటాం. వీటిని చదివి మానసిక చైతన్యం పొందకుండా ఉండటం సాధ్యంకాదు.

పరిస్థితులకూ వ్యక్తులకూ మధ్య ఉండే సంఘర్షణ ఈ కథలలో

చాలా చక్కగా చూపబడింది. ఈ కథలలో మనకు విప్లవ వీరులు గాని, ఉన్న పరిస్థితుల అనుగ్రహంవల్ల సుఖ సౌఖ్యాలలో ఓలలాడేవారు గాని కనిపించరు. అయినప్పటికీనా సంఘంపై నిశిత విమర్శ ఎదురవుతుంది.

తననూ, తన కథలనూ పరిచయంచేసే అవకాశం నాకు కల్పించిన రచయితకు ఎంతో కృతజ్ఞుణ్ణి. నేటి కథకులలో శ్రీ రావమ్ము రామ చంద్రారెడ్డికి విశిష్ట స్థానం ఉన్నదని నా విశ్వాసం,

మద్రాసు,
11-8-1960

కొడవటిగంటి కుటుంబరావు

# అలసిన గుండెలు

ఆరో కాన్పుకు అమ్మగారింటికి పోవడానికి సిగ్గయింది శేషమ్మకు. పోయినసారి పుట్టింటికి పోయినప్పుడు తమ్ముని భార్య ములికివంటి మాట అన్నది : "కనడానికేం – నేనూ కంటాను–సంవత్సరానికొక పిల్లను. చాకిరీ చేసే వాళ్లుండొద్దూ!" అని. ఆ మాట విన్నప్పుడు ముసలి తల్లిని పట్టుకొని మూడు రోజులు యేడ్చింది శేషమ్మ. "గొడ్డుమోతుది–దాని మాటలకేం లేమ్మా" అని తల్లి యెంత ఓదార్చినా, ఆనాడే తీర్మానం చేసుకున్నది–యిక పుట్టింటికి పోకూడదని. యిప్పుడు మళ్లీ అమ్మగారింటికి పోతే బాగుండుననే ఆలోచన తనకు తెలియకుండానే రావడంతో, ఆమెకు సిగ్గుతోబాటు కోపంకూడా వచ్చింది. "ఆ రాకాసి దాని కొంపకు చచ్చినా పోను. అంతగా ఐతే మా అమ్మను యిక్కడికే రమ్మంటాను." అనుకుంది.

సీతారామయ్య యింటికి రాగానే, శేషమ్మ వంట యింట్లో నుండి నేరుగా వచ్చి "యేమండీ, యీసారి నేను మా వూరికి పోను." అంది తీర్మానంగా.

సందర్భం అర్థం కాక "యేమిు సంగతి?" అన్నాడు సీతారామయ్య,

"ఒకరింటికి యెందుకు పోవాలండీ ప్రతిసారీ - మనమేం బ్రతకలేక చస్తున్నామా?" అన్నది ఆమె పౌరుషంగా.

విషయం అర్థం గాకపోయినా సీతారామయ్య జవాబు చెప్పినాడు. "బ్రతకలేక చస్తున్నామని యెవరన్నారూ? మన మంతా చావలేక బ్రతుకుతున్నాం. అంతే."

"అబ్బ! విూ మాటలు విూవేనండీ!" అంది శేషమ్మ విసుగ్గా.

"మరి నాకు అర్థమయ్యేటట్లు అచ్చ తెనుగులో చెప్ప రాదూ?" అన్నాడు సీతారామయ్య సరసంగా.

భర్త సరసాలకు శేషమ్మ నవ్వడం మానుకొని చాలా యేండ్లయింది. తన మామూలు ధోరణిలోనే ఆమె అన్నది: "యీసారి యిక్కడే పురుడు పోసుకుంటాను. యీ సంగతి చెప్దామనుకుంటే యెంత సాగదీస్తారండీ విూరూ!"

"దానికేం-లక్షణంగా కానీయ్. అంత శుభకార్యానికి నేను మాత్రం అడ్డుపడతానా?"

పరిహాసం సీతారామయ్య తన బాధలమీద కప్పుకున్న ముసుగు. మొదటి కాన్పుకు భార్యను పుట్టింటికి పంపినప్పుడే పగటి కలలన్నీ ప్రక్కకు నెట్టి ఎలిమెంటరీ స్కూలు టీచర్ ఐనాడు. ముగ్గురు పిల్లలు పుట్టేటప్పటికి నిరాశ అతన్ని పూర్తిగా జయించింది. బాగా బ్రతకడానికి ప్రయత్నించడం తలకు మించిన పని అని ఆనాడే అనుకున్నాడు. అటు తర్వాత క్రమంగా బ్రతుకులోని భారాన్ని నవ్వులాటగా తీసుకోవడం నేర్చుకున్నాడు. ఆత్మహత్య చేసుకోలేని వాళ్లలో చాలా

మంది బ్రతుకుమీది కసిని భార్యా బిడ్డలమీద తీర్చుకుంటారు. కొంతమంది వేదాంతం పూసుకుంటారు. సీతారామయ్య వంటి వాళ్లు తమ బాధలను పరిహాసం క్రింద దాచుకుంటారు. "ఈ మూడు నాళ్ల బ్రతుకులో వృత్త సుఖాలే కోరుకోవడం మానవుని దురహంకారం. కష్టాలు వస్తేయేం? యెల్లకాలం వుంటాయా? చచ్చిందాకానే కదా?" అని అతని అంతరాత్మ చేసే వాదం. ఆ తర్వాత అతనికి జీవితంలో యెవరితోనూ పేచీలు రాలేదు. అప్పటినుండి అతను భార్యను ఆజ్ఞాపించడం గానీ, దండించడంగానీ లేదు. ఈ మార్పు శేషమ్మకు అర్థం గాకపోయినా, ఆమెకు తృప్తికరంగానే వుంది.

ఆ రాత్రే భర్తకు అన్నం వడ్డిస్తూ ఆమె అడిగింది : "ఐతే మా అమ్మను రమ్మని జాబు వ్రాయండి."

"వ్రాస్తానుగానీ ఒక విషయం ఆలోచించినావా ?" అన్నాడు సీతారామయ్య.

"యేమిటి ?"

"నీకు కోపం వస్తుందేమో—ఐనా చెప్తాను. మీ అమ్మ వస్తే ఒక నెలైనా వుంటుందిగదూ ?"

"వుండదా మరి ?" అన్నది శేషమ్మ ఉత్సాహంగా.

"మీ అమ్మకూడా అన్నం తింటుందిగదూ ?"

శేషమ్మకు చురుక్కుమంది. మగని మాటలకు నవ్వడం మానుకున్నా, కోపగించుకొనే శక్తి ఆమె యింకా కోల్పో లేదు. "యెవరమ్మైనా గడ్డి తింటుందా ?" అన్నది తీవ్రంగా.

సీతారామయ్య చిరునవ్వుతో సమాధానం చెప్పినాడు. "అదే నేననేదీ. యిప్పుడు ఒక పూటైనా అన్నం

తింటున్నాము. యిక మీ అమ్మవస్తే—గడ్డి తినకపోయిన జొన్నలో రాగులో తినాలి రెండు పూట్లా.”

శేషమ్మకు కండ్ల నీళ్ళు పర్యంతమైంది. భర్త చెప్పిం దాంట్లో అబద్ధమేమీ లేదు. తన తల్లికి తాను నెల రోజులు అన్నం పెట్టే స్థితిలో లేదు. పదేండ్లకు పూర్వం ఐతే, ఈ దుస్థితికి భర్తను నిందించి వుండేదే—మీాకు సంపాదించే యోగ్యత లేక గదా—అని. ఈ పదేండ్లలోనూ దేశంలో తన భర్తవంటి వాళ్లు యెంతమంది వుండేదీ తెలుసుకుంది. తన అశక్తతకు లోలోపల కుమలడం తప్ప యేమి చేయాల్నో ఆమెకు తెలియదు.

సీతారామయ్య అన్నం తిని పోయి మంచంమీాద కూర్చు న్నాడు. శేషమ్మ అన్నం ముందు కూర్చొని ముద్ద ముద్దకూ మనసులోని బాధను నెమరువేసుకుంటూ వుంది. ఈ రెండేండ్ల లోనూ సంసారం యెంత బరువైందీ జ్ఞాపకం చేసుకుంది. అన్ని వస్తువులూ క్రమక్రమంగా ధరలు పెరిగినాయి. సంవత్సరం నుండి ఒక పూట మాత్రమే బియ్యం వండుకుంటున్నారు. “పుట్టిన ఐదుగురిలో యిద్దరు పోయినా సంసారం యింత బరు వుగా వుండే” అనుకుంది ఆమె. వెంటనే “ఛీ—పాడు ఆలోచన! ఆయనవల్లనే యీా ఆలోచన నన్నూ పట్టుకొంది.” అనుకొని తల విదలించుకొంది. ఒక నెలలోనే యిద్దరు పిల్లలు చచ్చి తాను మొత్తుకుంటుంటే “యెందు కేడుస్తావ్ — ఖర్చు తగ్గిం దనా ?” అన్నాడు మగడు. ఇది జరిగి రెండేండ్లకు పైగా ఐనా “వాళ్లు బ్రతికివుంటే యెంత కష్టంగా వుండేది ?” అన్న ఆలో చన ఆమెకు అప్పుడప్పుడూ వస్తూనే వుంది. ఈ ఆలోచన వచ్చినప్పుడల్లా “పిల్లలు చచ్చినందుకు సంతోషిస్తున్నావా ?”

అని ఆమె అంతరాత్మ ఆక్రోశించేది. ఆమె ఉక్కిరి బిక్కిరై తన పిల్లలను తానే హత్యచేసినట్లు బాధపడేది.

ప్రొద్దుండగా పొరుగింటికి పోయిన వెనిమిదేండ్ల శారద వచ్చి "అమ్మా, సీతమ్మా వాళ్లు తిరపతికి పోతున్నారే." అంది.

శేషమ్మ కండ్లు తుడుచుకొని బిడ్డవైపు చూసింది.

"వాళ్లకు యినకంటాక్సు తప్పిపోయిందటమ్మా. అందుకని ముడుపు చెల్లించడానికి పోతున్నారే." అంది శారద.

శేషమ్మ పరధ్యానంగా "సరేలేవే" అంటూ చేయి కడుక్కొని లేచింది.

"యినకంటాక్సు అంటే యేందమ్మా?" అని అడిగింది శారద.

శేషమ్మ పలక్కుండా పోయి పసిపిల్లవాని ఉయ్యాల దగ్గర కూర్చుంది.

ఉట్టిపాటుగా ఆమెకు ఒక ఆలోచన వచ్చింది— బ్రహ్మాండమైన ఆలోచన. "తిరపతి వెంకటేశ్వరునికి ముందుగా ముడుపు కట్టుకుంటే!"తన ఆలోచనకు తానే మురిసిపోతూ, "నా తెలివి తగలెయ్యా.యిన్నాళ్ళా యెందుకు తోచలేదో!" అనుకుంది ఆమె. వెంటనే భర్తవైపు తిరిగి "నాకు రెండు రూపాయలు యివ్వండి." అన్నది.

"ఈ నెలలో జీతం పెరిగిందనా? ఐనా నీ భాగానికి రెండు రూపాయలు రాదే." అన్నాడు సీతారామయ్య.

"అదిగాదండీ_తిరపతి వెంకటేశ్వరునికి ముడుపు కట్టుకుంటాను." అన్నది శేషమ్మ.

## 6

"ఏం-మన ఐశ్వర్యం మీద ఆయనకూ కన్ను పడిందా !"

"మనకింక పిల్లలు వద్దని ముడుపు కట్టుకుంటాను." ఈ మాటలకు భర్త సంతోషిస్తాడని ఆశగా అతని ముఖంలోకి చూసింది శేషమ్మ.

సీతారామయ్య నవ్వుతూ అన్నాడు : "పిచ్చిదానా ! మన దేవుళ్ళకు యివ్వడమే తెలుసు. యివ్వకుండా వుండడం చేతగాదు."

"ఐతే మరి యేం చేయమంటారూ ?"

"మన పన్నుల మంత్రికి యింకా పదిమంది పిల్లల్నివ్వమని ముడుపు కట్టుకో. లేకపోతే ఆ వెంకటేశ్వరున్నే వచ్చి ఒక నెల యీ సంసారం యీదమని కోరుకో."

శేషమ్మకు అర్థం కాక వెర్రి చూపులు చూస్తూ కూర్చుంది.

(జూన్ 1957)

# ఓడిపోయిన సంస్కారం

సుందరమ్మ కంతా కలలో వున్నట్లుంది. పెండ్లంటే మేళ తాళాలూ, పెద్దల హడావుడీ, పిల్లల కోలాహలం, మొదలైనవన్నీ వుంటాయనే ఆమె మొదట భయపడింది. మూడేండ్ల నాడు తన మొదటి పెండ్లి ఆ విధంగానే జరిగింది. ఈ రెండవ పెండ్లి యే ఆర్భాటమూ లేకుండా కొద్దిమంది ఆత్మీయుల సమక్షంలో నవనాగరిక పద్ధతిలో జరుగుతుందని వారంరోజుల నాడు తెలిసినప్పుడు ఆమె కెంతో మనశ్శాంతి కలిగింది. పెండ్లి ఐన సంవత్సరానికే వైధవ్యభారం నెత్తిన వేసుకొని పుట్టిల్లు జేరిన తాను తిరిగి పెండ్లికూతురు వేషం ధరించాలంటే ఆమె చాలా సిగ్గుపడింది. పునర్వివాహానికి ఆమె మొదట తీవ్రంగా వ్యతిరేకించినా తన యిద్దరి అన్నగార్లూ యెడ తెగకుండా చేసిన హితోపదేశాలవల్లా, విధవ ఐన ఈ రెండేండ్లలోనూ తాను గడించిన జీవితానుభవంవల్లా, ఆమె యీ రెండవ పెండ్లికి ఒప్పుకుంది. ఐనా ఒక సంవత్సరంపాటు భర్తతో కాపురంచేసిన తాను సిగ్గు పెండ్లి కూతురుగా వది

మందిలోనూ ఎట్లా ప్రవర్తించడమా అన్న భయసంకోచాలు ఆమె మనస్సును పీడిస్తూనే వుండినాయి. అందువల్ల ఈ పెండ్లి యే ఆర్భాటమూ లేకుండా ప్రశాంతంగా జరిగిపోతుందని తెలిసినప్పుడు ఆమె సంతృప్తితో నిట్టూర్చింది. తీరా ఇప్పుడు చూస్తే ఆ పాత ఆచారాల ఆర్భాటమే మేలనిపించేటట్లుంది ఈ క్రొత్త వ్యవహారమంతా. పెండ్లేమో పది నిముషాలనే అయి పోయింది. వచ్చిన బంధువులంతా, పురోహితునితో గూడా కలసి యిరవై మంది కంటే యెక్కువ లేరు. తనకు సిగ్గు పడాల్సిన ఘట్టాలేమీ లేకుండానే పెండ్లి ముగిసిందని ఆమె సంతోషిస్తూ వుండగానే – అంతలోనే ఉపన్యాసాల కార్యక్రమం మొదలైంది. ఒక్కొక్కరే లేచి పెండ్లి కొడుకును అభి నందించడం, అతని సంఘ సంస్కరణాభిలాషను పొగడడం, అతని ఔదార్యాన్ని మెచ్చుకోవడం, ఆఖరులో ఆశీర్వ దించడం–ఆమె కంతా అయోమయంగా వుంది. సుమారు గంటనుండీ ఉపన్యాసాలు సాగుతున్నాయి. ఇప్పటికి ఐదారు మంది మాట్లాడినారు. ఇంకా యెంతమంది మాట్లాడు తారో ? విధవను పెండ్లి చేసుకోవటానికి యెవరైనా సిగ్గు పడతారని మాత్రమే ఆమెకు తెలుసు. కాకపోతే ఈ కాలంలో అదేమీ తప్పుకాదనీ, అందువలననే విధవా వివాహాలు జరుగుతున్నాయనీ ఆమె అనుకుంది. కాని ఇందులో ప్రశంసించవలసిందేముందో ఆమెకు అర్థం కాలేదు. ఇంతలో ఒక యువకుడు లేచి, అందరూ పెండ్లికొడుకైన రామనాథాన్ని మాత్రమే మెచ్చుకోవడం అన్యాయమనీ, సుందరమ్మ ధైర్య సాహసాలే యెక్కువగా మెచ్చుకోతగినవనీ ఉపన్యాసం మొదలు పెట్టినాడు. ఇదేదో మరీ విపరీతంగా కనపడిందామెకు.

ఇందులో ధైర్యసాహసా లేమున్నాయి? జీవితమంతా సుఖపడాలనే ఆశతోనే తానీ పెండ్లికి సిద్ధపడింది. అందులో తన్ను అంత పెద్దగా పొగడవలసిందేముంది? ఇతరుల కోసం తాను చేసిందేమీ లేదే! ఆ ఉపన్యాసం అయిపోయినంత వరకూ ఆమెకు ముండ్లమీద కూర్చున్నట్లే వుంది. అదృష్ట వశాత్తు అది ఐన వెంటనే కాఫీ ఫలహారాల కార్యక్రమం ప్రారంభమైంది. తరువాత 20 నిముషాల్లోనే ఆమె భర్త గృహం చేరుకుంది.

రాత్రి భోంచేసిన వెంటనే పడక గదిలో మంచం మీద కూర్చుంది సుందరమ్మ. ఈ భర్త యెటువంటివాడా అని ఆలోచించటానికి పూనుకుంది ఆమె. కాని వెంటనే మూడేండ్ల తానాడు తనకు కార్యం అయిన నాటి పరిస్థితులకూ ఈ నాటి పరిస్థితులకూ వున్న తేడా ఆమె మనసులో మెదలింది. ఆనాడు తన పెద్ద వదినె తన్నెంతో ఆప్యాయంగా అలంకరించి, గది వరకూ తన్ను పిలుచుకొని వచ్చి వాకిలిదగ్గర వదలి పెట్టిపోయింది. ఆనాడు భర్త తన కొరకు ఎదురు చూస్తూ వుండినాడు. సిగ్గుతో, ఉత్సాహంతో, ఉత్కంఠతో తా నానాడు పడక గది ప్రవేశించింది. ఆనాడు వదినెల పరిహాసంతో తన సిగ్గు నూరంతలు పెరిగినా, యేదో అపూర్వమైన సౌఖ్యం, అనంతమైన ఆనందం తనకంద బోతున్నదని అర్థంకాని ఉత్సాహం కూడా తన్నావేశించింది. ఈ నాడు తన్ను అలంకరించేవాళ్లూ లేరు, పరిహాసించేవాళ్ళూ లేరు. ఆ సిగ్గూ లేదు, ఆ ఉత్సాహమూ లేదు. ఈనాడు తానే వచ్చి పడక గదిలో భర్తకొర కెదురుచూస్తూ కూర్చుంది. ఈనాడు తనకు కలగబోయే సుఖంయొక్క స్వరూపం తెలుసు.

అందువలన ఆనాటి ఉత్కంఠ లేదు. ఆనాడు తన వుద్దేశాలతో నిమిత్తం లేకుండా యితరులు తన్నొక సుఖ సముద్రంలో త్రోసినారు. ఈనాడు తాను బుద్ధిపూర్వకంగా స్వప్రయత్నంతో ఆ సుఖ సముద్రాన్ని సమీపించింది. ఈ సుఖం తాను విధి నెదిరించి సంపాదించుకొన్న సుఖం. ఇది తన జన్మహక్కు. తన జన్మహక్కు కొరకు ఎదురు చూడడంలో సిగ్గుపడవలసిం దేమీ లేదు. తన హక్కు లభ్యమైనప్పుడు తా నెవరికీ కృతజ్ఞురాలు కానక్కరలేదు.

ఈ రామనాథం యెటువంటివాడో అన్న ప్రశ్న ఆమెకు మళ్ళీ జ్ఞాపకం వచ్చింది. ఔను - భర్త గుణగణాల మీదనే తన జీవితమంతా ఆధారపడి వుంటుంది. అతని స్వభావం మీదనే తన సుఖశాంతులన్నీ ఆధార పడుతాయి. అతను మంచివాడైతే తన బ్రతుకంతా ఒక పూలపాన్పు. అతను మంచివాడు కాకపోతే —— ఐనా, అతను మంచివాని మాదిరే వున్నాడు. తప్పక మంచివాడే ఐవుంటాడు. లేకపోతే తన అన్నలు తన నెందుకు అతనికిచ్చి పెండ్లి చేస్తారు! ఏమో? మొదట మంచివాళ్లుగానే వుండి తరువాత యెంత మంది పెండ్లాలను వేధించుకు తినడం లేదు? ఇతని సంస్కారం యెటువంటిదో? తన బ్రతుకంతా యితని స్వభావ సంస్కారాల మీదనే యేర్పడుతుంది.

సుందరమ్మకు యింకో విషయం జ్ఞాపకం వచ్చింది. మూడేండ్లనాడు యిదే పరిస్థితిలో భర్త యెటువంటివాడు అన్న ప్రశ్న తనకు తట్టనేలేదు. ఆనాడు తనకు కలగబోయే సుఖాన్ని గురించే తాను ఊహించుకుంది. తన భవిష్యజ్జీవితాన్ని గురించే గాలి మేడలు కట్టుకుంది. ఆనాడు తన భర్త

అందచందాలను గురించైనా కొంతవరకు తనలోతాను చిత్రించుకుందేగాని, అతని స్వభావ సంస్కారాలను గురించిన ఆలోచనే తనకు రాలేదు. ఈ విషయం జ్ఞాపకం వచ్చి ఆమె ఆశ్చర్యపడింది. వెంటనే కారణం స్ఫురించి తనలో తాను నవ్వుకుంది. పురుషుల స్వభావ సంస్కారాలే స్త్రీల సుఖ సంతోషాలను నిర్దాక్షిణ్యంగా నిర్ణయిస్తాయని ఆ నాడు తనకు తెలియదు. ఆ నాడు తెలియనివి యీనాడు తన కెన్నో తెలుసు. ముఖ్యంగా స్త్రీలు సుఖపడడానికి పురుషుల ఆకారాలకంటె పురుషుల మనస్సులే ప్రధానం అన్న విషయం తనకు బాగా తెలుసు. అందుకే యీ పెండ్లి ఖాయమైనప్పటి నుండీ యీ ప్రశ్న యెడతెగకుండా తన కెదురౌతూనే వుంది. ఈ రామనాథం యెటువంటి వాడు ? ఇతని మనస్సు యెటువంటిది ?

వాకిలి దగ్గర చప్పుడౌతూనే ఆమె తలయెత్తి చూచింది. భర్త కనబడగానే లేచి నిలబడింది. "సుందరీ, పెండ్లిలో నీకేమీ కష్టం కలుగలేదుగదా ?" అంటూ రామనాథం ఆమెను సమీపించి, మంచంమీద కూర్చొని, ఆమెను గూడా కూర్చోమన్నట్లు ఆమె భుజం మీద చేయివేసి బరువుగా నొక్కినాడు. సుందరమ్మ అతని ప్రక్కనే కూర్చుంటూ "లేదండీ" అన్నది.

రామనాథం ఉత్సాహంగా అందుకున్నాడు: "ఏర్పాట్లన్నీ స్వయంగా నేనే చేయించినాను తెలుసా ? నీ మనస్సు కేమీ ఆయాసం కలగకూడదని నేనెంత శ్రద్ధ తీసుకున్నా ననుకున్నావ్ ?"

"ఊఁ" అన్నది సుందరమ్మ నిరుత్సాహంగా.

రామనాథం మరింత ఉత్సాహంగా అన్నాడు: "ఊఁ అనడం గాదు సుందరీ, నీ సుఖంకోరకు నా జీవితమంతా ధార పోయటానికి సిద్ధంగా వున్నానంటే నమ్ము. ఈ పెండ్లిని గురించి యెంతమంది బంధువులకు దూరమైనాననుకున్నావ్ ? అంతెందుకూ-రేపు పత్రికలో చూస్తావుగా నేను నీకోర కెంత త్యాగం చేసిందీ."

ఇంతవరకూ నేలకేసి చూస్తూ వున్న సుందరమ్మ తల యెత్తి రామనాథం ముఖంలోకి చూసింది. ఆ ముఖంలో వంచన యెక్కడా కనబడలేదు. అతని కన్నుల నిండా ఆత్మ సంతృప్తి తప్ప మరేభావమూ లేదు. ఆమె మెల్లగా అడిగింది: "నా కోరకు అంత త్యాగం చేయవలసిన పనేముంది మీకు?" అది ప్రశ్నగా కాక తన అభిప్రాయం చెప్పినట్లు శాంతంగా చెప్పబోయింది ఆమె. కానీ, మధ్యలో అప్రయత్నంగా కంఠం వణికి అది ప్రశ్నగా ధ్వనించింది. తనకు తెలియకుండానే తనలో కలిగిన ఆవేశానికి సిగ్గుపడి ఆమె మళ్ళీ తల వంచుకుంది.

రామనాథం యివన్నీ గమనించకుండానే వెంటనే జవాబు చెప్పినాడు. "అదేంమాట సుందరం? మానవులమన్న తర్వాత ఆదర్శాలకోరకు త్యాగం చెయ్యకపోతే యెట్లా? నీబోటి యువతులందరూ నిష్కారణంగా జీవితసౌఖ్యాలకు దూరమై ఉసూరుమంటుంటే మన సంఘం బాగుపడేదెట్లా?"

సుందరమ్మ మౌనంగానే వుంది. అతని మనస్సును అర్థం చేసుకోడానికి ఆమె ప్రయత్నిస్తూ వుంది. ఈ మనిషికి నన్ను సుఖపెట్టాలని యింత తాపత్రయ మెందుకో? తాను సుఖపడాలనే ఆశ యితని కే కోశానా లేదా? ఆమె ఆలో

చనలు రామనాథం సాగనివ్వలేదు. రెండు చేతులతోనూ ఆమె ముఖం తన వైపుకు తిప్పుకొని అతనన్నాడు. "యిటు చూడు సుందరం, యీ పెండ్లి కాకుండా వుంటే నీ జీవిత మంతా యెట్లుంటుందో ఊహించుకున్నావా? నేను త్యాగం చెయ్యకపోతే నీ బ్రతుకులోని చీకటంతా తొలగిపొయ్యే దెట్లా?"

అతని కన్నుల్లోకి చూస్తూవున్న సుందరమ్మ కనురెప్పలు వాల్చి విచారంగా చిరునవ్వు నవ్వింది.

రామనాథం ఆమె చిరునవ్వును మాత్రమే చూసినాడు. ఆ చిరునవ్వులోని విచారాన్ని గమనించే స్థితిలో లేదు అతను. "చూడు-యిప్పుడు నీ బ్రతుకంతా వెన్నెల అయింది. నా త్యాగమంతా నీ చిరునవ్వు రూపంలో ఫలించినందుకు నాకెంత ఆనందంగా వుందనుకున్నావ్?" అని అన్నాడు సంతృప్తి, సంతోషం నిండిన కంఠంతో.

సుందరమ్మకు ఒక్కసారిగా భవిష్యత్తంతా అంధకార మయమైంది. "ఇంత త్యాగం జీవితమంతా మోసే శక్తి నాకు లేదు" అని బిగ్గరగా అరవాలనుకుంది. ఆమె దిగ్గున లేచి నిలబడ్డింది. అంతలోనే తన అసహాయత మెరుపువలె ఆమె మనసులో తోచింది. కండ్లు తుడుచుకుంటూ రామనాథం పాదాల దగ్గర నేలమీద కూర్చొని "మీ త్యాగానికి తగిన యోగ్యత నాకు కలిగేటట్లు ఆశీర్వదించండి" అని గద్గద కంఠంతో పలికింది.

(జనవరి 1958)

# మారేలోకం

హైస్కూల్లో నేనూ రామ్మూర్తీ క్లాసు మేట్సుము; కొంత వరకు స్నేహితులం కూడా అనవచ్చు. హైస్కూలు చదువు తర్వాత అతను కాలేజీ చదువులకు పోవడమూ, నేను ట్రెయినింగ్ స్కూలుకు పోయి స్కూల్ మాస్టర్ను గావడమూ జరిగింది. ఆ తరువాత ఐదారేండ్ల వరకూ నేనూ అతను కలుసుకోవడం పడలేదు. మూడేండ్లనాడు కలుసుకున్నప్పుడు అతనే నన్ను గుర్తుపట్టి పలకరించినాడు - లేకపోతే నేను కనుక్కునే వాణ్ని గాదేమో. ఆప్యాయంగా పలకరించి నా యోగక్షేమాలు విచారించి, తన సంగతులన్నీ వివరంగా చెప్పినాడు. తాను బియ్యేపాసైన సంగతీ, పెండ్లైన సంగతీ, నానా అవస్థలూ పడి పోలీస్ సబిన్స్పెక్టర్ పని సంపాయించిన సంగతీ, తన కప్పుడే ఇద్దరు పిల్లలున్న సంగతీ అన్నీ చెప్పి, నా కెందరు పిల్లలున్నదీ అడిగినాడు. అరగంట అరమర లేకుండా యిద్దరమూ మాట్లాడుకున్న తరువాత_అంటే ఎక్కువ భాగం అతను మాట్లాడమూ నేను వినడమూ అయిన తరువాత అతనన్నాడు "నీనోరేమో పడిపోయి నట్లుందే? ఎంతసేపూ

నేను చెప్పేది వినడమేగాని, నీవు చెప్పేదేమీ లేదా?'' "నేనూ మాట్లాడు: తున్నానుగా'' అన్నాను సిగ్గుపడుతూ. "ఏం మాట్లాడుతున్నావ్? అడిగిన ప్రశ్నలకు ముక్తసరి జవాబులు చెబుతున్నావ్. చిన్నప్పుడు ఎంతగా వాగుతుండే వానివో జ్ఞాపకముందా? నీవున్న చోట పది మంది వున్నట్లుండేది'' అన్నాడు రామ్మూర్తి. నాలుగేండ్లు బడిపంతులు ఉద్యోగం చేస్తే గుండెల్లో యెంత బరువు గూడు కట్టుకునేదీ చెప్దామను కున్నాను; కానీ అభిమానం అడ్డం వచ్చి మౌనంగా వుండి పోయినాను. "లేక పోలీసువాళ్ళ ముందు జాగ్రత్తగా మెలగా లనుకున్నావా?'' అని బిగ్గరగా నవ్వుతూ అతను నా భుజం తట్టినాడు. అతని సరసానికి నాకూ నవ్వు వచ్చింది. యిద్దరమూ నవ్వుకున్న తరువాత అతనే మళ్ళీ అన్నాడు: "చిన్నప్పటి సుఖం జీవితంలో తరువాత యెప్పుడూ వుండదు. మళ్ళీ చిన్నతనం వస్తే బాగుంటుందికదూ?'' ఏదో వొకమాటైనా అనకపోతే బాగుండదని "నీకేం, మంచి వుద్యోగమే వచ్చింది. యే దిగులూ లేకుండా హాయిగా వుండచ్చు'' అన్నాను. ఆ మాటలు వింటూనే అతని ముఖంలోని సంతోష మంతా మాయమైంది. విచారం నిండిన కంఠంతో "మంచి వుద్యోగమే–యీ వుద్యోగం యెన్నాళ్ళు చేస్తానో తెలియదు. ఎప్పుడో ఒకసారి రాజీనామా పెట్టేస్తాను'' అన్నాడు. ఆదుర్దాగా నేనన్నాను: "ఎందుకు రామ్మూర్తీ? మళ్ళీ వుద్యోగం దొరికించుకోవడం అంత సులభం గాదు.'' అతనికి ఆవేశం వచ్చింది. కోపమూ, విషాదమూ నిండిన కంఠంతో అన్నాడు: "ఈ వుద్యోగం కంటె బిచ్చమెత్తుకోవడమే మేలు. నిజంగా మానం మర్యాదావున్న వాడెవడూ యీ ఉద్యోగం

చేయలేదు.” ఇంక నేనేమన్నా అతని ధోరణి ప్రమాదకరంగా మారుతుందేమోనని నాకు భయమైంది. ఐదు నిముషాలు యిద్దరమూ మౌనంగా వున్న తరువాత రామ్మూర్తి అన్నాడు: “నీ వుద్యోగమే మేలేమో. నీ జీవితంలో సిగ్గుపడవలసిన పని యేమీ వుండదు.” ఆ మాటలలో నా కేదో కొత్త వెలుగు కనబడినట్లయింది. ఆ దృష్టితో నా జీవితాన్నెప్పుడూ విమర్శించుకోలేదు. జీవితంలో సంపూర్ణంగా ఓడిపోయినట్లు యెప్పుడూ సిగ్గుపడుతూ వుండేవాణ్ని. ఒక క్షణంపాటు కొత్త ఆత్మ విశ్వాసం–కొత్త గర్వం కలిగింది నాకు. కానీ, మరు క్షణంలోనే అనుమానం వచ్చింది–యిది కొత్త రకం మత్తు మందేమోనని. ఎందుకంటే నా కంతకు ముందే తెలుసు— ఆత్మహత్య చేసుకునే వాళ్ళకు గూడా ఒక విధమైన గర్వ ముంటుందని.

ఇది జరిగి మూడేండ్లయింది. ఆనాడే అనుకున్నాను— రామ్మూర్తిలో చాలా మార్పు వచ్చిందని. ఇంత సుకుమార హృదయం అతనిలో వుందని నేనెప్పుడూ ఊహించలేదు. నాకూ అతనికీ చిన్నప్పుడు వున్న పరిచయమంతా జ్ఞాపకం చేసుకొని చూచుకున్నాను. పరీక్షలు పాసు కావడం తప్ప చెప్పుకోవలసిన సద్గుణాలు కానీ, శ్రద్ధగా చదువుకోవడం తప్ప అనుకోవలసిన దుర్గుణాలు కానీ అతనిలో యేమీ వుండేవి కావు. కొద్ది యేండ్లలోనే అతని హృదయం ఇంత సున్నితం కావడానికి ఆ మధ్య యేమో జరిగి వుంటుందని సరిపెట్టుకున్నాను.

వారం రోజులనాడు రామ్మూర్తి యీ వూరికి బదిలీ ఐనాడనివిన్నాను. సబిన్‌స్పెక్టర్ నాకు స్నేహితుడంటే యీ

చిన్నవూర్లో నా గౌరవము కొంత పెరుగుతుందని ఆశపడినా నేమో నాకు తెలియకుండానే-అతను వచ్చిన రోజు సాయం త్రమే ఉత్సాహంతో బయలుదేరినాను పోలీస్ స్టేషన్ కు. చిరు నవ్వుతో నేనే పలకరించినాను ముందు "ఎప్పుడు వచ్చి నావ్ రామ్మూర్తి ?" అని. "ఈ దినమే" అని "పని తొందర్లో వున్నాను. కాసేపు కూర్చో" అన్నాడు. "ఛార్జి తీసుకోవడం, పాత కేసులతో పరిచయం చేసుకోవడం?" అంటూ అతని తరఫునా, నా తరఫునా సమాధానం చెప్పుకొని బయట వరండాలో కూర్చున్నాను. ఫైళ్ళూ - రికార్డులూ చూడడం, రైటర్ తో మాట్లాడడం, జవాన్లను గద్దించడం,- గంటసేపు కూర్చున్నా రామ్మూర్తి పని తెమల్లేదు. "పని మీదున్నావ్. మళ్ళీ రేపొస్తాలే" అని సెలవు తీసుకొని వచ్చేసినాను-అతను వచ్చినరోజే నేను పోవడం పొరపాటే అనుకుంటూ.

మరుదినం ఉదయం అతనే పిలిపించినాడు నన్ను. నన్ను చూస్తూనే వరండాలోకి వచ్చి రెండు మాటల్లో కుశల ప్రశ్నలు ముగించి "చిన్నప్పటినుండీ స్నేహితులం. మీ వూర్లో నీవు నాకు సహాయం చేయాలి...నీకూ అంతో యింతో ఆదాయం చూపిస్తాను" అన్నాడు నా ముఖంలోకి చూస్తూ. విషయమేమైందీ అర్థంకాక దిగ్భ్రమతో అతని వైపు చూసి నాను. "వివరాలన్నీ తీరికగా మాట్లాడుకోవచ్చులే. ముందు అసలు సంగతి చెప్పు. నీమీద నమ్మకం పెట్టుకొని వుంటాను. ఏమంటావ్ ?" అన్నాడు అతను ఒక్కొక్క మాటే నిదా

నంగా ఒత్తి పలుకుతూ. ఒక నిమిషం పట్టింది-నాకు దిగ్భ్రమ వదలి, నాకేదో పని పురమాయిస్తున్నాడని అర్థం చేసుకో డానికి. నీకూ అంతో యింతో ఆదాయం చూపిస్తానన్న మాట జ్ఞాపకంవచ్చి భయం కూడా కలిగింది నాకు కొంత. పని యేమైందీ అర్థంకాకపోయినా "అటువంటి పనులు నాతో కావు. పైగా నా వుద్యోగానికీ, మీా పనులకూ కుదురదు" అన్నాను మెల్లగా. నాకు ధైర్యం కలిగించేందుకేమో-నవ్వు ముఖం పెట్టుకొని "తొందరేమీా లేదులే. ఆలోచించుకొని రేపు చెప్పు" అన్నాడు. "సరే" నని వెంటనే వచ్చేసినాను- బరువైన హృదయంతో.

నావల్ల అతను ఏమీా సహాయం కోరినాడనే ప్రశ్న నాకు పట్టలేదు. యెందుకంటే- దేశంలో యెన్ని చట్టా లున్నాయో అన్ని చట్టాలనూ ధిక్కరించే వాళ్ళు యీా వూర్లో వున్నారు. అన్ని వూర్లలో వున్నట్లే యీా వూరులోనూ అన్ని రకాల మనుషులూ వున్నారు. కేసులు పెట్టదలచుకుంటే రోజుకు యాభై కేసులు పెట్టవచ్చు-న్యూసెన్సు కేసు మొదలు ఖూనీప్రయత్నం వరకూ. నన్ను బాధించిన ప్రశ్న రామ్మూర్తి యీా విధంగా యెందుకు మారిపోయినాడా అని. అతని మీాద నాకున్న కొద్దిపాటి అభిమానంవల్ల ఆ ప్రశ్న బాధగా మారింది. ఆ రోజే నన్ను యిద్దరు ముగ్గురు అడిగినారు—"కొత్త సబిన్ స్పెక్టర్ చాలా దుర్మార్గుడంట-నిజమేనా ?" అని.

తరువాత మూాడురోజులు రామ్మూర్తిని కలుసుకో లేదు. ఆ మూాడు రోజుల్లో అతన్ని గురించి కొన్ని వార్తలు

విన్నాను—అతను చాలా సమర్థుడనీ, డిపార్టుమెంటులో మంచి పేరుందనీ, దయాదాక్షిణ్యం లేనివాడనీ. ఈ వార్తలన్నీ జవాన్ల ద్వారా ప్రచారంలోకి వచ్చినవే. నిజమెంతో, అబద్ధమెంతో తేల్చడం కష్టమనుకున్నాను.

నిన్న సాయంత్రం మా పొరుగింటామె యేడుస్తూ నా దగ్గరకు వచ్చింది—ఆమె భర్తను పోలీసులు నిష్కారణంగా పట్టుకున్నారని. ఏ తప్పూ చేయంది ఎందుకు పట్టుకుంటారని నేనెంత వాదించినా, ఆమె మాట ఆమెదే. ఆమెను గురించి రామ్మూర్తి దగ్గరకు పోదామనుకున్నాను. కానీ, మొగమెక్కక పోలేక పోయినాను. తరువాత గంటసేపటికి ఆమె భర్త కన పడి, తన మీద సారాయి కేసు రాసుకొని వదలపెట్టినారని చెప్పినాడు. ఆశ్చర్యంతో అతన్ని అడిగినాను. "నీ వెప్పుడూ సారాయి తాగవే!" అని. "యెందుకు తాగను? యిరవై యేండ్ల నాడొకసారి తాగింటి" నన్నాడు అతను. "యిరవై యేండ్ల నాటికీ, యీ కేసుకూ యేమి సంబంధం!" అన్నాను మరింత ఆశ్చర్యంతో. "యేమో నాకేం తెలుసు! సబిన్ స్పెక్టర్ నడగండి" అంటూ అతను దాటిపోయినాడు. ఆశ్చర్యంనుండి తేరుకొని చాలాసేపు ఆలోచించినాను రామ్మూర్తిని గురించి. అతనితో స్వయంగా మాట్లాడితేగాని నిజం తేలదని నిశ్చయించుకున్నానేగాని, పోవడానికి మనసొప్ప లేదు.

రాత్రి తొమ్మిది గంటలప్పుడొక జవాన్ వచ్చి సబిన్ స్పెక్టర్ రమ్మంటున్నాడని చెప్పినాడు. ఎందుకు రమ్మన్నాడో

అని ఒక వైపు భయంగానేవున్నా, అనుమానాలైనా తీర్చుకో వచ్చునని అనుకున్నాను. రామ్మూర్తి యింట్లో వున్నాడని విని, స్వేచ్ఛగా మాట్లాడుకోవచ్చునని కొంత ధైర్యం కలిగింది. నేను పోగానే నన్ను పిలిపించిన పని చెప్పినాడు. "మీ పొరుగింటి మల్లయ్యతో నీవు చెప్పితే సరిపోతుంది. కోర్టులో కేసు ఒప్పుకునేటట్లు చేయాలి. ఒప్పుకోకపోతే నాకూ కష్టమే, అతనికీ కష్టమే." ఒక క్షణం నా గుండె నిలిచిపోయినంత పనైంది. చాలాసేపటికిగాని తేరుకొని మాట్లాడలేక పోయినాను. కడకు ధైర్యంచేసి "ఇంతకూ అతను సారాయి త్రాగ లేదుగా!" అన్నాను. రామ్మూర్తి వింతగా నవ్వుతూ చెప్పినాడు: "అందరూ త్రాగినవాళ్ళే దొరుకుతారా? కొందరు త్రాగినవాళ్ళూ, కొందరు త్రాగనివాళ్ళూ—మా పని కూడా జరగాలి గదా."

నాకే సిగ్గయింది. నేనే యేదో తప్పుచేసినట్లు మెల్లగా అన్నాను "ఐతే న్యాయం, అన్యాయం యేమీ లేదా?" రామ్మూర్తి నవ్వుతూనే సమాధానం చెప్పినాడు: "న్యాయాన్యాయాలు చూసుకోడానికి దేవుడున్నాడులే. మన బాగోగులు మనం చూసుకుంటే చాలు."

ఇక రామ్మూర్తితో మాట్లాడి లాభంలేదనుకొని లేచి నిలబడినాను. వెంటనే అతను సీరియస్‌గా "మరి మల్లయ్యకు సంగతేమంటావ్?" అన్నాడు. మనసులోని బాధనంతా అణచుకొని, శాంతంగా అన్నాను: "మల్లయ్యతో నేనెందుకు చెప్పాలి?" రామూర్తి మళ్ళీ నవ్వినాడు. ఆ నవ్వే నాకు దుర్భరంగా కనపడింది. నవ్వుతూ అతనన్నాడు: "నీ స్నేహితు

నిగా అడుగుతున్నాననుకో. లేకపోతే సబిన్‌స్పెక్టర్‌గానే అడుగుతున్నాననుకో. నేను మల్లయ్యకే గాదు–నీకూ సబిన్‌స్పెక్టర్నే గదూ."

కోపంతో వొళ్ళంతా మండిపోయింది నాకు. "మూడేండ్ల నాడు మనిషివి. ఈనాడు వట్టి సబిన్‌స్పెక్టర్‌వు." అంటూ గబగబా వచ్చేసినాను.

రాత్రంతా నాకు నిద్రపట్టలేదు–ఒకటే ఆలోచనతో–'మనుషులు విధిలేక మారుతారా, లేక బుద్ధి పూర్వకంగా మారుతారా?' అని.

(ఫిబ్రవరి 1958)

# చుక్కలూ–చీకటి

సినిమా చూసినంతసేపూ వరలక్ష్మికి కన్నీళ్ళు కారుతూనే వున్నాయి. కథ మొదలౌతూనే ఆమె కథానాయికలో లీనమైపోయింది. కథానాయికా, నాయకుడూ ప్రేమించుకోవడమూ, విడిపోవడమూ, ఒకరి కొరకు ఒకరు బాధపడడమూ, వాళ్ళు కలుసుకోడానికి అనేక అంతరాయాలు కలగడమూ–యివన్నీ ఆమె సినిమా చూసినట్లుగాక, తనకు జరిగినట్లే అనుభవించింది. పక్క కుర్చీలో భర్త కూర్చున్న విషయం కూడా మరచిపోయి ఆమె ప్రేమా, వియోగమూ, విరహమూ అన్నీ అనుభవించింది. కథానాయకుడు భయంకరమైన ప్రమాదాలలోనూ, కథానాయిక అంతులేని దుఃఖసముద్రంలోనూ మునిగి వుండగా ఇంటర్వల్ వచ్చింది. ఉట్టిపాటుగా వెలిగిన లైట్ల వెలుతురుకు వరలక్ష్మి తెప్పరిల్లి కండ్లు తుడుచుకుంటూ వుండగా రామారావు మెల్లగా పిలిచినాడు "లక్ష్మి" అని. వరలక్ష్మి బరువుగా ముఖమెత్తి భర్తవైపు చూచింది. రామారావు చిరునవ్వు నవ్వుతూ "కథలో జరిగే విషయాలకు

కన్నీళ్ళు కారుస్తారా!'' అన్నాడు లాలనగా. వరలక్ష్మి సిగ్గుతో జవాబు చెప్పలేకపోయింది.

''మరీ అంత పరవశమైతే యెట్లా! మూడుసార్లు పిలిచినా నీకు వినబడనే లేదు'' అన్నాడు రామారావు.

వరలక్ష్మి సిగ్గుపడుతూనే ''పిలిచినారా!'' అని అడిగింది.

''ఒకసారి గాదు-మూడుసార్లు పిలిచినాను. నీవీ లోకం లోనే లేవు. తెరమీాద జరిగేదంతా నిజమనుకొన్నావా! అదంతా కల్పితమే కదూ-వట్టి కథ.'' అన్నాడు రామారావు.

వినీ విననట్లుగా వరలక్ష్మి ఊకొట్టి తల దించుకొంది.

రామారావు మళ్ళీ అన్నాడు ''పోనీలే, నీకు సినిమా నచ్చిందన్నమాట-అంతే చాలు. నాకేమో వట్టి తలనొప్పి వ్యవహారంగా వుంది.''

వరలక్ష్మి బదులు పలకలేదు. కొత్తగా కాపురానికి వచ్చిన భార్య పదిమందిలో మాట్లాడడానికి సిగ్గుపడడం సహజమే అనుకొని రామారావు కూడా మాట్లాడడం మానుకొన్నాడు.

ఇంత మంచి సినిమా భర్తకు నచ్చలేదని వరలక్ష్మికి ఆశ్చర్యం కలిగింది. లేక మగవాళ్ళందరికీ యింతేనేమో!... ఐతే మరి యింతమంది మగవాళ్ళు సినిమాకెందుకు వచ్చినారు?...అదికాదు-ఈయన పెద్ద చదువు చదువుకున్నాడు-అందువలన సినిమాలు బాగుండవేమో! ఐనా యింత మంచి సినిమా బాగుండక పోవడం విచిత్రమే! పాపం - అంత అందమైన ఆ అమ్మాయికి అన్ని కష్టాలు వస్తే యెవరికైనా మనసు కరగకుండా వుంటుందా! వరలక్ష్మి ఆలోచనలు క్రమంగా

కథమిగాలికి పోయినాయి. ఇంతలో మళ్ళీ సినిమా మొదలు కావడమూ, ఆమె అప్రయత్నంగా మళ్ళీ కథానాయికలో కావడమూ జరిగిపోయింది. కథానాయకుడు ప్రాణా పాయస్థితిలో వుండగా ఆమె విపరీతంగా బాధపడింది. ఆ బాధ కథానాయకుని మీద సానుభూతి కాదు. బాధంతా కథా నాయిక భవిష్యత్తును గురించే – కథానాయకుడు మరణిస్తే పాపం ఆ అమ్మాయి గతి యేమవుతుందీ–అనే.

సినిమా ఐపోయి రామారావూ, వరలక్ష్మి యిల్లు చేరుకునేటప్పటికి పదిన్నర అయింది. రామారావు భోజనం చేసినాడు–కానీ వరలక్ష్మి ఆకలి కాలేదని అన్నమంతా వదలి పెట్టి లేచింది.

రామారావు సిగరెట్ త్రాగుతూ ఈజీఛేర్‌లో కూర్చుని వరలక్ష్మి వైపే చూస్తున్నాడు. వరలక్ష్మి పట్టె మంచంమీద వెల్లకిల పండుకొని, కండ్లు తెరచుకొని మిద్దె కప్పు వైపు చూస్తూ వుంది. సిగరెట్టు పారవేసి "తలనొప్పిగా వుందా లక్ష్మి?" అన్నాడు అతను.

"ఊఁహూఁ" అన్నది వరలక్ష్మి.

"మరి యెందు కట్లున్నావ్?" అన్నాడు రామారావు, యింక కొంచెం ఆసక్తితో.

వరలక్ష్మి కదలకుండా, రెప్పవాల్చకుండా, నిమ్నో న్నతాలు లేని కంఠంతో, యేదో లోకంనుండి మాట్లాడినట్లు "నన్నొకసారి మా వూరికి పంపిస్తారా" అన్నది.

రామారావు కేమీ దిక్కు తెలియలేదు. కొత్తగా కాపురానికి వచ్చిన భార్యతో ఆ సాయంత్రం కులాసాగా సినిమా చూడాలనుకున్నాడేగానీ, పాపం, సినిమా చూసిన

కెంటనే వరలక్ష్మిలో యింత మార్పు - యీ విధమైన మార్పు-వస్తుందని అతను వూహించనే లేదు. ఆ సినిమా ఐనా వరలక్ష్మికి సరదాగా కొంత కాలక్షేపమౌతుందనుకున్నాడే గానీ తన కోసమేమీ కాదు. ఇక యీ రాత్రంతా యిద్దరికీ ఒంటరితనమోనేమో!

రామారావు ఆదుర్దాగా అడిగినాడు: "యేం లక్ష్మి, మనసు బాగాలేదా?"

"రేపు ప్రొద్దున రైలుకు పంపించండి. మళ్ళీ మరునాడే వచ్చేస్తాను!"

ఆ సాయంత్రం దాకా మామూలుగా వున్న మనిషికి యింతలోనే యేమైందా అని రామారావుకు ఆశ్చర్యం కలిగింది. కానీ, ఆశ్చర్యంకంటే అతని మనస్సులో విచారమే యెక్కువగా వుంది. వరలక్ష్మి వచ్చిన యీ ఐదారు రోజుల లోనూ తన జీవితమంతా యిదేవిధంగా హాయిగా వుంటుందనే విశ్వాసం అతనిలో క్రమంగా బలపడింది. పెండ్లి నాటికి అతనికి భార్య మీద ప్రేమ అనేదేమీ లేనిమాట నిజమే. కానీ, పెండ్లయిన పదిరోజులకే తనకింత పెద్ద వుద్యోగం వచ్చింది. అదంతా భార్య అదృష్టమేనని కొంతమంది ఆడవాళ్ళు అన్న మాటలు తాను సంపూర్ణంగా నమ్మకపోయినా మొదటి సారిగా అతనికి ఆనాడే వరలక్ష్మి మీద యేదో అభిమానం ఆరంభమైంది. అప్పుడైనా వరలక్ష్మిని తాను యింతగా ప్రేమించగలనని అతను అనుకోలేదు. ఈ ఐదారు రోజుల లోనూ ఆమె ప్రవర్తన అతన్ని సంపూర్ణంగా వశపరచుకొంది. యింత అన్యోన్యంగా వుండగల భార్య దొరికినందుకు తన్ను తానే అభినందించుకుంటూ వరలక్ష్మిని మనసులో ఆరా

ధించడం మొదలుపెట్టినాడు. అందుకనే తనకు సినిమాలమీద యిష్టం లేకపోయినా, వరలక్ష్మి సంతోషిస్తుందని ఆమెను సినిమాకు పిల్చుకపోయినాడు. కానీ, యిదేమిటి? పిడుగుపాటుగా వూరికి పంపించమని పట్టుబట్టింది!

"యెందుకు లక్ష్మీ! నీవు వచ్చి యింకా వారమైనా కాలేదే!" అన్నాడు రామారావు దిగులుగా.

వరలక్ష్మి మెల్లగా చెప్పింది "లేకపోతే మీరూ రండి. యిద్దరమూ కలిసి రేపు రాత్రికే తిరిగి రావచ్చు."

రామారావుకు కొంచెంగా విసుగుకలిగింది. ఈజీఛేర్ లో నుంచి లేచి చిరాకుగా మంచం దగ్గరికి వచ్చినాడు. కానీ, వరలక్ష్మి ముఖం చూసేటప్పటికి అతని విసుగూ - చిరాకూ మాయమైనాయి. యేదో గంభీరమైన వేదన - ప్రశాంతమైన దుఃఖం - నీరవమైన బాధ - ఆమె ముఖం మీద బరువుగా కూర్చొని వుంది. అతని హృదయం జాలితో, ప్రేమతో, దయతో, అనురాగంతో నిండిపోయింది. తన వరలక్ష్మికి యింత కష్టమెందుకు వచ్చిందో? మంచం మీద కూర్చొని బుజ్జగిస్తూ అన్నాడు అతను: "సరేలే లక్ష్మీ - ప్రొద్దున్నే పోదాంలే. యింతకూ అసలు సంగతేమిటో చెప్పవూ?"

"మీరేమీ అనుకోరు గదూ?" భర్త వైపు చూడకుండానే అడిగింది ఆమె.

"ఛీ - నీవే నన్ను నమ్మకపోతే యెట్లా? - చెప్పూ."

మొదటిసారిగా ఆమె భర్త వైపు తిరిగి బరువుగా చెప్పింది. "మా బావ నొకసారి చూసి వస్తాను."

"అంత మాత్రానికేనా యింత దిగులు?" అని తేలికగా నవ్వినాడు రామారావు. అంతలోనే బావ అన్నమాట

మొదడు కెక్కి— మనిషి నిలువునా స్తంభించి పోయినాడు. ఒక నిముషం అతనికి నోట మాట రాలేదు. తర్వాత మెల్లగా "యెవరు లక్ష్మీ?" అన్నాడు.

"మా బావ—మా సూర్యం బావ" వరలక్ష్మి ఆశగా చూసింది భర్త వైపు.

రామారావు బరువుగా మంచం మీాదనుండి లేచిపోయి కిటికీ దగ్గర నిలబడినాడు—బయటి చీకటిని చూస్తూ. వరలక్ష్మికి తనమీాద ప్రేమలేదా? యింతకు ముందే వాళ్ళ బావను ప్రేమించిందా? మరి యీావారం రోజులూ తన్ను ప్రేమించినట్లే కనబడిందే! రామారావు చాలాసేపు మౌనంగా, చీకటిని చూస్తూ, ఆలోచనలు లేని విచారంలో మునిగిపోయినాడు. తరువాత వరలక్ష్మి వైపు తిరిగి అన్నాడు: "మీా బావను పెండ్లి చేసుకుందామనుకున్నావా?"

వరలక్ష్మి పసిపిల్ల మాదిరీ తల ఆడించింది ఔనన్నట్లు. అమాయకమైన ఆమె ముఖం, అలౌకికమైన ఆమె కన్నుల్లోని కాంతి, పసిపిల్లవలె ఆ జవాబు చెప్పే పద్ధతి, రామారావుకు కోపగించుకోడాని కెక్కడా కారణమే కనబడలేదు. హృదయంలో యేమూాలనో అసూయ తల యెత్తింది. కానీ, ఆ అసూయను ప్రకటించే దెట్లనో అతనికి తోచలేదు. ఆ బావ ఎవరో తనకు తెలియదు. తనతో వరలక్ష్మి స్వయంగా చెప్పకపోతే బహుశా యెన్నాళ్ళున్నా తనకు తెలియక పోవునేమో. మెల్లగా అడుగులు వేసుకుంటూ అతను మళ్లీ మంచం దగ్గరికి వచ్చినాడు. నిశ్చలంగావున్న వరలక్ష్మి కన్నుల్లోకి చూస్తూ అడిగినాడు "మీా బావ నెందుకు చేసుకోలేదు? మీానాన్న వొప్పుకోలేదా?"

వరలక్ష్మి మళ్లీ తల ఆడించింది ఔనన్నట్లు.

"యెందుకు వొప్పుకోలేదు?" రామారావు ప్రశ్నించినాడు.

వరలక్ష్మి నిశ్చలంగా భర్త వైపు చూస్తూ చెప్పింది "మా బావ..." ఆ మాటతో ఆమె కడుపులోని దుఃఖమంతా కట్టలు త్రెంచుకొని బయటికి వచ్చింది. గద్గద కంఠంతో, కన్నీటి చుక్కలతో, వాక్యం పూర్తి చేసింది. "మా బావకు—మీయంత—డబ్బు లేదు; మీయంత – చదువూ లేదు."

రామారావు మెల్లగా వెనకకు తిరిగి మళ్ళీ కిటికీ దగ్గరికి పోయి నిలబడినాడు—బయటి చీకటిని చూస్తూ. ఒక నిమిషం ఐన తర్వాత చీకట్లోకి చూస్తూ అడిగినాడు "మరి నన్నెందుకు చేసుకొన్నావ్?"

కంఠం సవరించుకొంటూ వరలక్ష్మి జవాబు చెప్పింది. "మీకు డబ్బూ, వుద్యోగమూ వున్నాయిగా?"

రామారావు చీకటిలోకాన్ని చూస్తూనే వున్నాడు. అనంతమైన ఆకాశం—అనంతకోటి నక్షత్రాలు—అన్నిటినీ ఆవరించిన అనంతమైన అంధకారం.

(ఏప్రిల్ 1958)

# దేశంలోని దేవకన్యలు

ఆస్పత్రి వరండాలో అటూ యిటూ తిరుగుతున్నాను—ఏం చేయడానికీ తోచక. ఇంకో గంటవరకూ డాక్టర్‌కు పని తెమలేటట్లు లేదు—పరీక్ష చేయించుకోవలసిన రోగులు యింకా పదిమంది దాకా వున్నారు. ఆ ఆస్పత్రి వున్నది వూరి బయట. అటు వూళ్లోకిగాని, ఇటు వూరి బయటకుగానీ షికారు పోదామనుకుంటే అంతా బురదే.

అసలు ఆ వర్షంతోనే ఆనాడు నేనా వూళ్లో యిరుక్కో—వలసివచ్చింది. ఆ వూరికి రోడ్డంటూ ఒకటుంది. ఆ రోడ్డు మీద బస్సు కూడా ఒకటుంది—రోజుకు ఒకసారి అటూ, ఒకసారి యిటూ. అసలే ఆ బస్సుకు టైం ప్రకారం నడవాలనే పట్టుదల లేదు; యిక వర్షం వస్తే చెప్పకుండానే సెలవు పెట్టుంది; ఆ సెలవు ఒక రోజు కావచ్చు, పది రోజులు కావచ్చు. అందులో ఆ బస్సును అనవలసిన పనికూడా లేదు—ఆ రోడ్డు అటువంటిది. ఆ రోడ్డు వున్నది బస్సులు నడవడానికి కాదు—బస్సులను పరీక్షించడానికి—భక్తులను పరీక్షించడానికి

భగవంతుడున్నట్లు. ఆ బస్సు నడచిన నాడూ, నడవని నాడూ కూడా, ప్రయాణీకుల మీద కసి తీర్చుకుంటుంది – భక్తులు కీర్తనలు వ్రాసీ, పాడీ, ప్రజల సంగీత అభిరుచుల మీద కసి తీర్చుకున్నట్లు.

చేసేదిలేక ఆస్పత్రి వరండాలో అటూ యిటూ తిరుగుతున్నాను–డాక్టర్ మీద విసుక్కుంటూ. నిన్న ఉదయమే పోతానంటే డాక్టరే నన్ను బలవంతంగా ఆపినాడు. ఆ బస్సు యిక రెండు మూడు రోజులు వచ్చేటట్లు లేదు. అంతవరకూ నేనీ దిక్కులేని కొంపలో దినాలు గడపక తప్పదు. బాల్య స్నేహితుడు డాక్టర్ మూర్తి వుండబట్టిగానీ, లేకపోతే యీ వూరు చూడవలసిన దురవస్థ నాకీ జన్మలో పట్టేది గాదు. యీ పాడు వూర్లో మూర్తి యెందుకున్నాడో నా కెప్పుడూ ఆశ్చర్యమే. ఆశ్చర్యమే కాదు–కోపం కూడా. యే టౌన్‌లో ప్రాక్టీసు పెట్టుకున్నా యింత పదంతలు సంపాయించగలడు–యింత నూరంతలు సుఖపడగలడు. యీమాటే నేను మూర్తితో యెన్నిసార్లో అన్నాను. కానీ చిరునవ్వు నవ్వడం తప్ప యే సమాధానమూ చెప్పడు. ఆ చిరునవ్వు కూడా యేదో వింతగా వుంటుంది–నీకు అర్థం కాదులే అన్నట్లు. లేక ఆ చిరునవ్వు వెనుక విచారమో, విషాదమో వుందేమో?

ఈ రోజైనా నిలదీసి అడుగుతాను–యీ నరక కూపం వదలిపెడ్తావా లేక – లేక – వదలిపెట్టకపోతే యేమని బెదరించాల్నో నాకే తెలియ లేదు. పోనీ, తన భార్యాబిడ్డల కోసమైనా వదలిపెట్టమని చెప్తాను. యేముందీ వూరిలో? ఒక వింత లేదు–ఒక వినోదం లేదు–సంస్కారం లేదు–నాగరికత లేదు–

ఒక సంఘం లేదు_ఒక స్నేహితుడు లేడు_కనీసం చదువు కుందామనుకుంటే ఒక పుస్తకం కూడా దొరకదు_వట్టి పల్లె కొంప. వర్షం వస్తే అంతా బురద. గాలివీస్తే అంతా దుమ్ము. అదీ కాకపోతే అలవిగాని యెండ. పగలంతా యీగలు, రేయంతా దోమలు. యెప్పుడూ ఊర్లో యేదో వొక రోగం వుంటుంది_మశూచో, మలేరియానో, మరొకటో, మరొకటో యిది మనుషులు వుండదగిన ఊరే కాదు_అసలు యీ ఊరిలో వున్నది మనుషులేనా అని అనుమానం_అసలు యిది ఊరేనా అనిపించేది నరకలోకానికి మాడల్_యిది మానవ నాగరికతకు మచ్చ_మానవచరిత్రకు అపచారం - మానవుని మర్యాదకు కళంకం.

ఆవేశం యెక్కువైనందు వల్లనేమో ఆలోచన హఠాత్తుగా ఆగిపోయింది. నా ఆవేశానికి నేనే నవ్వుకుంటూ గడియారం చూసుకున్నాను_యింకా పది కాలేదు. సిగరెట్ అంటించుకుంటూ నిలబడి ఊరివైపు చూసినాను.

ఒక క్షణం నా కండ్లను నేనే నమ్మలేక పోయినాను. కండ్లు మూసి మళ్ళీ తెరచినాను_మళ్ళీ అదే దృశ్యం_యెవరో దేవకన్య! దేవకన్య యిటువైపు వస్తూ వుంది_మెల్లగా అడుగులు వేసుకుంటూ_వయ్యారంగా అడుగు తీసి అడుగు పెడ్తూ_ అది నడక కాదు_నృత్యం. దేవకన్య నా వైపే వస్తూ వుంది. ఆమె ధరించినవి మణి మయాంబరాలు - చెవులలో శతకోటి సూర్యప్రభలు_తలమీది వెంట్రుకలలో వెలుగుసీడల రాస

క్రీడలు - ముఖంలో అపూర్వమైన తేజస్సు - అతిలోకమైన సౌందర్యం. దేవకన్య నా వైపే వస్తూ వుంది. అనిమేష దృష్టితో ఆమె వైపే చూస్తూ వున్నాను. ఆమె మెల్లగా వస్తూనే వుంది_నా వైపే వస్తూ వుంది. దగ్గరకు వచ్చేకొద్దీ ఆకారం స్పష్టమాతూవుంది_అవిగో విచ్చిన గులాబీలవంటి చెంపలు. చెంపకు చేరెడేసి కన్నులు. తీర్చిదిద్దిన నల్లని కను బొమలు. ఆఁ_కాదు_ఆమె దేవకన్య కాదు. దగ్గరకు వచ్చే కొద్దీ తేలిపోయింది. ఆమె దేవకన్య కాదు_మామూలు మానవ కన్య.

నిన్న వచ్చిన వర్షంవలన గాలిలో దుమ్మూ ధూళీ లేక వాతావరణం పరిశుభ్రంగా వుండడమూ, ఉదయం పది గంటలే ఐనా ఎండ తీవ్రంగా వుండడమూ ఆ పరిశుభ్రమైన వాతావరణంలో సూర్యుని తీక్ష్ణ కిరణాలలో ఆ అమ్మాయి వేసుకున్న చాకరకం లినన్ గుడ్డల మిలమిలా, చెవులలోని రంగూన్ రాళ్ల తళతళా నాకేదో భ్రమ కల్పించినట్లుంది. ఆ ఊహమీద నా మనసులో కలిగిన అనవసరమైన ఆవేశం కూడా ఆ భ్రమకు కొంత కారణమేమో. కారణమేమైనా ఆ అపూర్వమైన భ్రమ ఆ నిముషంసేపూ నన్ను సంపూర్ణంగా లోబరచుకుంది. మరునిముషంలోనే భ్రమ వదలి పోయినా ఆ దివ్యసౌందర్యమూర్తి నా హృదయంలో గాఢంగా హత్తుకుపోయింది.

క్రమంగా ఆ అమ్మాయి దగ్గరకు వస్తూ వుంది_మెల్లగా వస్తూ వుంది_అడుగులో అడుగు వేసుకుంటూ వస్తూ వుంది; కానీ ఆ నడక నృత్యం కాదు - యౌవనభారంచే కలిగిన

మందయానమూ కాదు. ఆ నడకలో యేదో అసహజత్వం వుంది. నడకలో ఉత్సాహం లేదు—కదలికలో ఉల్లాసం లేదు—అడుగు తీసి అడుగు పెట్టడంలో ఆనందం లేదు.

ఆ అమ్మాయి మరికొంత దగ్గరకు వచ్చింది – బరువుగా నడుస్తూ. ఆ అమ్మాయి జబ్బుగా వున్నట్లుంది. ఔను—ఆమె ఆరోగ్యం బాగలేదు—అందుకే అంత బరువుగా నడుస్తున్నది. అదుగో చేతిలో యేదో సీసా వుంది—మందుకోసమేమో ఆస్పత్రికి వస్తూ వుంది—లేకపోతే ఆస్పత్రికి రావలసిన పనియేముంది?

ఆ అమ్మాయి యిప్పుడు చాలా దగ్గరకు వచ్చింది. వయస్సు పన్రెండేండ్లు వుండవచ్చు. పల్లెటూరి పిల్లే ఐనా చక్కని ముక్కు – విశాలమైన కండ్లు – దీర్ఘమైన కనుబొమలు—కోలముఖం—కొసదేలిన గడ్డం—ఉన్నతమైన నొసలు—కానీ అన్ని అవయవాల్లోనూ అనారోగ్యం తాండవిస్తూ వుంది. చిక్కి శల్యమైన చేతులు—కాంతిలేని కండ్లు—కళలేని ముఖం—పాలిపోయిన చెక్కిళ్లు—ఆకర్షణలేని శరీరం—ఆనందం లేని నడక.

ఆ అమ్మాయి ఆస్పత్రిలోకి పోయింది—బరువుగా—బాధగా—కాళ్ళీడ్చుకుంటూ. నా గుండెలు బరువెక్కినాయి—నా మనసులో బాధ బయలుదేరింది. దేవకన్యగా, పుడమికి దిగిన సౌందర్యదేవతగా, ఒక నిముషం నన్ను మైమరపించినది ఈ బాలికేనా? — మృత్యుముఖంలో వున్న ఈ మర్త్య బాలికేనా? "మృత్యుముఖంలో" అన్న ఆలోచన రాగానే భయంతో నా ఒళ్ళు జలదరించింది. యీ అమ్మాయి మృత్యుముఖంలో వుందా? సంపూర్ణారోగ్యంతో దివ్యసుందర

మూ_ర్తిగా వుండవలసిన యీ బాలికకు మృత్యువాసన్న మైందా? యే పాపమూ యెరుగని యీ పవిత్రమూ_ర్తి మరణావస్థలో వుందా? నాకు ముచ్చెమటలు పోసినాయి. మృత్యువు నన్నే వెంటబడినట్టు-లోకమే ప్రళయోన్ముఖమైనట్లు-ఆ అమ్మాయి మరణానికి నేనే కారణమైనట్లు-ఏదో బాధ-ఏదో అనుతాపం-కార్చిచ్చువలె నా సర్వాంగాలనూ దహిస్తూ వుంది.

ఆ స్థితిలో యెంతసేపు వున్నానో తెలియదు. ఆ అమ్మాయి ఆస్పత్రిలోనుండి బయటికి వచ్చి వూరిముఖం పట్టింది. చేతిలోని సీసాలో యేదో మందు వుంది. మూ_ర్తి చాలా చి_త్తశుద్ధి గల డాక్టరు-మంచి మందే యిచ్చి వుంటాడు-ఆ అమ్మాయి జబ్బు తప్పక నయమౌతుంది. యెంత జబ్బు ఐతే మాత్రమేమి? యీ కాలంలో మందుకు లొంగని రోగమే లేదు. ఆ అమ్మాయి క్రమంగా దూరమౌతూవుంది. చిక్కి పుల్లలవలె వున్న చేతులు-సాగిన మెడ-సగం ఊడిపోయిన జుట్టు-క్రమంగా అస్పష్టమౌతున్నాయి.

"ఏమోయ్ ఆ అమ్మాయి వైపు అంతగా చూస్తున్నావ్?" డాక్టర్ ప్రశ్నకు ఉలికిపడినాను. మూ_ర్తి ఎప్పుడు వచ్చి నా ప్రక్కన నిలబడినాడో గమనించనే లేదు.

"యెవరు మూ_ర్తీ ఆ అమ్మాయి?" అన్నాను డాక్టర్ వైపు చూస్తూ.

"యేం? చాలా అందంగా వుంది కదూ?"

ఆ అమ్మాయి అందాన్ని గురించి డాక్టర్ నాతో ఏకీభవించినందుకు తృ_ప్తితో తల ఆడిస్తూ అన్నాను: "ఔను-చాలా అందంగా వుంది. యెవరా అమ్మాయి?"

"నేనీ ఊరిలో పదేండ్లనుండీ వున్నాను. యింత అంద మైన అమ్మాయిని యెన్నడూ చూడలేదు. కానీ యీ అందం యెన్నాళ్ళుంటుందో ?"

"యేం మూర్తీ ?"

"ఆ అమ్మాయికి క్షయ."

"ఆఁ !" ఆశ్చర్యంతో డాక్టర్ ముఖం వైపు చూసి నాను. డాక్టర్ యేమాలోచిస్తున్నాడో పరధ్యానంగా వున్నాడు.

"యెవరు మూర్తీ ఆ అమ్మాయి ?" అని డాక్టర్ నడిగినాను.

డాక్టర్ ఒక క్షణం నావైపు తీక్ష్ణంగా చూసి విషా దంగా చిరునవ్వు నవ్వుతూ అన్నాడు. "యెవరైతేనేం ? మామూలు పల్లెటూరు మనిషి. ఆపిల్ల తండ్రి ఒక చిన్నరైతు. యీవూరు కాదు-పొరుగూరు. పదిరోజుల నాడు తండ్రీ బిడ్డా నా దగ్గరికి వచ్చినారు. నిన్న వర్షం వచ్చినందువల్ల పొలం పని చూసుకోడానికి తండ్రి వాళ్ళ ఊరికి పోయినాడు."

"క్షయ ఐతే మరి యిక్కడెందుకున్నది ? యెక్క డైనా శానటోరియంకు తీసుకు పొమ్మని చెప్పలేదా నీవు ?" అన్నాను.

"చెప్పడానికేం ? స్విట్జర్లండుకు పొమ్మని కూడా చెప్పవచ్చు. పోనడానికి డబ్బు కావద్దూ ?"

యేమనడానికీ తోచక తలవంచుకున్నాను. డాక్టరే మళ్ళీ అన్నాడు: "వాళ్లు వచ్చిననాడే చెప్పినాను - వెంటనే శానటోరియం పోవలసిన కేసని."

ఆ దివ్య సుందర విగ్రహం నా మనస్సులో పీఠం

వేసుకుంది. తలవంచుకునే అన్నాను. "డబ్బు నేనిస్తాను. ఆ అమ్మాయిని శానటోరియం పంపలేవూ మూర్తీ?"

ఒక క్షణం నిశ్శబ్దంగా వుండి "యిటుచూడు" అన్నాడు డాక్టర్. ఊరూ పేరూ తెలియని ఆ అమ్మాయి మీద అంతటి ఔదార్యం కనబరచినందుకు సిగ్గుపడుతూ తలయెత్తి అతని కండ్లలోకి చూసినాను.

"యెంత మంది క్షయరోగులను నీ సొంత డబ్బుతో రక్షించగలవ్ ? దేశంలో యెన్ని లక్షల మంది యెన్నెన్ని రోగాలతో చస్తున్నారో తెలుసునా ? వాళ్లందరినీ బ్రతికించే శక్తి నీకున్నదా ?" అన్నాడు డాక్టర్.

అతని యెగతాళితో నాలోని అహంకారం పైకి వచ్చి ఆత్మ సమర్థన ప్రారంభించింది. "అందరికీ సహాయం చేయలేనని ఒకరిద్దరికి కూడా చేయనద్దంటావా ?" అన్నాను.

"ఆ అమ్మాయి అందం చూసి నీలో ఔదార్యం అంకురించింది—అంతేకదూ ?"

ఆ ప్రశ్నతో నా వొళ్లంతా సిగ్గుతో కుంచించుకు పోయింది.

మూర్తి నవ్వుతూ నా వీపుతట్టి "సౌందర్య పక్షపాతం నేరం కాదులే. ఐనా ఆ అమ్మాయి సౌందర్యం మన చేతులు దాటిపోయింది. ఒక నెలముందే ఐవుంటే ఆ అమ్మాయిని నేనైనా బ్రతికించగలిగివుండే వాణ్నే" అంటూ మళ్లీ ఆస్పత్రిలోకి పోయినాడు.

పరిపరివిధాల ఆలోచనలతో నా మనస్సు సుడిగుండం మాదిరి వుంది. దిక్కు తెలియక రోడ్డు వెంట ఊరి బయటికి దారి తీసినాను. రోడ్డంతా బురద. అక్కడక్కడా గుంతలలో

నీళ్లు. మనస్సులో అర్థమూ గమ్యమూ లేని ఆలోచనలు- ఆలోచనల చుట్టూ ఆవేదన. రోడ్డు కిరువైపులా పొలంమీద యెద్దులూ మనుషులూ పని చేసుకుంటున్నారు-వి_త్తనం వేస్తు న్నారేమో? అదేమీ గమనించకుండా రోడ్డు వెంట నడుస్తున్నాను.

తల మాడిపోయే యెండలో ఒక గంటసేపైనా నడచి వుంటాను. అంత యెండలోనూ యెద్దులు పనిచేస్తూనే వున్నాయి-యెద్దులవలెనే మనుషులు కూడా పనిచేస్తున్నారు. యెద్దులకూ మనుషులకూ తేడా యేమీ కనపడడం లేదు. ఆ యెద్దులమీదనైనా ఆ మనుషులకు కనికరం కలగవచ్చు అప్పుడప్పుడూ-కానీ ఆ మనుషులను కనికరించే నాథుడే కనిపించడు. ఈ యెద్దుల మాదిరీ మనుషులు బ్రతికే పద్ధతినేనా పల్లెటూరి ప్రశాంత జీవితమని మన దేశభక్తులు లొట్టలువేస్తూ వర్ణించేది? నిజమే-యెద్దుల జీవితం ప్రశాంతం గానే వుంటుంది. కన్నబిడ్డలకు క్షయవస్తే బ్రతికించుకుందా మనే ఆరాటంగానీ, బ్రతికించుకోవచ్చుననే జ్ఞానంగానీ లేని యెద్దుల జీవితం ప్రశాంతంగా ఎందుకుండదు?

ఉట్టిపాటుగా వర్షం వచ్చింది. మూడు నిముషాల్లో తడిసి ముద్దయినాను. అనవసరంగా తెచ్చిపెట్టుకున్న నా అవ స్థకు నేనే నవ్వుకొని ఊరిదారి పట్టినాను. హఠాత్తుగా ఒక ఆలోచన వచ్చింది. ఆ అమ్మాయి పరిస్థితి నిజంగా అంత ప్రమాదకరంగా లేదేమో! నా మీద అభిమానంతో-నా డబ్బు ఖర్చుకావడం యిష్టంలేక డాక్టర్ మూర్తి అబద్ధమాడి నాడేమో? త్వరత్వరగా నడుస్తూ ఆస్పత్రి చేరినాను. నా కొరకు యెదురు చూస్తున్న డాక్టర్ వరండాలో వున్నాడు.

"మూర్తీ, ఆ అమ్మాయిని వెంటనే మదనపల్లెకు పంపించు—డబ్బు నేనిస్తాను" అన్నాను.

"ఆమె తల్లితండ్రుల అనుమతి లేకుండానే పంపిసావా ?"

"తల్లిదండ్రులు అనుమతి యివ్వరంటావా ? తమ బిడ్డ క్షేమం కోరరూ వాళ్లు ?"

"యెందుకు కోరరూ? కానీ నీవు క్షేమమనుకున్నదే వాళ్లూ క్షేమమనుకోవాలి గదూ ?"

"యేమిటి మూర్తీ నీవనేది?" అన్నాను విసుగ్గా.

"ఆ అమ్మాయి మొదట వచ్చినరోజే ఆమె తండ్రితో చెప్పినాను—కొన్ని మందులూ, యింజక్షన్‌లూ అర్జంటుగా తెప్పిస్తే తప్ప నేనేమీ చేయలేనని. ఆ తండ్రి యేమన్నాడో తెలుసునా? ఆయుస్సు తీరిన వాళ్లను మందులూ ఇంజక్షన్‌లూ బ్రతికిస్తాయా సార్? అన్నాడు."

"ఛీ—ఆ తండ్రి మనిషేనా ?" అన్నాను తీవ్రమైన అసహ్యంతో.

మూర్తి నావైపు చూసి ఒక విషమహాసం చేసి అన్నాడు: "యేం? పల్లెటూరి రైతులు వేదాంతం మాట్లాడ్తే అసహ్యంగా వుందా? ఈ వేదాంతం మాట్లాడే మన దేశ నాయకులు విదేశాల్లో కూడా పూలదండలు వేయించుకుంటున్నారు. ఈ వేదాంతం చూసుకునే మాది ఆధ్యాత్మిక దేశమని మన జాతీయ నాయకులు రొమ్ములు విరుచుకొంటున్నారు. ఔన్లే—యీ మాటే గొప్పవాళ్లు మాట్లాడ్తే నీవూ చప్పట్లు కొట్టావు. కానీ పల్లెటూరు వాళ్ళు మాట్లాడ్తే అసహ్యించుకుంటావ్."

ఇటువంటి జవాబు వస్తుందని నేనూహించలేదు. దిగ్భ్రమతో మూర్తి వైపు చూస్తూ నిలబడినాను. మూర్తి జాలిగా నవ్వుతూ నా చేయి పట్టుకొని అన్నాడు: "ఆ అమ్మాయి యిక వారం రోజులు కూడా బ్రతికే ఆశలేదు. కానీ నీ మనశ్శాంతి కొరకు మదనపల్లెకు పంపించదలచుకుంటే నేనేమీ వద్దనను. ఆమె తండ్రి రేపో, మరునాడో వస్తాడు—మాట్లాడుదాంలే. యిక పోదాం రా, భోంచేస్తాం."

ఆస్పత్రి ప్రక్కనేవున్న డాక్టర్ యింటికిపోయి తడిసిన గుడ్డలు మార్చుకొని భోంచేస్తున్నాము. నేను అడుగుదామనుకొని మరచిపోయిన ప్రశ్నకు డాక్టరే సమాధానం ప్రారంభించినాడు. "నేనూ ప్రజాసేవ చేయాలనే యీ ఊర్లోనే స్థిరపడిపోయినాను. నా శక్తికొలదీ రోగులకు ఉచితంగా సేవ చేస్తూనే వున్నాను. కానీ యిదేమీ లాభం లేదు. యిది ప్రజాసేవ అనుకోవడం ఆత్మవంచన."

"అదేమిటి మూర్తీ? రోగులకు ఉచితంగా చికిత్స చేయడం ప్రజాసేవ కాదూ?" అని ఆశ్చర్యపడుతూ అడిగినాను.

"నేను యెంతసేవ చేసి యేమి లాభం? ఆ సేవకు ఫలితం వుంటే గదా? ఆ అమ్మాయి ప్రాణం రక్షించగలిగితే గదా నా సేవ ప్రజాసేవ ఔతుంది?"

నాకు అర్థంకాక ప్రశ్నార్థకంగా మూర్తివైపు చూసినాను. మూర్తి నా వైపు చూసినాడో లేదో-యాంత్రికంగా చెప్పుకు పోతున్నాడు: "ఆ అమ్మాయి నిజంగా చావవలసిన అవసరమే లేదు. ఆ అమ్మాయిని రక్షించగల శక్తి వైద్య శాస్త్రానికుంది. ఆ వైద్య శాస్త్రం చదువుకున్న డాక్టర్లా-

నాబోటి వాళ్లు వున్నారు. ఆ అమ్మాయిని బ్రతికించగల మందులూ దేశంలో వున్నాయి విస్తారంగా. కానీ,ఆ అమ్మాయి యిక నాలుగైదు రోజులకంటె యెక్కువ బ్రతకదు. ఆ అమ్మాయి అనవసరంగా మృత్యుదేవతకు ఆహుతి ఔతుంటే అడ్డుపడలేని నా సేవ మానవ సేవ ఔతుందా?"

మూర్తి హృదయంలో యింతవేదన వుందని నే నెన్నడూ ఊహించలేదు. అతని కంఠాన్ని క్రమంగా విషాద చ్ఛాయలు ఆవరించినాయి. "డబ్బును గురించేనా అంటు న్నావ్?" అన్నాను.

"అవును. డబ్బులేంది మందులు రావు. డబ్బులేంది డాక్టర్లు కూడా కొందరు రారు. కానీ డబ్బులేకున్నా రోగాలు మాత్రం వస్తాయి. రోగులూ వున్నారు, మందులూ వున్నాయి డాక్టర్లూ వున్నారు. కానీ వీళ్ల కెవ్వరికీ స్వాతంత్ర్యం లేదు- అందరినీ శాసించే హక్కు డబ్బుకు వుంది."

ఆ డబ్బు నా దగ్గిరా కొంత వుందన్న సంతృప్తితో "అదంతా యెందుకులే మూర్తీ. డబ్బు నేనిస్తాను-ఆ అమ్మా యిని బ్రతికించలేవూ?" అన్నాను.

మూర్తి అదే ధోరణిలో సమాధానం చెప్పినాడు. "నీవంటి దాతలు మన దేశంలో పూర్వంనుండీ వుంటూనే వున్నారు. బలిచక్రవర్తి కాలం నుండీ దాన ధర్మాలు చేస్తూనే వున్నారు. కానీ యెన్ని ధర్మాలు చేసినా దారిద్ర్యం పెరుగుతూనే వుంది-దరిద్రుల సంఖ్య పెరుగుతూనే వుంది. -అన్నానికి మొగంవాచిన వాళ్ళ సంఖ్య పెరుగుతూనే వుంది- మందులు కొనలేక మరణాన్నాహ్వానించే వాళ్ళ సంఖ్య పెరుగు తూనే వుంది."

అతని ధోరణేమిటో నాకు అంతు చిక్కలేదు. నా ధ్యాసంతా ఆ అమ్మాయిమీదనే వుంది. "ఆ అమ్మాయి సంగతి చెప్పు మూర్తీ" అన్నాను.

"ఆ అమ్మాయి బ్రతకదని యెన్నిసార్లు చెప్పేది! ఆమె దగ్గినప్పుడంతా రక్తం పడుతూ వుంది. పోనీ బ్రతికినా ఆ అమ్మాయి నొక్కదాన్నే కదా నీ డబ్బు బ్రతికిస్తుంది! ఆ అమ్మాయిలోని అపురూపమైన అందాన్ని చూసి నీవు డబ్బిస్తున్నావు. కానీ దేశంలోని అమ్మాయిలందరూ వాళ్ళ వాళ్ళ తల్లిదండ్రులకు అపురూపంగానే వుంటారు–అందంగానే వుంటారు. వాళ్లకూ బ్రతకడానికి హక్కు వుంది. వాళ్ళందరి హక్కునూ గుర్తించలేని నీ ఔదార్యం ఔదార్యం కాదు. రోగం వచ్చిన వాళ్ళలో కొంతమందిని బ్రతికించడానికీ, తక్కిన వాళ్లకు మరణదండన విధించడానికీ నీ డబ్బుకు రెండధికారాలున్నాయి. మొదటి అధికారం ఔదార్యమైతే రెండవది రాక్షసత్వమౌతుంది."

మూర్తి ధోరణికి నాకీ సారి భయంకలిగింది. మూర్తికి మతి చెడిందా? లేక నాకే మతి చెడిందా? యిక యేం మాట్లాడినా మూర్తి మనస్సు మరీ వికలమౌతుందని మౌనంగా వుండిపోయినాను.

ఫోంచేసిన వెంటనే ఒళ్లు బాగలేదని సాకు చెప్పి పండుకున్నాను. యెండలో నడిచీ, వర్షంలో తడిసీ నాకు నిజంగానే వళ్లు బాగాలేదు. సాయంత్రం మూడు గంటలయ్యే టప్పటికి జ్వరం తగిలినట్లు అనుమానం వచ్చి డాక్టర్‌ను చూడమన్నాను. మూర్తి చూసి రెండు మాత్రలిచ్చి "యేమీ ప్రమాదం లేదులే–కదలకుండా పండుకో" అన్నాడు నవ్వుతూ.

ఆ రాత్రికి జ్వరం యెక్కువైంది. అది నిమోనియానో యేదో. డాక్టర్ నడిగితే "పేరులో యేముందిలే - దిగులు పడకుండా పండుకో" అన్నాడు.

తరువాత నాలుగు రోజులు స్పృహ లేకుండా జ్వరం వచ్చింది. అప్పుడప్పుడూ స్పృహ వచ్చినా ఆ అమ్మాయి విషయం జ్ఞాపకం రాలేదు. ఐదవరోజు ఉదయం జ్ఞాపకం వచ్చి డాక్టర్ నడిగినాను: "ఆ అమ్మాయి యెట్లున్నది మూర్తీ?"

మూర్తి ఒక క్షణం తటపటాయించినట్లు కనబడినాడు. తరువాత స్థిరంగా నావైపు చూస్తూ పాఠం అప్పగించినట్లు అన్నాడు: "నీ అందమైన అమ్మాయి చచ్చిపోయింది-నిన్న ఉదయం రక్తం క్రక్కుతూ చచ్చిపోయింది."

(మే 1958)

# రాఘవయ్య రాజకీయాలు

రత్నమ్మకు మొదట్నుంచీ తన మగని గొప్ప తనం మీద అమోఘమైన విశ్వాసం. పెండ్లికి ముందు తన కాబోయే భర్త పేరు రాఘవరావు, B. A. L. T., 'అని విన్నప్పుడు ఆమె కన్యా హృదయం గర్వంతో గంతు లేసింది. పెండ్లి చేసుకొని, తనకింక జయించదగిన ప్రపంచాలే లేవన్నంత సంతృప్తితో ఆమె అత్తగారింటికి వచ్చింది. అత్తగారింట్లో అందరూ—అంటే అత్తా మామా—తన భర్తను రాఘవయ్యా అనడం చాలా నామర్దాగా తోచింది. బియ్యేయల్టీ అంతటి వాణ్ని పట్టుకొని మామూలు మనిషివలె రాఘవయ్యా అనడం సహించరాని విషయం అని ఆ రాత్రే ఆమె భర్తతో పేచీ పెట్టింది. పేరులో యేముంది లెమ్మని రాఘవయ్య ఉదాసీనంగా జవాబిచ్చినాడు. రత్నమ్మ వెంటనే అనునయం ప్రయోగించింది; తరువాత ఆగ్రహం చేసింది: ఆ తరువాత కన్నీరు కురిసింది. ఈ ఒక్కొక్క ఆయుధాన్ని సమర్థంగా నిగ్రహించిన రాఘవయ్య, ఆఖరు దశలో అన్ని ఆయుధాలూ

కలసి ఒక్కుమ్మడిగా ఏక ముఖంగా చేసిన దండయాత్రకు జడిసి అర్ధరాత్రయ్యేటప్పటికి దాసోహం అన్నాడు. ఉదయమే యింటిల్లిపాదికీ ఉత్తరువులు జారీ ఐనాయి-రాఘవయ్యను అందరూ రాఘవరావు అనవలసిందే అని.

అటు తర్వాత తన మగడు చేసే నామర్దా పనులన్నీ క్రమంగా ఒక్కొక్కటే అర్థమైనాయి రత్నమ్మకు. అన్నిటి కంటే నామర్దాపని అసలు B. A. L. T. గా వుండి హైస్కూలు టీచర్ పని చేయడమే. వుత్త B. A. లందరూ తాసీల్దార్లుగానూ, డిప్టీకలెక్టర్లుగానూ వుండగా తన మగడు B. A. L. T. రాఘవరావు-కేవలం ఒక అనామక స్కూల్ టీచర్‌గా వుండడమేమని రాఘవయ్యను నిలదీసి అడిగింది— ఒక ఆదివారం రాత్రి రెండవ ఝామున. 'మీ కెట్లున్నదో గాని, నాకేమో నలుగురిలోనూ తలగొట్టినట్లున్నదండీ' అని అడగడం ఆరంభమౌతూనే, అసలుకే మోసం వస్తుందేమో అన్న భయంతో రాఘవయ్య మెదడు వేగంగా పని చేసి, ఘాటైన సమాధానం సమర్పించింది. "యింతకంటె మంచి వుద్యోగం నీవే యిప్పించుమరి-దీనికి రాజీనామా చేస్తాను." అన్నాడు రాఘవయ్య పిరికి పిరికిగానే. సమస్య యెదురు తిరిగేటప్పటికి రత్నమ్మ నోరు కట్టుబడింది గానీ, మనస్సు ఆలోచన లంకించుకుంది. ఒక నెల ఏకాగ్ర చిత్తంతో కృషి చేసి ఆమె ఒక సమగ్రమైన సిద్ధాంతం తయారు చేసింది. తన మగడు చాలా గొప్పవాడనీ - B. A. L. T. ఐన తరువాత గొప్పవాడు కాకపోవడ మేమిటని ఆమె అవగాహనయొక్క పునాది-తన మగడు నిజంగా చాలా గొప్పవాడనీ, ఐతే అతని గొప్పతనం అతనికే తెలియదనీ, వెరసి

మొత్తంమీద అతను తన గొప్పతనం తనకే తెలియనంత గొప్పవాడనీ, అందుచేత అతనికి అనుకూణమూ తన గొప్ప తనాన్ని గుర్తింపజేస్తే తప్ప జీవితంలో వృద్ధికి రాలేడనీ, పతి వ్రత ఐన తనకు–అందులోనూ భారతీయ పతివ్రత ఐన తనకు–అంతకు మించిన పవిత్ర కర్తవ్యం వుండబోదనీ, ఆ సిద్ధాంతం లోని సుస్థిరమైన ప్రాథమిక సూత్రాలు. ఆ పవిత్ర కర్తవ్య నిర్వహణ రత్నమ్మ ఆ రాత్రే ఆరంభించింది. ఆమె వాద బలమూ, వాక్పటిమా, వాడి నాలుకా, వరుసగా మూడు రాత్రులు చవి చూచేటప్పటికి రాఘవయ్యకు తన గొప్పతనం ఒప్పుకోకతప్పింది గాదు. తన గొప్పతనమంతా బేషరతుగా ఒప్పుకొని, తాను నిజంగా ఎంత గొప్పవాడు కాకపోతే తనకు రత్నమ్మంతటి గొప్ప భార్య దొరుకుతుందని రత్నమ్మ గొప్ప తనమూ ఒప్పుకొని, యింకా అనేకవిధాల ఆమెను సంతృప్తి పెట్టి, ఆ అమృతఘడియలోనే ఒక చిన్న వరం కోరినాడు రాఘవయ్య: "నీవు చెప్పినట్లే నడుచుకుంటాను కానీ—ఆ చెప్పేదేదో పగలే చెప్పరాదా" అని. ఆ మాటతో రత్న మ్మకు యే రస సీమాంచలాలు ధ్వనించినాయో! కిలకిల నవ్వి, "మీ మగవాళ్ళంతా యింతేనండీ" అంటూ, అడిగిన వరం కాస్తా అనుగ్రహించింది–ఆరుమాసాల అనంతరం పరి స్థితిని పునఃపరిశీలించే షరతుమీద.

ఆ ఆరుమాసాలలో రత్నమ్మ హృదయకవచంలోని మరికొన్ని బలహీనప్రదేశాలు వెదకి వెదకి తెలుసుకున్నాడు రాఘవయ్య. ఆ ప్రదేశాలమీద నేర్పుగా దెబ్బ తీసి ప్రయో జనాలు పొందే విధానం కూడా ఒకటి అనేక ప్రయోగాలు చేసి రూపొందించుకున్నాడు. జీవితంలో యాదృచ్ఛికంగా

జరిగే ఘటనలన్నీ, దుర్ఘటనలు కూడా, సక్రమంగా వాడు కుంటే సత్ఫలితాలిస్తాయన్న సత్యం కూడా రాఘవయ్య స్వయంగా ఆచరణపూర్వకంగా కనిపెట్టినాడు. ఐదో నెలలో గర్భస్రావమై, రత్నమ్మ చావు బ్రతుకులమీద వున్నపుడు, ఆమెను ఒప్పించడానికి యింతకు మించిన సమయం దొరకదని పాచిక వేసినాడు. వేరే వుద్యోగంకోరకు ప్రయత్నం చేయడం వ్యర్థమనీ, తమకు అంతో యింతో ఆదాయం వచ్చే భూవసతి వున్నందున వుద్యోగం కొరకు మరీ అడ్డమైన వాళ్లనూ ఆశ్ర యించవలసిన దుర్గతి యేమీ లేదనీ, యింతకూ టీచర్ వుద్యో గంలోకంటె ప్రశాంతమైన జీవితం మరెక్కడా వుండదనీ, ఐనా భార్య యింత అపదలో వుండగా తాను తగుదునమ్మా అని ఉన్నత పదవులకొరకు ప్రయత్నం చేయడం మనిషి ఐన వాడు చేయకూడని పని అనీ, యింకా అనేకానేక కార ణాలు చూపించి, మెల్లగ ముఖ్యతీర్మానం ప్రతిపాదించినాడు— హైస్కూల్లోనే అంటిపెట్టుకొని ప్రమోషన్ కొరకు ప్రయత్నం చేయడం అన్నిటికంటె శ్రేష్టం అని. శారీరకంగా మానసికంగా అతి దుర్బలస్థితిలో వున్న రత్నమ్మ, యెదురువాదం చేసే వోపికలేక, భర్త ముఖంలోకి దయనీయంగా ఒక చూపు చూసి, "సరే లెండి" అని మూల్గింది.

ఈ విధంగా దుర్ఘటనలను స్వప్రయోజనాలకు వాడు కోవడం అన్యాయమని తొలి రోజుల్లో అతని అంతరాత్మ కొంత గోల చేసింది. క్రమంగా అతను తగిన శిక్షణయిచ్చి అంత రాత్మను అనుకూలంగా మార్చుకున్నాడు. తరువాత యెన్నేండ్లు గడచినా ప్రమోషన్ రాకపోవడానికి సమాధానాలూ, సంజా యిషీలూ చెప్పుకోవడంలో అతనికి అనేక ఘటనలు తోడ్పడు

తూనే వచ్చినాయి. ఒకసారి అతని తండ్రి మరణించినాడు. మరొకసారి కుంతురు పుట్టింది. యింకొకసారి తల్లి మరణించింది. వేరొకసారి అతనికే చచ్చేటంత రోగం వచ్చింది. ఇటువంటి ఘటనలనన్నిటినీ అతను అదృష్టదేవత అనుగ్రహాలు గానే స్వీకరించి సద్వినియోగం చేసుకున్నాడు. ఈ విధంగా దాదాపు యిరవై యేండ్లు రత్నమ్మతో హోరాహోరి పోరాడి తన మేధస్సంపదనంతా ఆమెను రేయింబగలూ మభ్యపెట్ట డానికే వినియోగించి. హైస్కూల్లో గోడ గడియారం ఆజ్ఞల ప్రకారం యాంత్రికంగా పాఠాలు చెప్పి, హఠాత్తుగా దేశంలో హైస్కూళ్ళ సంఖ్య పెరిగినప్పుడు అనేకులతోపాటు రాఘవయ్య కూడా ఒక హెడ్‌మాస్టర్ ఐనాడు. ఆ ప్రమోషన్ నిత్యజాగరూకమైన తన పాతివ్రత్య మహాత్మ్యమేనని రత్నమ్మ సంతృప్తిపడి వున్న ఒక్క కూతురుకూ పెండ్లి చేసి, రాఘువయ్య మీాద అజమాయిషీ కొంత తగ్గించింది.

రాఘునయ్య రిటైర్ ఐనప్పుడు, రోజూ యింటి పనులు చేయడానికి వస్తూవుండిన హైస్కూల్ నౌకరు యింటివైపే చూడక పోవడంతో రత్నమ్మ ఆత్మాభిమానం మళ్లీ దెబ్బ తిన్నది. అతని గొప్పతనానికి తగిన వుద్యోగమో, కనీసం వ్యాపారమో, యేదో ఒకటి చూడమని ఆమె రాత్రిపూట దండయాత్రలు పునఃప్రారంభించింది. రిటైర్ అయినప్పటినుండీ అన్ని సుఖాలకంటె మధ్యాహ్నం నిద్రకే యెక్కువ విలువ యిస్తున్న రాఘువయ్య ఆమె దండయాత్రలను అంతగా లెక్క బెట్టకుండా "మన యోగ్యతకు తగిన ఉద్యోగంవస్తే ఎందుకు చేయనూ" అంటూ కాలం గడుపుకొస్తున్నాడు. అప్పటినుండి రత్నమ్మ రోజూ యిరుగు పొరుగులను విచారిస్తూనే వుంది—

తన మగనికి, B. A. L. T. రాఘవరావుకు, రిటైర్డ్ హెడ్ మాస్టర్‌కు, తగిన ఉద్యోగం యెక్కడైనా వుందా అని. ఆ నాడే పొరుగింటి మునిసిపల్ కౌన్సిలర్ భార్య సుబ్బమ్మ M. L. C. యెలెక్షన్‌ల విషయం అంతా-అంటే ఆమెకు తెలి సిందందంతా వివరించి, "హెడ్‌మాస్టర్‌గారు వోటడుగుతే, యే టీచరయినా యివ్వనంటాడా రత్నమ్మా" అని ముక్కు మీద వ్రేలేసుకొంది.

ఆ రాత్రి అన్నం తింటూనే రత్నమ్మ పాతివ్రత్యం రాగాలాపన ఆరంభించింది "M. L. C. కావడానికి మీకంటే యోగ్యుడున్నాడా" అని. "ఎలెక్షన్‌కు డబ్బెక్కడుంది ?" అన్నాడు రాఘవయ్య మొదట, అందులో తనదేమీ తప్పు లేదన్నట్లు. "మనకేం, పిల్లా మేకా ? వున్న భూమి అమ్మే యండీ"అన్నది రత్నమ్మ బుజ్జగిస్తూ."నాకు ఓట్లు ఎవరిస్తారూ" అన్నాడు అతను జాలిగా. "అందరూ యిస్తారు. ఎందు కివ్వరూ ?" అన్నది ఆమె ధీమాగా. "ఎప్పుడూ ఏ టీచరుకూ ఏ సహాయమూ చేసి యెరగనే,వాళ్ళను వోట్లు అడిగేదెట్లా?" అన్నాడు అతను, ఆముదం తాగిన అబ్బాయి ముఖం పెట్టి. "సుబ్బమ్మ మొగుడు ప్రతిసారీ మునిసిపల్ కౌన్సిల్ మెంబర్ ఔతూనూ వున్నాడే, యెప్పుడు యెవరికి యే సహాయం చేసి నాడో చెప్పండి ?" అన్నది ఆమె-మీకు కొంచెమన్నా లోక జ్ఞానం లేదే అన్నట్లు చూస్తూ. ఆర్గ్యుమెంటుకు ఒక పాయింటు దొరికిందన్న తొందరలో రాఘవయ్య ధిక్కారంగా "అయితే అర్థ రూపాయకు అమ్ముడు పోయే మునిసిపల్ వోటర్లూ టీచర్లూ వొకటేనంటావా ?" అన్నాడు. రత్నమ్మ ఆశ్చ ర్యంతో కండ్లు పెద్దవి చేసి "చదువుకుంటే మాత్రం మనుషు

లకు బుద్ధులు మారతాయాండీ ? మునిసిపల్ పద్ధతులే కొంచెం నాజూకుగా ప్రయోగించాలిగానీ" అని, అంతలోనే కంఠం మార్చి "అంటే డబ్బిచ్చేరండీ ! వాళ్లను మాటలతోనే బుట్టలో వేసుకుంటే, వాళ్లనూ గౌరవించి నట్లుంటుంది" అన్నది.

ఇక యీ రంగంలో లాభం లేదని రాఘవయ్య ద్వంద యుద్ధంలో రెండవ రంగం మొదలు పెట్టినాడు— "యీ వయస్సులో నాకీ గౌరవాలన్నీ యెందుకు చెప్పు—హాయిగా యింట్లో కూర్చొని నిశ్చింతగా బ్రతక్కుండా ?" అంటూ. ఆ మాటకు రత్నమ్మ చురచుర చూసి, "ఈ వయస్సులో మీరు యింట్లో కూర్చొని చేసేదేముంది చెప్పండి—మీ యోగ్యతకు తగినట్లు పది మందిలో గౌరవమైనా పొందకుండా ?" అని దండించింది. ఇదీ లాభం లేదనుకొని, అతను మరొక వైపునుండి వాదం ప్రారంభించినాడు, "ఒక వేళ నీ ఆశీర్వాద బలంతో M. L. C. నైతాననుకో. ఐతే మాత్రం వొరిగే దేముందీ ?" అని. "అయ్యో నా ఖర్మ !" అని ఆమె అర్జంటుగా నోరు నొక్కుకొని, "M. L. C. ఐతే, యెంత దర్జా, యెంత పలుకుబడి, యెంతెంతటి వాళ్ళతో పరిచయం, యెంత మందిలో యెంత గౌరవం" అంటూ దీర్ఘంగా ఉద్ఘాటించి, "యింత అమాయకునితో యిన్నాళ్ళూ నేనెట్లు కాపురం చేసినానురా దేవుడా" అని సవిలాసంగా తన్ను తానే దెప్పుకుంది. ఆ మాటతో రాఘవయ్య ముఖంమీద చిరునవ్వు అంకురించింది. తానిన్నాళ్లూ యెంత తెలివిగా రత్నమ్మ మీద యెన్ని ఘన విజయాలు సాధించిందీ తలచు

కొని మెల్లగా నవ్వుతున్నాడు అతను. ఈ చిరునవ్వేమిటో అర్థంకాక ఆమె తికమకపడుతూ వుండగానే అతను ఒక ప్రశ్న వేసినాడు, ఈ ప్రశ్నతో రత్నమ్మ యింక తోక ముడువవలసిందే అనుకుంటూ. "టీచర్లు నాకు వోట్లిచ్చినన్ను గెలిపిస్తే, వాళ్ళకు నేను చేయగలిగేదేముంది చెప్పు?" రత్నమ్మ కన్నీళ్ల పర్యంతమై, "యెంత తెలివి తక్కువండీ మీకూ—వాళ్లకు చేయమని యెవరన్నారూ—మన సుఖం మనం చూసుకోవాలగానీ" అని చేతులు త్రిప్పుతూ వచ్చి అతని ప్రక్కన కూర్చొని, "నేను లేకపోతే మీరెట్ల బ్రతుకుతా రండీ" అని గోము చేసింది. రాఘువయ్య ఒక మూరెడు దూరంగా జరిగి, యింక చరమాయుధం ప్రయోగిస్తే తప్ప ప్రయోజనంలేదని, ముఖం అవతలివైపు త్రిప్పుకొని"నీ వెన్నైనా చెప్పు, ముక్కూ ముఖమూ చూడని వాళ్లనందరినీ వోట్లడిగి, ప్రతి వెధవతోనూ లేదనిపించుకొని, నేనవమానం పాలు కాలేను" అన్నాడు. ఆ మాట వెంటనే ఆమె అమాంతం అతన్ని కౌగలించుకొని, అతని భుజంమీద తల మోపి వలవల యేడ్చింది; కన్నీరు మున్నీరుగా యేడ్చింది; యింత పతివ్రతను యింతగా యేడిపిస్తే మీ పరలోకాలకు గూడా ప్రమాదమే గదా అంటూ యేడ్చింది; రేపే రైలు క్రింద పడతానంటూ యేడ్చింది; అనేక స్వరాలలో అనేక భంగిమలలో యేడ్చింది.

రాత్రి మూడుగంటల దాకా వాదోపవాదాలూ, తర్కవితర్కాలూ చేసి, రత్నమ్మ కన్నీళ్లతో ఒక భుజ మంతా తడిసిన తర్వాత, రాఘవయ్యకు హఠాత్తుగా మెరుపు వంటి ఆలోచన వచ్చింది. "ఈ పీడకంటె నామినేషన్ వేస్తే య్యేం? యెంతపోయినా డిపాజిట్ మొత్తమే గదా పోతుంది?"

అని. ఇంత గొప్ప ఆలోచన తనకే వచ్చినందుకు తన్ను తానే అభినందించుకుంటూ, అప్పుడే తన అంగీకారం తెలియజేసి, మూడు నిముషాల్లో రత్నమ్మను లాలించి, చాలా ప్రొద్దు పోయిందని వెంటనే నిద్రపోవడానికి అనుమతి కోరినాడు.

నామినేషన్ వేసి నాలుగు రోజులు ప్రచారం చేసే టప్పటికి రాఘవయ్య అంచనాలన్నీ తల్లక్రిందులైనాయి. తన సామర్థ్యమో, తన వెంటవున్న సుబ్బమ్మ మగని సామర్థ్యమో అడిగిన వాళ్లెవ్వరూ వోటు యివ్వమని అనలేదు. డిపాజిట్ పోతుందనుకొని, రత్నమ్మను మభ్యపెట్టడానికి మాత్రమే ప్రచారానికి బయలుదేరిన రాఘవయ్య గెలిచే అవకాశాలు విపరీతంగా కనబడేటప్పటికి, హైదరాబాదులో M. L. C. లకు తగిన సౌకర్యాలున్నాయి గదా అని విచారించడం మొదలు పెట్టినాడు—ముఖ్యంగా మధ్యాహ్నం నిద్రపోవడం వగైరా సౌకర్యాలు. ఆ విషయంలో M. L. A. లకూ M. L. C. లకూ యేమీ లోటు వుండదని మునిసిపల్ కౌన్సిలర్ యిచ్చిన హామీతో, రాఘవయ్య దృష్టి అంతా హైదరాబాదుమీదనే పడింది-సంవత్సరానికి ఆరునెలలైనా రత్నమ్మవంటి పతివ్రతతో వియోగసుఖం అనుభవించవచ్చు గదా అని.

(జూన్ 1958)

# ఆత్మహత్య

వంట పనంతా ముగించుకొని వంట యింట్లోనే గోడ కాను కొని కూర్చుంది సీతమ్మ దిగులుగా. ఆమె ముప్పై యేండ్ల జీవితంలో యింత దిగులెన్నడూ అనుభవించి వుండ లేదు. ఉదయంనుండీ యేదో అర్థం కాని బాధ, అవ్యక్త మైన ఆవేదన, ఆమె మనసును ఆవరించినాయి. ఆమె ఈ యింటికి వచ్చింది కూడా యీ దినం ఉదయమే... యీ ఊరికి రావడమూ యీ దినమే. ఈ యింట్లో అడుగు పెట్టినప్పుడే ఆరంభమైనట్లుంది ఆమె దిగులు.

పల్లెటూర్లో పుట్టి పెరిగిన సీతమ్మకు టౌనులో సుఖా లన్నీ సులభంగా అందుబాటులో వుంటాయని ఒక అస్పష్ట మైన అభిప్రాయం వుండేది. అందుకనే ఆమె ఉత్సాహంగా బయలుదేరింది, తొలిసారిగా టౌను కాపురం చేయడానికి. తీరా టవునుకువచ్చి తాను కాపురం చేయవలసిన యీ యిల్లు చూసేటప్పటికి ఆమె ఉత్సాహమంతా నశించింది. అప్పుడే ఆమె క్రిష్ణమూర్తితో పేచీ పెట్టింది—"ఇదేం కొంపండీ!

యింత కంటే జైల్లో వున్నా బాగుంటుందే!" అని. "బాగానే వుంటుంది. కానీ యే ఘనకార్యమూ చేయందే, నిన్ను జైల్లో యెవరుండనిస్తారూ?" అన్నాడు భర్త. ఆమె కంఠం హెచ్చించి విసుగ్గా అన్నది: "అది గాదండీ! ఈ వూళ్లో యింత కంటె మంచి ఇండ్లు లేవా అని?" కృష్ణమూర్తి కంఠం తగ్గించి శాంతంగా జవాబు చెప్పినాడు: "యెందుకు లేవూ? అద్దెకొద్దీ వుంటాయి. ఈ యింటికి పదిరూపాయలు అద్దె. మరి నా జీతంలో యింటికిగాను ఎంత ఖర్చుపెట్టమంటావో చెప్పు" ఆ తరువాత ఆమెకు నోట మాట రాలేదు. బడిపంతులకు వచ్చే జీతంలో యింతకంటే మంచి యిల్లు ఈ ఊరిలో దొరకదని ఆమెకు అర్థమైంది. అప్పటినుండే ఆమెలో దిగులు ఆరంభమైనట్లుంది. పగలంతా కొత్త సంసారం సర్దుకోవడములో ఆ దిగులేమీ తగ్గలేదు. పైగా మధ్యాహ్నంనుండి జైలువంటి యింటిలో ఒంటిగా వుంది. యెన్నడూ యెరుగని ఒంటరితనం దిగులుకు తోడై, సాయంత్రమయ్యేటప్పటికి గుండెల్లో బరువుగా తయారైంది.

దిగులుగా కూర్చున్న సీతమ్మ మనసులో ఆమెకు తెలియకుండానే ఆలోచనలు బయలుదేరినాయి. ఈయన త్వరగా యింటికొస్తే బాగుండును. ఈ కొత్త ఊళ్లో నన్నొంటిగా వదలిపెట్టి యింకా యెక్కడ తిరుగుతున్నాడో?...... యిరుగు పొరుగులవారి నెవరినైనా త్వరగా పరిచయం చేసుకోవాలి. లేకపోతే రోజూ పగలంతా యీ బందిఖానాలో ఒంటిగావుంటే పిచ్చెత్తుతుంది......సాయంత్రం 5 గంటలకే స్కూలు ఐపొయ్యేంటుంది. ఈ పాటికి యెప్పుడో యింటికి రావలసింది......ఒకరిద్దరు పిల్లలున్నా సరిపొయ్యేది. కొంత

పొద్దుపోతుంది వాళ్లతో......పిల్లలుంటే ఈ సంసారం యింకా దుర్భరంగా వుంటుందంటాడు. నిజమేనేమో!...... ఐనా ఈ ఒంటరితనం కంటె ఆ బాధే మేలేమో?.........

హఠాత్తుగా సీతమ్మ ఆలోచనలకు అంతరాయం కలిగింది. వెనుకవైపు సందులో కేకలూ అరుపులూ వినబడినాయి. ఆమె బద్ధకంగా లేచి సందు తలుపు తెరచి చూచింది. ఏ డెనిమిది మంది పోలీసులు అటూ యిటూ పరుగెత్తుతున్నారు- ఇద్దరాడవాళ్ళు కంగారుగా పరుగెత్తుతున్నారు-పోలీసు వాళ్ళను తప్పించుకోడానికేమో? పోలీసు వ్యవహారమని అర్థమౌతూనే ఆమె తిరిగివచ్చి యథాస్థానములో కూర్చుంది. సందులో పోలీసు బూటు కాళ్ల చప్పుడు వినపడుతూనే వుంది.

ఐదునిము షాలు -పదినిముషాలు - గడచింది. అప్పుడు జ్ఞాపకం వచ్చింది ఆమెకు-సందు వాకిలి మూయకుండా వచ్చిన సంగతి. లేచి తలుపు మూసివస్తామని అనుకుంటూ వుండగానే నాలుగేండ్ల పసిపిల్ల పరుగెత్తుకుంటూ లోపలికి వచ్చి, తలుపు చాటున నక్కింది. సీతమ్మ ఆశ్చర్యంగా "యెవరు? యెవరు పాపా నువ్వు?" అని అడిగింది తొందర తొందరగా. ఆ అమ్మాయి ఉలికిపడి సీతమ్మ వైపు తిరిగింది. గుడ్డిలాంపు వెలుతురులో అమ్మాయి ముఖం మసకగా కనిపించింది. ఆ ముఖం చూస్తూనే సీతమ్మకు అర్థమైంది—ఆ అమ్మాయి యింతవరకు భయంతో యేడుస్తూ వుండిందని, ఆ యేడుపు ముఖం చూసేటప్పటికి ఆమె బద్ధకమంతా వదలి లేచి వాకిలి దగ్గరికి పోయింది. తలుపు గడవేసి, "ఏమమ్మా నిన్నేవరేమన్నారు?" అని అమ్మాయిని బుజ్జగిస్తూ యెత్తుకొని.

వంట గది దాటి ముందు గదిలోకి వచ్చి కూర్చుంది. అంత వరకు మౌనంగా వుండిన అమ్మాయి సీతమ్మ ముఖంలోకి నిదానంగా చూసి, "అమ్మ అమ్మ" అంటూ బావురుమని యేడ్చింది. సీతమ్మ యింకా బుజ్జగిస్తూ "మీ అమ్మ కేమైందమ్మా? చెప్పు-యేడ్వకుండా చెప్పు" అని అడిగింది.

ఏడ్పు కొంచెం తగ్గించి అమ్మాయి జవాబు చెప్పింది "పోలీసులు పట్టుకున్నారు."

"ఎందుకు?" సీతమ్మ ఆదుర్దాగా అడిగింది.

అమ్మాయి సమాధానం చెప్పకుండా ఏడ్పు మళ్ళీ యెక్కువ చేసింది. దీనంగా ఏడ్చే ఆ అమాయకమైన పసి ముఖం చూసి సీతమ్మకు కండ్లలో నీళ్లు తిరిగి, అమ్మాయిని రొమ్ముకు హత్తుకొని లాలించింది. మూడు నిముషాలలో ఆ అమ్మాయి గట్టిగా ఏడ్వడడం మానుకుందిగానీ, నిశ్శబ్దంగా వెక్కి వెక్కి ఏడుస్తూనే వుంది. సీతమ్మ అమ్మాయిని చాప మీద పండబెట్టి జోకొట్టుతూ నిద్ర బుచ్చింది.

నిద్రపోతున్న అమ్మాయి ముఖంవైపే చూస్తూ కూర్చుంది ఆమె. పసిముఖం అమాయకంగా, అసహాయంగా వుంది; కోమలంగా, కరుణాజనకంగా వుంది; దీనంగా వేయి కంఠాలతో తన సహాయాన్ని అర్థిస్తున్నట్లుంది. "ఈ అమ్మాయిని పెంచుకుంటే?" హఠాత్తుగా కలిగిన ఆలోచనతో ఆమెకు వివశత్వమంతా వదలి పసిపాపవైపు తేరిపారజూచింది. నిద్రాణమైన సంతానవాంఛ ఆమెలో పొంగులు వారింది. జాగృతమైన మమకారం హృదయంలో గంతులు వేసింది. చేతులు చాచి నిద్రపోతున్న పసిపాపను యెత్తుకొని మరొక సారి రొమ్ముకు హత్తుకొంది. నిద్రలో దీనంగా మూల్గిన పసి

పాపను మళ్ళీ పండబెట్టి ఆప్యాయంగా వాత్సల్యంతో ఒళ్లంతా నిమిరింది.

క్రిష్ణమూర్తి తలవాకిలి తెరచుకొని యింట్లోకి వస్తూనే అన్నాడు: "కొత్త ఊళ్లో అప్పుడే స్నేహితులు దొరికినారే!"

సీతమ్మ ఉత్సాహంగా చెప్పింది: "ఇటు వచ్చి అమ్మాయిని చూడండి."

అతను అమ్మాయి ప్రక్కన కూర్చొని చూస్తూ, "అమ్మాయి కేం–ముద్దుగా వుంది" అన్నాడు.

"ముద్దు సరే–ఆ ముఖం చూస్తే మనమే పెంచుకుందామని అనిపించడం లేదూ?" సీతమ్మ భర్త ముఖంలోకి ఆశగా చూసింది.

క్రిష్ణమూర్తి చిరునవ్వు నవ్వుతూ అడిగినాడు: "ఇంతకూ యీ అమ్మాయి యెవరని? తల్లిదండ్రులు లేరా?"

ఆమె విచారంగా జవాబు చెప్పింది. "యెవరో పాపం, సందులోనుండి యేడుస్తూ వచ్చింది. వాళ్ళమ్మను పోలీసులు పట్టుకున్నారట."

క్రిష్ణమూర్తి నిట్టూరుస్తూ లేచి నిలబడినాడు–మౌనంగా పోయి మంచంమీద కూర్చున్నాడు.

సీతమ్మ కుతూహలంగా అడిగింది: "యీ అమ్మాయి యెవరో మీకు తెలుసునా?"

అతను నిర్లిప్తంగా జవాబు చెప్పినాడు: "తెలియదు."

"మరి?........................"

ఒక నిముషం నిశ్శబ్దంగా గడచిన తర్వాత అతను ఆ ప్రశ్నకు జవాబు చెప్పినాడు – మెల్లగా – తప్పు చేసిన

వాని మాదిరీ: "నాకీ సాయంత్రమే తెలిసింది_ఆ సందులో అందరూ భోగం వాళ్ళే."

సీతమ్మ కొక్క క్షణం మనసు నిశ్చేతనమైంది. తరువాత మెల్లగా అమ్మాయి ముఖంవైపు చూసింది. మళ్ళీ భర్త ముఖం వైపు చూసింది. తిరిగి పసిపాప ముఖం వైపు చూసింది. ఆ ముఖం అదే విధంగా వుంది-అమాయకంగా-అసహాయంగా_కోమలంగా_కరుణా జనకంగా. ఆ ముఖములో యెక్కడా పతిత జీవిత లక్షణాలు లేవు - పాపపు ఛాయలు లేవు.

"యేం_అమ్మాయిని పెంచుకుందా మంటావా?" క్రిష్ణమూర్తి మెల్లగా అడిగినాడు.

ఆ ప్రశ్న విని సీతమ్మ ఆ అమ్మాయి తల్లిని ఊహించుకోబోయింది. వెంటనే అసహ్యంతో వొళ్లంతా గగుర్పొడిచింది. "ఛీ! ఒళ్లమ్ముకొని యెట్లా బ్రతుకుతారో_సిగ్గయినా లేకుండా" అన్నది, తన అసహ్యమంతా కంఠంలో కూరి.

క్రిష్ణమూర్తి ఒక విషమహాసం చేసి అన్నాడు: "ఒళ్లమ్ముకోకుండా యెవరు బ్రతుకుతున్నారని?"

ఆమెకు చిరాకు కలిగింది. "ఆడవాళ్లందరూ అంతే నంటారా?"

"ఆడవాళ్ళే కాదు. మగవాళ్ళు కూడా అంతే— కొందరు దేహం మాత్రమే అమ్ముకొంటారు. కొందరు బుద్ధి అమ్ముకుంటారు. కొందరు హృదయమే అమ్ముకొంటారు— యేదీ అమ్ముకోకుండా బ్రతికే పద్ధతి మన దేశంలో యింకా యెవరూ కనిపెట్టలేదు."

ఈ వేదాంతమేమిటో ఆమెకు అర్థం కాలేదు. అర్థం

చేసుకునే ప్రయత్నం కూడా ఆమె చేయలేదు. అర్థం కాని వేదాంతం అప్పుడప్పుడూ అతని నోటి వెంట వినడం ఆమెకు మామూలే.

"చెప్పు-పెంచుకుందా మంటావా ?" క్రిష్ణమూర్తి మళ్ళీ అడిగినాడు. అతని కంఠంలో పల్చని పరిహాసం వున్నట్లుంది.

సీతమ్మ చూపు మళ్ళీ అమ్మాయి ముఖం మీదికి పోయింది. ఆమెలోని మమకారం మళ్ళీ కంఠం విప్పబోయింది. కానీ ఆమె రక్తంలో జీర్ణించిన పురాతన పతివ్రతలందరూ సమైక్యంగా ఆందోళన చెందారు-ఏకగ్రీవంగా హాహాకారం సల్పినారు.

వీలులేదు-యీ అమ్మాయిని పెంచుకునే అవకాశం లేదు-అది సాధ్యం కానే కాదు. ఆమె హృదయాకాశంలో గాఢాంధకారం వ్యాపించినట్లయింది. యెవరో తన్ను మోసం చేస్తున్నారు. వెలుగు చూపి, ఆశ రేపి, హఠాత్తుగా అగాధం లోకి త్రోసినారు. యెవరో ? యెవరో యీ వంచకులు ? యెవరో యీ కనపడని శత్రువులు ? తాను వంచింపబడింది. వంచిత హృదయంలో కించ కలిగింది. ఆ వేదనకు అవమానం తోడైంది. ఆమెకు యెవరిమీదనో కోపం వచ్చింది. యెవరి మీదనో ఆమెకే తెలియదు. హృదయం ఒక సుడి గుండం -అస్పష్ట వేదనలు వెలిగ్రక్కే విషభుజంగం-అజ్ఞాత శత్రువులు దాగిన కీకారణ్యం.

సీతమ్మ మౌనంగా కూర్చుంది. ఆమె రక్తమంతా గడ్డ కట్టినట్లుంది. శరీరం నిశ్చేతనంగా వుంది. అన్నీ మరచి, భర్త

భోజనం సంగతి మరచి, భర్తతో మాట్లాడడం కూడా మరచి, ఆమె మౌనంగా కూర్చుంది.

ఉన్నట్లుండి సందు తలుపు దబదబా చప్పుడైంది. "యెవరో పిలుస్తున్నారు చూడు" అన్నాడు క్రిష్ణమూర్తి. సీతమ్మ లేచిపోయి సందు తలుపులు తెరిచింది. ఎదురుగా వున్న స్త్రీ "మా పద్మ వచ్చిందా?" అని అడిగింది. ఔనంటూ సీతమ్మ ఆ స్త్రీని ముందు గదిలోకి పిల్చుకొని వచ్చింది. నున్నగా దువ్విన తల, తలనిండా పూలు, గుడ్డి వెలుతురులో కూడా స్పష్టంగా కనపడే ముఖంమీది పౌడరు, అంగరేఖలు ఆవిష్కరించే చీర, యవ్వనం స్ఫురింపచేసే రవిక; సీతమ్మ కంతా అసహ్యంగా వుంది. ఆమెను త్వరగా పంపించే ఉద్దేశంతో "యిదిగో మీ పద్మ-యెత్తుకపో" అన్నది.

క్రిష్ణమూర్తి ఆమెను అడిగినాడు. "నిన్ను పోలీసులు పట్టుకపోలేదా?"

"పోలీస్ స్టేషన్‌లో కేసు రాసుకొని వదలిపెట్టినారు. రేపు కోర్టులో ఐదో పదో వడ్డిస్తారు. అదంతా మాకు మామూలేలెండి" ఆమె చిలిపిగా సమాధానం చెప్పి కిలకిల నవ్వింది.

ఆమె ప్రవర్తన సీతమ్మకు దుర్భరంగా వుంది.

క్రిష్ణమూర్తి ఆమె ముఖంలోకి పరీక్షగా చూస్తూ "పద్మను మేము పెంచుకుంటాం-యిస్తావా?" అన్నాడు.

ఆమె మరింత వెకిలిగా నవ్వుతూ "మా పద్మను ఉద్ధరించాలనుకున్నారా? మీ ఉద్ధరింపులు మాకు వద్దు లెండి" అన్నది.

సీతమ్మ కోపం పట్టలేకపోయింది. "నీ బిడ్డ మర్యాదగా బ్రతకడం నీ కిష్టం లేదా ?" అన్నది తీవ్రంగా.

"మర్యాద !" అంటూ ఆమె పగలబడి నవ్వింది. మరు క్షణంలోనే నవ్వు అణచుకొని, గంభీరంగా జవాబు చెప్పింది: "చిన్నప్పుడు నేనూ మర్యాదగానే బ్రతికినాను. మగడు చచ్చిన తర్వాతమర్యాదగా బ్రతకలేక నేయీవృత్తిలో దిగినాను. మొదట చాలా బాధపడినాను—చిన్నప్పుడు నేర్చుకున్న మర్యాదతో. ఆ మర్యాద నేర్పకుంటే మా పద్మకు ఆ బాధలు కూడా వుండవు. తప్పకుండా నాకంటె సుఖపడుతుంది."

కృష్ణమూర్తి సానుభూతి కంఠంతో అన్నాడు–"ఔను పాపం–భర్తలేని స్త్రీకి మన సంఘంలో అనేక బాధలు వుంటాయి."

"మీ పాపం పుణ్యం మాకేం అక్కర్లేదు లేండి." అంటూ ఆమె పద్మ నెత్తుకొని విసురుగా వెళ్ళిపోయింది.

ఆమె పోయిన తర్వాత క్రిష్ణమూర్తి భార్యతో అన్నాడు : "నీకంటె చిన్నది చూడు. జీవితంలోని లోతులన్నీ చూచింది. ఐనా గుండె చెడలేదు."

సీతమ్మ రోషంతో బుసకొట్టింది : "ఛీ! యిదీ ఒక బ్రతుకేనా ? యెంత సిగ్గు లేకుండా తయారైందో చూడండి. యీ బ్రతుకు బ్రతకపోతేయేం."

"ఆత్మహత్య చేసుకొమ్మంటావా ?" క్రిష్ణమూర్తి శాంతంగా అడిగినాడు.

"ఇది మాత్రము ఆత్మహత్య కాదూ ? అంతకు మించిన ఆత్మహత్య కదూ ఈమె చేస్తున్న పని?" సీతమ్మ రెట్టించింది.

అతను నవ్వుతూ సమాధానం చెప్పినాడు. "ఈమె దేహాన్నిగాక ఆత్మనే చంపుకుంటున్నదంటావ్ ? అంతే కదూ?
...కాదు. ఈమె ఆత్మను చంపుకోలేదు. అభిమానాన్ని మాత్రమే చంపుకుంది. ఈమెను ఆ సందులోకి త్రోసినవాళ్ళు ఆత్మను చంపుకున్న వాళ్లు. ఈమెను ద్వేషించే వాళ్ళు ఆత్మను చంపుకున్న వాళ్ళు. ఈమెను శిక్షించే వాళ్ళు ఆత్మను చంపుకున్న వాళ్ళు."

ఆ మాటల అర్థం కొరకు సీతమ్మ భర్త ముఖమంతా వెదకింది.

(ఆగస్టు 1958)

# ఎదురు తిరిగిన కథానాయకుడు

కథానాయకుని మీద పట్టరాని కోపం వచ్చింది నాకు. నేను సృష్టించిన వ్యక్తి, నా చెప్పుచేతల్లో మెలగవలసిన పాత్ర, నేను కూర్చోమంటే కూర్చొని నేను లేవమంటే లేవవలసిన వెధవ, నా మీదికే తిరుగుబాటు చేస్తాడా ? నాకు కోపం రాదా మరి – మీరే చెప్పండి. నేను పుట్టమంటే తాను పుట్టి నాడు, నేను బ్రతకమంటే తాను బ్రతికినాడు, నేను చావ మంటే తాను న్యాయంగా చావాలి ; కానీ నేను అతన్ని చావ మనికూడా అనలేదు, (అంతమాట నేను యెట్లంటాను ?) నేను చెప్పినట్లు నడచుకొమ్మన్నాను–అంతే. మూర్ఖుడు పంతంపట్టి కూర్చున్నాడు – ఎంత చెప్పినా వినమంటే వినమంటాడు. "నాప్రవర్తనను నీవు నిర్ణయించడమేమి"టని యెదురు తిరిగి మాట్లాడినాడు. నాకు కోపం రాకూడదేమో మీరే చెప్పండి. ఎవరనుకున్నాడో తాను ? నాకు యిష్టం లేకపోతే తనకు జన్మే లేదని తెలుసుకోలేని అల్పుడు, నాకు కోపం వస్తే తన బ్రతుకు యేమౌతుందో ఊహించుకోలేని నీచుడు. అమాంతం కోపం

వచ్చి కథానాయిక చేతులతోనే అతని గొంతు పిసికేయించా లనుకున్నాను. లేకపోతే అతనితోనే ఆత్మహత్య చేయిస్తే అంతకంటె బాగుంటుందనుకున్నాను – వెధవకు బుద్ధి చెప్పి నట్లుంటుంది.

అసలు వచ్చిన చిక్కు అక్కడే. అతన్ని చంపడం నాకు మొదటినుండీ యిష్టంలేదు. అతను చస్తే యింకేముంది ! హఠాత్తుగా కథ విషాదాంతమై కూర్చోదూ ? నా కథ సుఖాంతం కావాలని నా కోరిక ; నా కథానాయకుడు శాశ్వతంగా, ఆ చంద్రతారార్కం, సుఖపడాలని నా ఆశ – అతన్ని నేను సృష్టించిందే అందుకు. కానీ వెధవ నాకే యెదురు తిరిగి కూర్చున్నాడు. నేను చెప్పినట్లు నడచుకోడానికి తనకు సిగ్గౌతుందట–యేం మాటలో చూడండి. తన సృష్టి స్థితి లయాల కన్నింటికీ నేను కారణ భూతుణ్ని ; తన బ్రతుకంతా నా సంకల్ప వికల్పాల అధీనం ; నా ఔదార్యమే అతని జీవం ; నా ఆదరణే అతని అంగరక్ష ; నా ఆశ్రయం లేకపోతే అతను కేవలం నిర్జీవుడు. నేను 'హుఁ' అంటే అతని రూపనామ క్రియలే నశిస్తాయి. నాకు కోపంవస్తే అతనికి యీ పద్నాలుగు లోకాలలోనూ ఉప్పురాయి పుట్టదు—ఊపిరి పీల్చుకోడానికి గాలికూడా దొరకదు. అటువంటి అనామకుడు, నా కాలిధూళి రేణువునుకూడా అతి పవిత్రంగా శిరసావహించవలసిన అల్పుడు, ఆజన్మాంతం నాకు కృతజ్ఞత చూపించవలసిన హీనుడు, నన్నే ధిక్కరించినాడంటే నా కెంత కోపం రావచ్చునో మీరే ఊహించండి. పోనీ, అతనికి నేనేదైనా అన్యాయం తలపెట్టినానా అంటే–ఛీ, యే కథకుడైనా తన పాత్రకు తానే అన్యాయం చేస్తాడా ?—అందులోనూ కథా

నాయకునికి ? ఒకవేళ విషాదాంత కథలు వ్రాసే వాళ్లు ఆ పని చేస్తారేమో కాని, నాఉద్దేశమంతా సుఖాంత కథవ్రాయాలనే-నా ప్రయత్నమంతా నా కథానాయకుణ్ని సుఖపెట్టాలనే—నా ప్రయాస అంతా అతని క్షేమంకొరకే. ఆ మాట యెన్ని సార్లు చెప్పినా వెధవకు అర్థమే కాకపోతే! వట్టి కృతఘ్నుడు-నిలువునా పాతినా పాపం వుండదు, ఇటువంటి వాళ్ళను.

యెంత శ్రద్ధతో, యెంత దూరదృష్టితో, అతనికి ఎన్ని సౌకర్యాలు కల్పించినానని! అతని కొరకు ఎంతో అమూల్యమైన కథావస్తువును యెన్నుకున్నాను. యెంతో మనోహరమైన దేశకాల పరిస్థితులను సమకూర్చినాను. యే కథానాయకునికీ దొరకని దివ్యసుందర మూర్తిని కథానాయికను చేసినాను. శిరీష పేశలమైన హృదయం ఆమెకు అమర్చినాను. కథానాయకుని మనసారా ప్రేమించమని ఆమెను ఆదేశించినాను. పాపం ఆ అమ్మాయి ఆక్షేపణ లేకుండా ఒప్పుకుంది. అటువంటి కథానాయిక దొరికినందుకైనా ఆ వెధవ నాకు కృతజ్ఞత చూపించాలి. అంతటి అందమైన అమ్మాయి, తనను మనస్ఫూర్తిగా ప్రేమించే అమ్మాయి, బేషరతుగా తనకు వశం కావడానికి సిద్ధంగా వున్నది. న్యాయంగా మనిషి ఐనవాడెవడైనా ఆ పరిస్థితుల్లో కుక్కిన పేను మాదిరి ఆ అమ్మాయిని స్వీకరించి, బ్రతికినంతకాలం చచ్చినట్టు సుఖపడతాడు. కానీ ఈ వెధవ మనిషైతేనా-వట్టి మూర్ఖుడు - జడుడు-కించిత్తైనా లోకజ్ఞానం లేని నీచుడు.

అతనికేదైనా లోటు చేసినానా అంటే అదీ లేదు. అతను కోరకముందే కోరదగినవన్నీ సమకూర్చి పెట్టినాను. ఇరవై రెండు సంవత్సరాల పూర్ణ యౌవనం యిచ్చినాను.

సంపూర్ణ ఆరోగ్యమూ, ఆకర్షణీయమైన ఆకారమూ, కావలసినంత ఐశ్వర్యమూ యిచ్చినాను. ఇక విద్యాబుద్ధు లంటారా – ఆ విషయంలో ఏ కథకుడూ చూపని ఔదార్యం చూపించినాను. శంకరాచార్యు నంతటి మేధావిని చేసినాను. వేదవ్యాసు నంతటి విద్యావంతుని చేసినాను. యేసుక్రీస్తు సౌజన్యం సమకూర్చినాను. గాంధీ మహాత్ముని చిరునవ్వు తగిలించినాను. ఇవన్నీ చాలవేమో అని గౌతమ బుద్ధుని విశాల హృదయంకూడా అతనికి అంట గట్టినాను. ఇంతకంటె యే కథకుడు చేయగలడు చెప్పండి. త్రిజగన్మోహిని ఐన ప్రేయసిని కూడా యిచ్చినానని ముందే చెప్పినాను గదూ ? ఇంక నేను చెప్పినట్లు నడచుకోడానికి అతనికేం రోగమూ అని !

వ్యాసుడూ, శంకరుడూ వగైరా అన్నానని అతను మరీ పూర్వకాలపు మనిషి అనుకునేరు. అబ్బే–వాళ్ళను కేవలం ఉదాహరణగా చెప్పినాను. నా కథానాయకుణ్ని అంత ఛాందసుణ్ణి చేస్తానా ? త్రికాలాలకూ ఆదర్శప్రాయుడైన కథా నాయకుని సృష్టించాలనే నా ఆరాటమంతా. ఇరవయ్యో శతాబ్దపు సమకాలిక అధునాతన నవయువకుణ్ణిగానే తయారు చేసినాను అతన్ని ; ఆధునిక విజ్ఞానమంతా యిచ్చినాను; విశ్వ సాహిత్యమంతా అతనితో ఆపోశన పట్టించినాను. ఇంతకంటే యే కథకుడైతే యేమి చేయగలడో చెప్పండి. పోనీ మీరే ఆలోచించండి–అతని కింకా యేమైనా కోరదగిన దున్నదేమో.

అక్కడికీ యెంతో ఓర్పుతో, ఎంతో ఔదార్యంతో (యెంతైనా నా పాత్రే గదండీ) అడిగినాను : "అబ్బాయీ, నీ కింకా యేం కావాలో కోరుకో" అని. వెధవ ! నా

ఔదార్యం అపార్థం చేసుకోవడం తప్పు, తనకు వేరే వుద్యోగమే లేనట్లు ప్రవర్తించినాడు. ఏమన్నాడో తెలుసునా! "ఎంత ఔదార్యమండీ మీ దేశంలో కథకులకు! యీ ఔదార్యంలో సహస్రాంశం మీ పెండ్లాలమీద చూపించ కూడదూ?" అన్నాడు. చూడండి—యెంత దురహంకారమో! నాకే నీతులు నేర్పుతాడు — నీచుడు!

అసలు కథానాయకు లెక్కడైనా తమను సృష్టించిన కథకుల మీదికే తిరుగబడడం మీ రెవరైనా విన్నారా? బానిసలు తిరుగబడడమూ, భార్యలు తిరుగబడడమూ విన్నామనుకోండి. మన కొడుకులే మన మీదికి తిరుగబడడం—సరే—ఆ దురదృష్టం కూడా మనలో చాలామందికి—అంటే దాదాపు కొడుకులు వున్న వాళ్ళకందరికీ—కలిగిందనుకోండి. కానీ యిదేమిటి—మన పాత్రలు మన మీదికే తిరుగబడడమంటే—యిది సహించతగిందేనా అని? ఇక మన సాహిత్యమంతా యేమౌతుందీ అని? ఒక వేళ యిది విప్లవాలయుగం అంటారేమో? అన్ని దేశాల్లోనూ విప్లవాలు జరుగుతున్నాయంటే, పీడిత ప్రజలు తమ న్యాయమైన హక్కులు సాధించుకుంటున్నారని అర్థం, అంతే కాని—యిదేమిటి? సాధించే దేమీ లేకున్నా, నిష్కారణంగా, కేవలం తిరుగుబాటు కొరకే తిరుగుబాటు చేయడం—యే ప్రయోజనమూ లేకుండా, ఏ ఆశయమూ లేకుండా, కేవలం విప్లవం కొరకే విప్లవం వర్ధిల్లాలి అన్నట్లు. ఆ మాటే అడిగినాను అతన్ని—"అబ్బాయ్, నీ తిరుగుబాటుకు ప్రయోజనం యేమి?" అని.

అతను గౌతమ బుద్ధుని పోజుపెట్టి "యిది తిరుగుబాటు అని ఎవరన్నారు?" అన్నాడు.

చెప్పవద్దూ—నాకు చెడ్డ కోపం వచ్చింది. పైగా ఆ పోజు ఒకటి! (ఆ పోజు కూడా మొదట అతనికి నేనిచ్చిందే అనుకోండి. ఐనా అది నా మీదికే ప్రయోగించడం ?)

కోపమంతా దిగమింగి శాంతంగా అడిగినాను: "నేను నీ సృష్టికర్తను. నా యిచ్ఛకు లోబడినంతవరకే నీకు అస్తిత్వం. నా యిచ్ఛను వ్యతిరేకించడమే తిరుగుబాటు."

అతను సిలువమీది యేసుక్రీస్తు మాదిరి విషాద వదనంతో అన్నాడు: "నాకూ యిచ్ఛ వున్నది. నా యిచ్ఛను నేను పాలిస్తాను. అది తిరుగుబాటు అనుకోవడం నీ అవివేకం."

ఆ మనిషిని అట్లనే సిలువకు వేస్తామన్నంత కోపం రాదేమో మీరే చెప్పండి. నా కోపం అణచుకుందామన్నా అణగలేదు. కోపంగానే అన్నాను—కొంచెం గద్దించినట్లే అన్నాననుకోండి, "నీకు బ్రతకాలనే ఆశ లేదా ?" అని.

అప్పటికైనా అతనికి బుద్ధి వస్తుందనుకున్నాను— (యెంతైనా ప్రాణం అంటే తీపి గదా యెవరికైనా) అప్పుడు ముఖానికి గాంధీ మహాత్ముని చిరునవ్వు ఒకటి అలంకరించుకొని తాపీగా అన్నాడు: "ఇచ్ఛ వుండడమే బ్రతకడం. చావడమంటే స్వేచ్ఛ లేకపోవడమే."

ఇంక ఆ మనిషిని యేం చేయాలో మీరే చెప్పండి. తన యోగ్యతైనా గమనించుకోకుండా—యెంతైనా నేను సృష్టించిన పాత్రేగదా—నాతోనే అంత వేదాంతం మాట్లాడుతాడా ? అసలు అతన్ని అంత తెలివిపరుని చేయడం నాదే తప్పనుకోండి. ఐనా, యెంత తెలివిపరుడైతే మాత్రం కృతజ్ఞత యెందుకుండగూడదూ అని ? కుక్కలకుంటుంది గదండీ !

అసలు మా ఇద్దరికీ వచ్చిన అభిప్రాయభేదం మీకింత

వరకూ చెప్పనే లేదు గదూ? సరే—అది కూడా వినండి. అతనికి అన్ని యోగ్యతలూ కల్పించి, ఒక ఊరూ, పేరూ అన్నీ యేర్పాటు చేసి, కులమూ, గోత్రమూ, పరిస్థితులూ, పరిసరాలూ, అన్నీ ఎంతో ఉదాత్తమైనవి సృష్టించి, యేలోటూ వుండకూడదని ఒక తల్లినీ, తండ్రినీ కూడా సమకూర్చి యిచ్చినాను. ప్రతి చిన్న విషయం కూడా యెంతో జాగ్రత్తగా ఆలోచించి చేసినాను. అతని తల్లిదండ్రులకు కూడా యెంత ఉత్తమ సంస్కారం యిచ్చినాననుకున్నారు? అతన్ని చూచిన వెంటనే యెవరైనా సర్వసద్గుణ సంపన్నుడని అనవలసినదే—సర్వశుభలక్షణ లక్షితుడని ఒప్పుకొని తీరవలసిందే. ఇన్ని చేస్తే కడకు...యెందుకులేండి—కథ వినండి ముందు. అన్నీ అమర్చి ముచ్చటగా ముస్తాబుచేసి అతన్ని వీధిలో వదలినాను. సరే—యింతకు ముందే చెప్పినట్లు ఒక అందాలరాశిని అతని కోరకే సృష్టించినాను. అతని కున్నంత తెలివి ఆమెకు లేదనుకోండి. అందంవున్న తర్వాత ఆడపిల్లకు తెలివి లేకుంటే యేం చెప్పండి? అసలు కథానాయకుని మీద అభిమానంతోనే నే నామెను అంత తెలివిపరురాలని చేయలేదు. అందమైన ఆడవాళ్ళకు తెలివి కూడా వుంటే, యింకేముందీ—కొంపలంటుకోవూ?......అన్నీ ఆలోచించే, (అవును మరి, కథ వ్రాయాలంటే ఎంత ఆలోచన కావాలనుకున్నారు?) అతన్ని ప్రేమించడానికి తగినంత తెలివి మాత్రమే ఆమెకు యిచ్చి, కార్లో కూర్చోబెట్టి—కొత్త కారు, 1958 మాడల్ - బయలుదేరతున్నాను. పాపం ఆ అమ్మాయి కిక్కురుమనకుండా బయలుదేరింది. ఆమెకు కూడా అతని కున్నంత తెలివీ వుంటే నాగతి యేమయ్యేదో—యిప్పటికే చస్తున్నాను, ఒకనితోనే వేగలేక.

సరే, అతను వీధిలో నడుస్తూ వుండడం, వెనుక కారు రావడం—కొత్త కారు గదా, అందుకని నిశ్శబ్దంగా వచ్చింది—అకస్మాత్తుగా చిన్న యాక్సిడెంట్ జరగడం—అకస్మాత్తుగా అంటే ప్లాను ప్రకారమే అనుకోండి—ఆ తరువాత అతన్ని కారులో యెక్కించుకొని ఆమె తన బంగళాకు తీసుక పోవడం, అన్నీ యథాక్రమంగా జరిగినాయి. తరువాత మూడు రోజులు అతను మంచంమీదనే వుండడం, అతనికి కావలసిన సపర్యలన్నీ ఆమె చేయడం, అవన్నీ కథలో మామూలే గదా? అతని యెడమ కాలికి కూడా ఆమే కట్టుకట్టుతూ వుండేది ఆ మూడు రోజులూ. ఆ మూడు రోజుల్లోనూ పెండ్లి కాని కథానాయకుని మీద పెండ్లి కావల సిన నాయికకు పుట్టవలసిన ప్రేమంతా పుట్టింది. అతనికి అంత కంటె యింకేం కావాలి చెప్పండి? పాపం అంత అపురూప మైన అందగత్తె ముద్దుగా మూతి ముందుకు చాచి, అర మోడ్పు కన్నులతో 'నా సర్వస్వం స్వీకరించండి' అని కల కంఠంతో ప్రార్థిస్తే, అంతకంటె యేం కావలెనో చెప్పండి. లక్షణంగా ఆమెను స్వీకరించి ఆనంద వీధుల్లో విహరించ కూడదూ? అంటే పెండ్లి చేసుకున్న తరువాతనేనండీ—పెండ్లి కాకుండా యేమి జరిగినా, ఆ అపకీర్తి అంతా కథకునికే అని నాకు మాత్రం తెలియదా?

ఇంకొక వాక్యంతో కథ ఐపోతుంది గదా, నా బాధ్యత తీరిపోతుంది గదా, అని గంపెడాశతో యెదురు చూచినాను. కథకునికి అంతకంటె కావలసిందేముంది గనుక? వాళ్లిద్దరూ పెండ్లి చేసుకుంటే కథ ఐపోతుంది; అంతటితో మనం చేతులు కడుక్కోవచ్చు; తరువాత వాళ్ల బ్రతుకులు వాళ్లే బ్రతుకు

తారు. కల్పాంతం వరకు సుఖపడమని ఆశీర్వదించి పంపుతా మనుకోండి—అటు తర్వాత మన బాధ్యతేముంది చెప్పండి.

పాపం ఆ అమ్మాయి అంత ముద్దుగా మూతి ముందుకు చాచి యెంతసేపున్నా, ఆ వెధవ యేమీ అనకపోతే కథ అంత మయ్యేదెట్లా? అక్కడికీ ఆమె తెగించి వివాహ విషయం కూడా ప్రతిపాదించింది—ఆ విషయంలో అతని కేమైనా పట్టింపు లున్నాయేమో అన్న అనుమానం వచ్చి. న్యాయంగా ఆమె అడిగినందుకైనా అతను వెంటనే ఒప్పుకొని వుండవల సింది. పోనీ వాళ్ళిద్దరినీ సృష్టించిన వాణ్ని కథకుని నన్ను చూసైనా అతను ఒప్పుకొని వుండవలసింది. అంతెందుకు?— తన సుఖమే చూసుకున్నా ఆ సాయంత్రమే లగ్నం యేర్పాటు చేసుకోవలసింది. కానీ వెధవకు యేం బుద్ధి మారిందో—అంత వరకు బుద్ధిమంతుడనే గదా నా నమ్మకం?—తన తెలివి అంతా ఆ అమ్మాయి మీద ప్రయోగించినాడు. "నన్ను పెండ్లి చేసు కోడానికేనా కారు క్రింద పడవేసింది?" అని ప్రశ్నించినాడు. చూడండి, యెంత బుద్ధిలేని ప్రశ్నో! న్యాయంగా ఆ ప్రశ్న కథానాయికే అడగవలసింది; "నన్ను పెండ్లి చేసుకోవాలనే నా కారుక్రింద పడినారు గదా?" అని.

అంత ప్రశ్న అడుగుతే ఆ అమ్మాయి యేం చేస్తుంది చెప్పండి? ఆమెకు తెలిసినంతవరకూ నిజమే చెప్పింది: పొర పాటు వల్లనే యాక్సిడెంట్ జరిగిందని. దానికి తగిన తర్కం కూడా జోడించింది: "మిమ్మల్ని అప్పటికే ప్రేమించి వుంటే, మీ మీదికే కారు డ్రైవ్ చేసేటంత తెలివి తక్కువ దాన్నా నేను?" అన్నది. (మరీ అంత తెలివి తక్కువది కాదు లేండి ఆ అమ్మాయైనా). ఆ ఆర్గ్యుమెంటు వింటూనే అతని హృద

యంలో వెంటనే ప్రేమ పుట్టి తీరవలసిందే. కానీ ఆ వెధవకు అంత మాత్రం జ్ఞానం వుంటేనా? పోగాలపు బుద్ధులు!

"పొరపాటువల్లనే యాక్సిడెంట్ జరిగిందనుకో, ఐతే నీ పొరబాటుకు ప్రాయశ్చిత్తంగా ఆత్మార్పణ చేసుకుంటున్నావా? లేక నా పొరపాటుకు శిక్షగా నన్ను బలితీసుకుంటున్నావా?" అన్నాడు. వెంటనే ఆ అమ్మాయికి కండ్లలో నీళ్ళుతిరిగి బయటికి పారిపోయింది. అంతకంటె యేం చేస్తుంది చెప్పండి, పెండ్లికాని ముగ్ధ కథానాయిక.

నా కొక నిమిషంపాటు మూర్ఛవచ్చినంత పనైంది. కథానాయకుని విపరీత ప్రవర్తనవల్ల సుఖాంతం కావలసిన కథలో దుఃఖాంత లక్షణాలు ప్రవేశించినాయి. ఆ విషయం అర్థమాతూనే, మొదట నాకు బ్రహ్మాండమైన ఆశ్చర్యం కలిగింది. కథకుని ఉద్దేశానికి భిన్నంగా కథానాయకుడు ప్రవర్తించడం ఆశ్చర్యం కాదూ? ఆశ్చర్యం వెంట ఆందోళనా, విచారమూ, కోపమూ, అన్నీ కలిగినాయనుకోండి. మనసులోని భావాల చిక్కు అంతా విడిపించుకొని, అతన్ని నిలదీసి అడిగినాను—తన ప్రవర్తనకు సంజాయిషీ చెప్పమని.

"నామీద ఆ అమ్మాయికి ప్రేమ యెందుకు కలిగిందో చెప్పు" అన్నాడు.

న్యాయంగా ఆ ప్రశ్న అడిగే హక్కు లేదు అతనికి. పోనీ లెమ్మని చెప్పినాను. "మూడు రోజులు నీవు మంచం దిగకుండా ఆమె యింట్లో వున్నావు. నీకు అన్ని సపర్యలూ చేయడమేగాక, రోజుకు కొన్ని గంటలు ఆమె నీతో యేకాంతంగా గడపవలసి వచ్చింది. నీవంటి ఆకర్షణ గల యువకుడు మూడు రోజులు అంత నిస్సహాయ స్థితిలో వుంటే, అంత

సంపూర్ణంగా ఆమెమీద ఆధారపడితే, అంత సుకుమార హృదయంగల ఆడపిల్లకు నీమీద ప్రేమ కలగడం న్యాయమే గదా ?" అన్నాను.

నిజంగా వున్నమాట అంతే గదండీ! మనశ్శాస్త్ర విజ్ఞానమంతా అందులో యిమిడి వుంది. ఆ పరిస్థితుల్లో ఆమెకు ప్రేమ కలగకుండా వుండడానికి వీలేలేదు. అందు కనే ఆ సన్నివేశం కల్పించినాను నా కథానాయకునికి. ఇంకా అనేక సన్నివేశాలు కల్పించవచ్చు ననుకోండి. ఉదాహరణకు అతన్ని హాస్పిటల్లో చేర్చి ఆమెను ఒక నర్సును చేయవచ్చుననుకోండి. కానీ పేషంటును నర్సు ప్రేమించి తీరు తుందనే నమ్మకమేముంది చెప్పండి—రోజు కెంతమంది పేషం ట్లను చూస్తూ వుంటుందో ఒక్కొక్క నర్సు? అందుకని నిస్సందేహంగా, నిర్నిబంధంగా, తప్పనిసరిగా, ప్రేమ కలిగే సన్నివేశం యేర్పాటు చేసినాను. ఇంతచేస్తే యేమన్నాడని— వెధవ—కడకు!

గంభీరంగా ముఖం మార్చి, భగవద్గీత పోజుపెట్టి, నా తీర్పుకు తిరుగులేదనే కంఠంతో, అన్నాడు : "నేను నిస్స హాయ స్థితిలో వుండగా ఆమెకు నామీద ప్రేమ కలగడం న్యాయమో అన్యాయమో నాకు తెలియదు. కానీ నా నిస్స హాయ స్థితిని వ్యాపార వస్తువుగా జేసి, అందమైన ఆడపిల్లలను బుట్టలో వేసుకునేటంత నీచుణ్ణిగాను నేను."

నీచుడు—యెంత శిఖరాగ్ర వేదాంతం మాట్లాడుతాడో చూడండి. డామిట్, కథ అడ్డం తిరిగింది—అని అనవచ్చునను

కోండి యెవరైనా. కానీ, డామిట్, కథానాయకుడే అడ్డం తిరిగితే కథ యేం చేస్తుంది చెప్పండి.

కథ యెటూ ముగించకుండా అట్లనే వదలిపెట్టినాను. కథానాయకుని పేరు కూడా యెవరికీ చెప్పదలచుకోలేదు. చావు బ్రతుకులు లేని చిత్తు కాగితాల చీకటిలోకంలో యెన్నాళ్ళుంటాడో వుండనీ - వెధవ!

(సెప్టంబర్ 1958)

# మన జీవిత కథలు

ఆమెను గురించి కథ వ్రాయాలని చాలా రోజులనుండి అను కుంటున్నాను. కానీ యేమి వ్రాయాలో యెప్పుడూ తోచ లేదు. యెంత ఆలోచించినా కథకు పనికి వచ్చే విషయం ఆమెలో యేమీ కనిపించలేదు. ఆమె జీవితమంతా వెదకినా కథావస్తువు కాగల ఘటనే కనపడదు. జీవితంలో కాని, జీవిత విధానంలో కాని, యే విశేషమూ లేకుండా యేమని కథ వ్రాయడం ?

మూడేండ్లనుండి నేను ఆమె యింటి ప్రక్కనే కాపురం వుంటున్నాను. మా రెండిండ్లకూ ఒకటే వసారా. రేయీ పగలూ యెప్పుడూ ఆ ఉమ్మడి వసారాలో వుంటుంది ఆమె-మంచంమీద కూర్చొనో పండుకొనో. వేళకు నాలుగు మెతు కులు యెప్పుడు వండుకొని తింటుందో, తక్కినప్పుడంతా ఆ వసారాలోనే ఆమె జీవితం. ఈ యింటిలో చేరిన తొలి రోజుల్లోనే యెప్పుడో నాకు తెలియకుండానే బుద్ధి పుట్టింది-ఆమెను గురించి కథ వ్రాయాలని. అప్పటినుండి ప్రయత్నం

చేస్తూనే వున్నాను. కానీ యెంత ఆలోచించినా కథకు ఒక రూపం యేర్పడనేలేదు.

ఒకటి రెండుసార్లు నిరాశ కూడా కలిగింది—కథకు పనికి వచ్చేది ఆమెలో యేమీ లేదేమో అని. కానీ—యేమీ లేకపోతే వ్రాయాలని నా కెందుకు బుద్ధి పుట్టింది—అనే ప్రశ్న నన్ను పీడిస్తూ వుంది. యెంత దీర్ఘంగా ఆలోచించినా యేమీ స్ఫురించదు. నమ్మకం మాత్రం బలంగా వుంది—కథ కాతగింది యేదో ఆమె జీవితంలో వుందని.

రోజూ సాయంత్రం నేను ఆఫీసునుండి వచ్చేటప్పటికి ఆమె మంచంమీదనే వుంటుంది. యెప్పుడైనా ఒకసారి పలకరించే వాణ్ని—"యేం చేస్తున్నావ్ పెద్దమ్మా" అంటూ. నా భార్య మరేమీ ప్రొద్దు పోకపోతే "యీ రోజు యేమి కూర చేసుకున్నావు పెద్దమ్మా?" అంటూ వచ్చి ఆమెతో కాసేపు కాలక్షేపం చేసేది. మేము పలకరిస్తే బాగానే మాట్లాడుతుంది—కానీ ఆ మాటల్లో ఆమె కేమీ ఆసక్తి వున్నట్లు కనపడదు.

ఆమె జీవితంలో నాకు తెలియని విశేషాలు యేమైనా వున్నాయేమోనని యిరుగు పొరుగులను విచారించినాను. యెంత మందిని విచారించినా అంతకు ముందే నాకు తెలిసిన దానికంటె యెవరూ యేమీ చెప్పలేదు.

ఆమెకు యాభై యేండ్ల వయస్సు ఉంటుంది. ఐదారేండ్ల క్రితం భర్త మరణించినాడు. ఒక కొడుకూ కూతురూ వున్నారు. ఆ కొడుకెక్కడో మరొక వూర్లో ఉద్యోగము చేస్తున్నాడు. కూతురు కాపురానికి పోయి పదేండ్లు దాటింది. యే సంవత్సరానికో ఒకసారి కొడుకు వచ్చి చూసి పోతాడు.

యే ఆరు మాసాలకో ఒకసారి కూతురు ఉత్తరం వ్రాస్తుంది. అంతకు మించి ఆమె నిత్య జీవితంలో ఏమీ మార్పు లేదు. యింత చలనంలేని జీవితాన్ని గురించి ఏమని కథ వ్రాయడం ?

నిన్న సాయంత్రం ఆరుగంటలకు నేనూ నా భార్యా సినిమాకు పోతూ "పెద్దమ్మా సినిమాకు పోదాం రా" అని పిలిచినాను.

"పోయి రాండి నాయనా" అంటూ ఆమె ముక్తసరిగా జవాబు చెప్పింది.

"పోదాంరా పెద్దమ్మా - మంచి సినిమా వచ్చింది" అని నా భార్య చనువుగా పిలిచింది.

"నా కెందుకమ్మా సినిమాలూ నాటకాలూ - మీరు పోయి రాండి." అంటూ ఆమె సమాధానం చెప్పింది.

సినిమాకు పోతూ నా భార్యతో అన్నాను "యీామె రోజంతా యేం చేస్తూవుంటుందో !"

"ఆమె కేం ? హాయిగా వుంటుంది - చీకూ చింతా యేమీ లేకుండా" అన్నది నా భార్య - యే కొంచమో అసూయపడుతూ.

"అట్లా హాయి నీకూ కావాల్నా-పిల్లామేకా యెవరూ లేకుండా - మగడుకూడా లేకుండా ?" అన్నాను.

"ఛీ-అదికాదండీ. మరీ తల బరువు సంసారం కంటే యెవరూ లేకపోవడం మేలుగాదూ ?"

"యెవరూ లేకపోతే మనిషికి దిక్కు- తెలుస్తుందా ? జీవితంలో యే ఆసక్తీ లేకుండా, యే వ్యాపకమూ లేకుండా బ్రతకడం సాధ్యమేనా ?"

"మరి ఆమె బ్రతుకుతూనే వున్నదిగా ?"

నిజమే—ఆమె బ్రతుకుతూనే వుంది. కానీ యేమి చూసుకొని బ్రతుకుతూ వుందనేదే ప్రశ్న. ఆలోచిస్తూ నడుస్తూ వుండినాను. కాసేపున్న తర్వాత నా భార్య అడిగింది : "ఆమెను గురించే ఆలోచిస్తున్నారా ?"

"అవును" అన్నాను. "ఆమె జీవిత రహస్యం తెలుసుకోవాలని వుంది."

"రహస్యాలు యేముంటాయండీ – అందులోనూ ఆడవాళ్లకు ?"

"అవున్లే—జగదేక సత్యం చెప్తున్నావు." అన్నాను నవ్వుతూ. నా భార్య కూడా నవ్వింది.

మరి కాసేపున్న తర్వాత మెల్లగా అన్నాను : "ఆమె యెప్పుడైనా కాలు జారిందేమో ?"

హఠాత్తుగా నిలబడింది నా భార్య. "అవేం మాటలండీ ? ఆడవాళ్లంటే అంత చులకనా మీకు ?"

"సరేలే—సినిమాకు టైమౌతున్నది నడు." అంటూ మళ్లీ నడక సాగించినాము. ఆ ఆలోచన మాత్రం నన్ను వదలకుండా వుంది. ఆమె జీవితంలో ఏదయినా తప్పు చేసి బాధపడుతూ వుందేమో ? పశ్చాత్తాపం మనిషిని యెంతైనా క్రుంగ దీస్తుంది. లేకపోతే దేనిమీదా శ్రద్ధా ఆసక్తీ లేకుండా అంత నిరుత్సాహంగా యెట్లా బ్రతకగలుగుతుంది ? మరొక అనుమానం కూడా వచ్చింది. ఆమె ఏదైనా చేయరాని తప్పు చేసి వుంటే పాప పరిహారానికి మనదేశంలో సులభమైన పద్ధతు లున్నాయి. రోజూ కాసేపు గీతాపారాయణ

చేసుకోవచ్చు, వారాని కొకసారి గుడికి పోవచ్చు. అప్పు డప్పుడూ భజన చేయవచ్చు. యీ మార్గాలేవీ ఆమె అనుస రించలేదు. ఆమెను పీడించేది పశ్చాత్తాపం కాదేమో? ఆమెలో దిగులేమీ కనపడదు. ఆమెలో వున్నదంతా అశ్రద్ధ, అనాసక్తి, నిరుత్సాహం—అంతే.

ఈ దినం మధ్యాహ్నం యింట్లో పండుకొని వున్నాను— ఆఫీసుకు సెలవు కావడంవల్ల. నా భార్య వంట యింట్లో పని ముగించుకొని వసారాలోకి పోయింది, పెద్దమ్మతో ముచ్చట్లు చెప్పుకోడానికి.

"సినిమా చాలా బాగుంది పెద్దమ్మా. నీవెంత రమ్మన్నా రాకపోయితివి." అంటూ నా భార్య ఉత్సాహంగా ఆరం భించింది.

"ఏం సినిమాలు లేమ్మా—పొద్దుపోని సినిమాలు." అన్నది పెద్దమ్మ నిరుత్సాహంగా.

"నిజంగా పెద్దమ్మా—చాలా మంచి సినిమా. కథ చెప్పమంటావా?" అన్నది నా భార్య మరింత ఉత్సాహంతో.

"కథలకేమి లేమ్మా—మన బతుకులన్నీ కథలు కావూ?"

నిద్రపోవడానికి ప్రయత్నం చేస్తూ వుండిన నాకు ఆ మాటలు వినేటప్పటికి నిద్రమత్తంతా వదలింది. ఆమె జీవి తంలో ఏదో కథ వుంది. ఏమైందీ నాకు అంతు చిక్కలేదు. కానీ ఏదో తప్పక వుంది. యిప్పుడైనా తెలుస్తుందేమో అని శ్రద్ధగా వినసాగినాను.

"మన బ్రతుకుల్లో యేమి కథలున్నాయి పెదమ్మా!

నిన్నటి బ్రతుకే యీ రోజూ, యీ రోజు బ్రతుకే రేపూ - అంతా గానుగెద్దు బ్రతుకు!"

"అంతేమ్మా. అంతకంటె యెవరి బ్రతుకుల్లో ఐతే యేముంటాయి?"

"అది కాదు పెద్దమ్మా. మన బ్రతుకుల్లో కథ యేముందీ అని? వంటిల్లు వదలితే వసారా-పడక గది విడిస్తే పురటి గది. యిందులో కథ యేముంది పెద్దమ్మా?" నా భార్య ఆమెను కవ్విస్తూంది.

"కథలో మాత్రం యింకేముంటుందమ్మా. కథలన్నీ అంతే."

"పోనీ, నీ కథే చెప్పు. నీ జీవితంలో యేమేమి జరిగిందో చెప్పు వింటాను."

పెద్దమ్మ నిర్లిప్తంగా అన్నది. "నా కథ యేముంది తల్లీ-అందరి కథలూ వున్నట్లే నా కథా."

"అదే చెప్పు" నా భార్య గోముగా అడిగింది. నేను యింకా శ్రద్ధగా వినసాగినాను.

"చెప్పడానికి యేముందమ్మా నా బ్రతుకులో. అందరి మాదిరే నేనూ పుట్టి పెరిగినాను. అందరినీ పెంచినట్లే మా వాళ్ళు నన్ను పెంచినారు. పదారేండ్లు దాటుతూనే అందరికీ ఐనట్లే నాకూ పెండ్లయింది. తరువాత నాలుగేండ్లలో ఒక కొడుకూ, కూతురూ పుట్టినారు. యింతకంటె యేముందమ్మా నా బ్రతుకులో." పెద్దమ్మ ముగించింది. నాకు ఆశాభంగ మైంది.

"తరువాత యేం జరిగింది పెద్దమ్మా?" నా భార్య చాలా ఆసక్తిగా ప్రశ్నించింది.

పెద్దమ్మ అదే నిర్లిప్త కంఠంతో చెప్పింది. "యేం జరుగుతుందమ్మా తరువాత! మామూలుగా జరుగవలసిందే జరిగింది. కొడుకూ, కూతురూ పెరిగి పెద్దవాళ్ళయినారు. కూతురుకు పెండ్లి చేసి అత్తగారింటికి పంపినాము. ఆమె కాపురం ఆమె చేసుకుంటూ వుంది. కొడుకు ఉద్యోగము చేసుకుంటూ తన బ్రతుకు తాను బ్రతుకుతున్నాడు." యీ సారి నాకు పెద్దమ్మ మీద కోపం కూడా వచ్చింది. ఏదో వున్నట్లు ఆశ కల్పించి కడకు ఏమీ లేకుండా చేసింది.

కొంచెం సేపు యెవరూ మాట్లాడలేదు. నా భార్య ఆలోచిస్తూ వుండిందేమో. ఒక నిముషం తర్వాత మళ్ళీ నా భార్య కంఠం వినపడింది. "చిన్నప్పుడు నీవు చాలా కష్టపడి నావా పెద్దమ్మా?"

"యేమీ లేదమ్మా. మామూలు కష్టాలు తప్పితే యేమి కష్టాలు వుంటాయి? మరీ అల్లరిచేస్తే పెద్దవాళ్లు తన్న కుండా వుంటారా? అమ్మ తంతే నాన్న బుజ్జగించేవాడు. నాన్న తంతే అమ్మ సముదాయించేది. కాకపోతే చిన్నప్పుడు యెంత కష్టమైనా కాసేపు యేడిస్తే అదే పోతుంది."

మళ్ళీ ఒక క్షణం ఆలోచించినట్లుంది నా భార్య. "నీకు యిష్టం లేని పెండ్లి చేసినారా పెద్దమ్మా?" నా భార్య తెలివికి నాకు ఆశ్చర్యం కలిగింది. సరిగా నేను అడగ దలచుకొన్న ప్రశ్నలే అడుగుతూ వుంది. నా కోసమే అడుగుతున్నట్లుంది. జవాబు కొరకు ఆతురతతో యెదురు చూసినాను.

"యిష్టం లేకేమమ్మా? తగిన సంబంధమనే మా వాళ్లు యిచ్చినారు. ఐనా పదారేండ్ల ఆడపిల్లలకు యిష్టాలూ అయిష్టాలూ యేముంటాయి గనుక?"

"అడుగుతున్నానని మరేమీ అనుకోకు పెద్దమ్మా— మీ కాపురం అన్యోన్యంగానే వుండిందా?"

"అన్యోన్యం లేకేమమ్మా? మా ఆయన మరీ దుర్మార్గు డేమీ కాదులే—మామూలు మనిషే."

"ఐతే మీ కెప్పుడూ పోర పొచ్చాలేమీ రాలేదన్న మాట?"

"ఏవో మామూలు తగవులు రాకుండా వుంటాయా తల్లీ? యెప్పుడైనా వంట ఆలస్యంగా ఐతే కోపగించుకునే వాడు. లాంపు పెద్దగా వెలుగుతూవుంటే చీవాట్లు పెట్టే వాడు."

"మీరెప్పుడూ పోట్లాడుకోనే లేదా పెద్దమ్మా?"

"యెందు కొస్తాయమ్మా పోట్లాటలు? మన మేం అల్లరి వాళ్ళమా చిల్లర వాళ్ళమా? యెప్పుడో ఒకసారి— పెండ్లయిన మొదటి సంవత్సర మనుకుంటాను—పండుగకు పుట్టింటికి పోవాలని ప్రయాణమైనాను. అంతా ప్రయాణమై కుంర్చున్నాక, అప్పుడు పోవద్దన్నాడు. ఆ పూటంతా అన్నం తినలేదు. పోట్లాడుదామనుకున్నాను గానీ, కొత్త చీర కోయం బత్తూరుది తెచ్చి పండుగకు కట్టుకొమ్మన్నాడు. అన్నీ తెలిసీ తెలియని చేష్టలు లేమ్మా—చిన్న వయస్సు గదూ."

నా భార్యకు ఏమర్థమైందో ఏమో? నాకు మాత్రం అంతా అయోమయంగా వుంది.

"తరువాత యేంజరిగింది పెద్దమ్మా—కొడుకూ కూతురూ వెళ్ళిపోయిన తర్వాత ?"

"యేముందమ్మా, ఐదారేండ్లు మామూలుగానే జరిగి పోయినాయి. ఒకనాడు జబ్బుగావుందని పండుకున్నాడు. అంతే—మళ్లీ లేవలేదు. యిరవై రోజుల తర్వాత నన్ను ఒంటరిగా వదలిపెట్టి పోయినాడు." యీ మాటలు కూడా ఆమె మామూలుగానే అన్నది. కంఠంలో యే ఉద్వేగ సూచనలూ లేవు. వాళ్ళ సంభాషణ నాకు విసుగైంది. యింక యెంత సేపున్నా ఆమెను గురించి తెలుసుకోతగింది యేమీ వుండదని నిరాశ చేసుకున్నాను.

"ఐతే యింతకంటె విశేషాలేమీ లేవా పెద్దమ్మా, నీ జీవితంలో ?"

"యింతకంటె యెవరి జీవితంలో ఐతే యేముంటా యమ్మా ?"

"జీవితంలో నీ కింకేమీ కోరికలు లేవా ?"

"యీ వయస్సులో యింకా యేమి కోరికలు వుంటాయి తల్లీ ? కాలూ చేయీ పడిపోకముందే చావు రావాలనే దొక్కటే కోరిక."

"అయితే జీవితంలో నీ కోరికలన్నీ తీరినాయా పెద్దమ్మా? తీరని కోరికలంటూ యేమీ లేవా నీకు ?"

"యేమి కోరిక లుంటాయమ్మా ఆడవాళ్ళకు! చీరలో, నగలో, అంతేగదూ! అవైనా ఒకరిద్దరు పిల్లలయిందాకానే, తర్వాత యింకే కోరికలూ వుండవు."

కొద్ది క్షణాలు నిశ్శబ్దం. "యింకొక్కమాట చెప్పు పెద్దమ్మా. యెప్పుడూ ఆలోచిస్తూ వుంటావే, యేదో తప్పు

చేసి బాధపడుతూ వున్నట్లు—యేదైనా చేయరాని పని చేసి నావా యెప్పుడైనా ?"

యీ ప్రశ్నకు ఆమె కోపగించుకుంటుందేమో అను కున్నాను. కోపం తాపం ఏమీ లేకుండా మామూలుగానే సమాధానం చెప్పింది. "చేయరానిపను లెందుకు చేస్తామమ్మా మనబోటి వాళ్ళం ? మనకేం మర్యాదలు తెలియవ్వూ ? ఉన్న మర్యాద పోయిన తర్వాత బ్రతగ్గలమా తల్లీ మనం ?"

వెధవగోల వినలేక ముసుగుపెట్టి పండుకున్నాను. తరువాత నా భార్య యింకా యేమేమి ప్రశ్నల పరంపర కురిపించిందో ఆమెమీద – నాలుగు గంటలకు నేను నిద్రలేచి కాఫీ కొరకు వంట యింట్లోకి పోగానే "పెద్దమ్మ కథ విన్నారా ?" అన్నది.

"అంతా వినలేదులే. ఆమె జీవిత రహస్య మేమైనా తెలిసిందా ?" అన్నాను.

నా భార్య జాలిగా చిరునవ్వు నవ్వుతూ చెప్పింది. "రహస్యం యేముందండీ ? పాపం అడగరాని ప్రశ్నలన్నీ అడిగినాను—మీామీాది నమ్మకంతో. కోపం తెప్పించే ప్రశ్నలు కూడా అడిగినాను. కోపమూ, విసుగూ యేమీా లేకుండా అన్నిటికీ సమాధానం చెప్పింది."

"అయితే ఆమె జీవితంలో యేమీా విశేషం లేదం టావా ?"

"ఏమీాలేదు. చెప్పుకోదగిన విశేషం ఏమీాలేదు. ఆమె చాలా మామూలు మనిషి."

"చాలా మామూలు మనిషి! యింత మామూలు మనిషిని గురించి యేమని కథ వ్రాయడం?" అన్నాను.

నా బాధ కంఠంలో ధ్వనించిందేమో - కాలే కాఫీ గ్లాసు విసురుగా నా చేతిలో పెట్టి నా భార్య తీవ్రంగా అన్నది:
"మీ దిగులంతా కథనుగురించే. ఆమెను గురించి మీకే మాత్రం విచారం లేదు కదూ?"

నా భార్య ప్రవర్తన నాకు అర్థమే కాలేదు.

(నవంబర్ 1959)

# హృదయంలో హద్దులు

శివరాం యింటికి వచ్చి ఆలోచనలో పడినాడు.

ఆరుమాసాలనుండి తాను లాయర్ క్రిష్ణస్వామి దగ్గర కారు డ్రైవర్‌గా వుంటున్నాడు. ఆందోళన చెందవలసిన సంఘటన యెన్నడూ జరగలేదు. కానీ యీ నాడు తన యజమాని భార్య విపరీతంగా ప్రవర్తించింది.

యీ ఆరు మాసాలలో దాదాపు వంద సార్లయినా ఆమెను కార్లో కూర్చో బెట్టుకొని తాను డ్రైవ్ చేసినాడు. అందులో ఒక యిరవై సార్లైనా ఆమెను ఒంటిగానే బజారుకో స్నేహితురాండ్ర యిండ్లకో తీసుకపోయినాడు. యెప్పుడూ వెనుక సీటులో ప్రశాంతంగా కూర్చొనేది. కారు యెక్కినా, దిగినా, లేక కారు ఆపుమని గానీ స్టార్టు చేయమనిగానీ తనతో ఒకటి రెండు మాటలు మాట్లాడినా, యెప్పుడూ నిబ్బరంగా వ్యవహరించేది. తనతో నేగాదు—తనకు తెలిసినంతవరకు యింట్లో నౌకర్లతోగాని, బజార్లో షాపింగ్ చేసేటప్పుడుగాని, ఆమె యెప్పుడూ తొందరపాటు ప్రదర్శించ నేలేదు. యెన్నడూ

యే ఆవేశానికీ లోను గాకుండా, యింత ఆత్మ నిగ్రహంతో ఒక ఆడమనిషి వ్యవహరించడం తనకు తొలుత తొలుత ఆశ్చర్యంగానే వుండేది. కానీ, నెలకు వేయి రూపాయలకు పైగా సంపాయించే భర్త, పిల్లలులేని సంసారం, యింట్లో తగినంత మంది నౌకర్లు, ఆమె మనశ్శాంతికి భంగం కలగవలసిన పని యేముంది—అని తానే సమాధానం చెప్పుకున్నాడు. పైగా సంస్కారమూ, ఔదార్యమూ కలవాడు లాయర్ క్రిష్ణస్వామి. ఆమె జీవితంలో ఆవేశాలు ప్రవేశించవలసిన అవసరం రానేరాదు. ఆ భార్యా భర్తల వద్ద తన వుద్యోగానికి కూడా యెన్నాళ్ళున్నా యే ఒడిదుడుకులూ వుండవని ఒక అవ్యక్తమైన విశ్వాసం తన మనస్సులో క్రమంగా వృద్ధి చెందుతూ వచ్చింది.

లేక—ఆమెలో వున్నది నిస్సారమైన జీవితంమీద కలిగిన విరక్తి భావమేమో—అని కూడా తన కొకనాడు సందేహం కలిగింది. తన సందేహానికి తానే నవ్వుకొని తన్ను తానే ఖండించుకున్నాడు కూడా. ఆమె జీవితం నిస్సారమెందు కౌతుంది? యింకా ముప్ఫై యేండ్లు నిండని వయస్సు. యీడుకు తగిన భర్త, ఆరోగ్యం, ఐశ్వర్యం, క్లబ్బూ, సినిమాలూ, పికార్లూ, స్నేహితురాండ్రూ, ఆమెకు కోరదగిన వన్నీ వున్నాయి. వున్నవాటి నన్నిటినీ అనుభవిస్తూనే వుంది. ఇక ఆమెకు జీవితంమీద విరక్తి అని అనుకోవలసిన కారణమేముంది? ఆత్మ నిగ్రహం కలవాళ్ళ ఆనందం యిట్లే వుంటుందేమో—నిండుగా, నిబ్బరంగా, నిరావేశంగా—అని అనుకున్నాడు తాను.

కానీ యీనాడు ఆమె విపరీతంగా ప్రవర్తించింది.

ఈ దినం సాయంత్రం ఆమెను యింటికి తీసుక వచ్చే టప్పటికి బాగా చీకటి పడింది. తాను కారు తలుపు తెరచి పట్టుకున్నాడు. ఆమె కారు దిగి మామూలు ప్రకారం యింట్లోకి వెళ్ళిపోకుండా అక్కడే నిలబడింది. తాను వినయంగా కారు తలుపు మూసే ప్రయత్నంలో వున్నాడు. ఆమె నిశ్శబ్దంగా తన భుజంమీద చేయి వేసింది. తాను కంగారుపడి ఆమె ముఖంలోకి చూసినాడు. ఆమె తన కన్నుల్లోకి చూస్తూ మత్తుగా చిరునవ్వు నవ్వింది. తాను దిగ్భ్రాంతిలో మునిగి పోయినాడు. ఆమె కండ్లు మూసుకొని భారంగా ఊపిరి పీల్చుకుంది, దీర్ఘంగా నిట్టూర్చింది. తరువాత మెల్లగా యింట్లోకి వెళ్ళిపోయింది—అడుగులో అడుగు వేసుకుంటూ.

కొంతసేపటికి ఆ దిగ్భ్రాంతిలోనుండి తాను తేరుకొని, వెంటనే కారు షెడ్డులో పెట్టి, నేరుగా తన యింటికి వచ్చి ఆలోచనలో పడినాడు.

తీరా యిప్పుడు ఆలోచిస్తే, ఆమె ప్రవర్తన యీనాడే కాదు—వారం రోజులనుండి యేదో వింతగా వుంది. పోయిన శనివారంనాడు ఆమెనూ క్రిష్ణస్వామినీ సినిమాకు తీసుక పోయినాడు తాను. వాళ్లు సినిమా చూస్తూ వుండగా తాను థియేటర్ బయట కార్లో కూర్చున్నాడు. సినిమా యింకొక అర్థగంటకు ఐపోతుందనగా ఆమె ఒక్కతే బయటకు వచ్చి కారులో కూర్చుంది. ఆమెను యింటిదగ్గర వదలిపెట్టి రావాలేమో అని తాను కారుస్టార్టు చెయ్యబోయినాడు. కానీ ఆమె వద్దు లెమ్మని చెప్పి, తల నొప్పిగా వుందని ఒక కప్పు కాఫీ తెచ్చిపెట్టమన్నది. యెదురుగా వున్న హోటల్ నుండి తాను కాఫీ తెచ్చి యిచ్చినాడు. కాఫీ త్రాగుతూ ఆమె యెన్నడూ

లేచింది, ఆ దినమే మొదటిసారిగా, తన జీవితాన్ని గురించి పరామర్శించింది.

"మా దగ్గర నౌకరీ తృప్తికరంగా వుందా, శివరాం!" అని అడిగింది మొదట.

"నౌకరీ కేమైందమ్మా-నాకు చాలా హాయిగా వుంది" అని తాను తడవుకోకుండా జవాబు చెప్పినాడు. నిజంగావున్న మాట కూడా అంతే. తాను యింతకు ముందు ఐదారుచోట్ల డ్రైవర్ గా పని చేసినాడు. యెక్కడా యింత తృప్తిగా హాయిగా వుండేది కాదు. వేళాపాళా లేకుండా డ్యూటీ చేయమనడమో, లేకపోతే యితర య్యింటి పనులు చేయమనడమో, లేకపోతే తన్ను అగౌరవంగా నీచంగా చూడడమో, ప్రతి చోటా యేదో ఒక లోటు వుండేది. యిక్కడ మాత్రం యేలోటూ లేకుండా తన కన్నివిధాలా సంతృప్తికరంగా వుంది.

ఒక నిముషం తర్వాత "నీకు భార్యా, పిల్లలూ వున్నారా ?" అన్నది ఆమె.

"వున్నారమ్మా. భార్యా యిద్దరు పిల్లలూ వున్నారు."

"మరి జీతం సరిపోతున్నదా ?"

"సరిపోవడం యెక్కడికి లేండి. యింత మాత్రం జీతం కూడా లేని వాళ్లు దేశంలో యెంతమంది వున్నారో"అన్నాడు తాను.

ఆ మాటకు ఆమె తియ్యగా నవ్వింది. నవ్వి, "ఉన్న వాళ్లను చూచి ఈర్ష్యపడడం కంటే లేని వాళ్లను చూచి తృప్తిపడడమే మేలు." అన్నది.

ఆ వ్యాఖ్యానం తన్ను విమర్శించడమా, అభినందించడమా అన్న ప్రశ్న తన కప్పుడు తోచనే లేదు. ఈనాం

యెంత తియ్యగా నవ్వగలదు అనే ఆశ్చర్యంలోనే తాను మునిగిపోయినాడు. ఆ మాధుర్యానికి తాను పరవశుడై పోయినాడు. యిప్పు డాలోచిస్తే అందులో విమర్శగానీ, అభినందనగానీ, లేదేమో అనిపిస్తున్నది. ఒక అసాధారణ అభిప్రాయం వెలిబుచ్చడం ద్వారా తన దృష్టిని ఆకర్షించడానికి చేసిన ప్రయత్నమేమో? ఆ తియ్యని నవ్వు వెనుక కూడా తన్ను ఆకర్షించే వుద్దేశమే వుందేమో? తరువాత జరిగిన ఘటనలు ఈ అభిప్రాయాన్నే బలపరుస్తున్నాయి.

ఆ ఘటన జరిగిన మూడు రోజులకు ఆమెను ఒంటిగా బజారుకు తీసుకపోవలసి వచ్చింది. పోయేటప్పుడు ఆమె వెనుక సీటులోనుండి తన వైపే చూస్తూ వుండినట్లు తన కెందుకో అనుమానం వచ్చింది. బజారులో పని ఐపోయిన తర్వాత బట్టల షాపులోనుండి బయటికి వస్తూనే మామూలు ప్రకారం వెనుక సీటులో కూర్చుంటుంది గదా అని తాను వెనుక తలుపు తెరచినాడు. కానీ ఆమె హఠాత్తుగా ముందు తలుపు తెరచుకొని ఫ్రంటుసీటులో కూర్చొని, "పోదాం రా, శివరాం" అన్నది. తాను దిగ్భ్రాంతి చెంది ఆమె ప్రక్కనే డ్రైవర్ సీటులో కూర్చొని కారు స్టార్టు చేసినాడు. కారు కదలగానే "ఇదుగో, నీ భార్యకీ చీర తీసుక పో" అంటూ ఆమె తన మీద ఒక ప్యాకెట్ పడవేసింది. తాను ఒక చేత్తో స్టీరింగు చక్రం పట్టుకొని, మరొక చేత్తో ఆ ప్యాకెట్ తీసి ప్రక్కన పెడుతూ' "యెందుకమ్మా?" అన్నాడు. ఆ మాట కూడా అనాలోచితంగా నోటికి వచ్చిందే. నిజానికి తానప్పుడు ఆలోచించే స్థితిలోనే లేదు. హఠాత్తుగా ఆమె ప్రక్కన కూర్చోవలసి వచ్చినందుకు తన మనసు తన స్వాధీనంలో లేదు. పైగా ఊహిం

చని యీ బహుమానం ఒకటి.

"ఈ దినం నా పుట్టిన దినంలే శివరాం. మీ కుటుంబానికిది బహుమానమనుకో." అన్నది ఆమె తన వైపే చూస్తూ.

"ఐనా యెందుకమ్మా?" అన్నాడు తాను, అంతకంటే యేమనడానికీ తోచక. అసలు ఆమె తనకు బహుమానం యివ్వడమే తనకేదో కించగా వుంది. బహుమానాలాశించడంగానీ, అందుకు తగిన వినయ విధేయతలు ప్రదర్శించడంగానీ, తన జీవితంలో యింకా నేర్చుకోని విషయాలు. ఆ బహుమానం వలన తన ఆత్మాభిమానం యెక్కడో కొంచెంగా గాయపడింది. కానీ దాన్ని తిరస్కరించే సాహసం కూడా తనకు లేదు. యెంతైనా తాను ఆమె క్రింద నౌకరే.

"నీ భార్యమీద నీకా మాత్రం అభిమానంలేదా?" అని ఆమె నవ్వింది. థియేటర్ దగ్గర నవ్వినంత కంటె తియ్యగా, అంతకంటె సుకుమారంగా నవ్వింది.

తాను ఉక్కిరి బిక్కిరై నోటమాట రాక అవస్థపడుతూ వుండగా, "లేక నీ భార్య నిన్ను అనుమానిస్తుందనా?" అంటూ కిలకిల నవ్వింది. ఆ నవ్వులో మాధుర్యమెంతో, మార్దవమెంతో తనకు తెలియదు కానీ, అది విన్న వాళ్లకు మత్తెక్కించే నవ్వు. ఆ నవ్వు ఆగిన తర్వాత ఒక నిముషం వరకూ తన చెవుల్లో మ్రోగుతూనే వుండింది. ఆ నిముషం సేపూ కారు తన స్వాధీనంలో లేదనే చెప్పవచ్చు. తాను అంత సమర్థుడైన డ్రైవరై వుండికూడా ఒకచోట యాక్సిడెంటు జరిగినంత పనైంది.

ఆనాడు తన మనసులో యేదో తీవ్రమైన సంచలనం కలిగింది. కానీ అది యేమైందీ తనకే తెలియదు. ఆమెను

గురించి యేమనుకోడానికీ తనకు తోచనే లేదు. ఆ రోజు రాత్రి ఆమెనుగురించి కలగన్నాడు. ఆకలలో ఆమె మళ్ళీకిలకిలనవ్వింది. ఆ నవ్వు వింటూనే తనకు హఠాత్తుగా మెలకువ వచ్చి లేచి కూర్చున్నాడు. ప్రక్కనే వున్న భార్య ముఖం చూచి తాను పరస్త్రీలను గురించి కల గన్నందుకు సిగ్గుపడినాడు. ఆ సిగ్గు పడినప్పుడు అర్థమైంది—మనస్సులో ఆ సాయంత్రం కలిగిన సంచలనంయొక్క స్వభావం. తన యజమానురాలిని గురించి, ఆరు మాసాల నుండి యజమానురాలుగానే గాక సత్ప్రవర్తనగల ఉత్తమ వ్యక్తిగా తన గౌరవాన్ని చూరగొన్న స్త్రీని గురించి, తానా విధంగా భావించడమే తప్పని తన్ను తాను నిందించుకున్నాడు. తన మనసులో యింత దుష్టచింత వుందా అని ఆశ్చర్యపడినాడు. ఇటువంటి విషయాలలో ఒక్క తప్పటడుగు వేస్తే, యీ వుద్యోగం పోవడమేగాదు, మరెక్కడా యిటువంటి వుద్యోగం దొరకదని తనకు తానే భయం చెప్పు కున్నాడు.

కానీ యీ వారం రోజులలోనూ జరిగిన ఘటనలన్నీ కలిపి యిప్పుడు ఆలోచిస్తే, ఆమె వుద్దేశం స్పష్టంగా అర్థ మౌతూనే వుంది. ఆ అర్థం కావడమే తన్ను యింత దీర్ఘా లోచనలో ముంచింది. ఆమె తన్ను కోరుతూ వుందనడంలో సందేహం యేమీ లేదు. కానీ—యెందుకు? తన మీద ప్రేమా? తనలో యేమి చూసి ప్రేమించింది? అందంలో గాని, ఆకర్షణలోగాని, తాను క్రిష్ణస్వామికంటె యోగ్యుడు కాడే! లేక కేవలం పశుత్వమేనా? యీ ఆరుమాసాలనుండి ఆమెలో తాను గమనించిన సత్ప్రవర్తన అంతా నటనేనా? యేమో—యే పుట్టలో యే పాముందో?

ఐనా, తనకు తానై ఒక వనిత వలచి వస్తే తన కెందుకు యింత ధర్మచర్చ! తాను మాత్రం మనిషి కాదూ? తానేమి శుకమహర్షిననో, ఋష్యశృంగున్ననో బోర్డు వేసుకున్నాడా!

యీ ఆలోచనతో అతనికి నవ్వు వచ్చింది. తనలో తాను నవ్వుకుంటూ వుండగా, వంట యింట్లోనుండి అప్పుడే వచ్చిన భార్య "యీ రోజేమో వుల్లాసంగా వున్నారే!" అన్నది.

తాను వుల్లాసంగా వున్నమాట నిజమే. కానీ, భర్తల వుల్లాసాన్ని భంగం చేసే హక్కు భార్యల కెవరిచ్చినారు!

భార్యమీద విసుక్కుంటూ అతను భోజనానికి లేచినాడు.

*　　　　*　　　　*

ఆ సంవత్సరమంతా శివరాం ఆనంద వీధుల్లో విహరించినాడు. మనిషి జీవితంలో యింత సౌఖ్యం వుంటుందని అతనెప్పుడూ వూహించి యెరగడు. తాను యిన్నాళ్లూ గడపిన జీవితమంతా నిస్సారం అనుకునేవాడు. స్త్రీపురుషుల మధ్య యింత గాఢమైన వాంఛ, యింత మైమరపించే తన్మయత్వం, యింత అశాంతి కలిగించే ఆశ, యింత వేదన కలిగించే ప్రతీక్ష. యిదేనేమో కథల్లో ప్రేమ అని అనబడేది! ప్రేమ ఐనా కాకపోయినా, తన జీవితానికి సార్థకత నిచ్చింది యిదే.

ఆమెతో పోలిస్తే తన భార్య మనిషేనా అని అతనికి అనుమానం వచ్చేది. యీ భార్యలు అట్లా యెందుకు ప్రేమించలేరు! భార్యమీద అతనికి యేదో తృణీకారభావం,

యేదో నిరసనభావం కలిగేది. కానీ మనసులో యెక్కడో భార్యమీద జాలి. పాపం–తనమీద నిష్కల్మషమైన విశ్వాసం చూపుతుంది. అమాయకురాలు–తానీ మధ్య యింటికి తెచ్చే బహుమానాలు చూసి ఉప్పొంగిపోతున్నది. తెలివి తక్కువది–తన్నింతవరకు అనుమానించనేలేదు. యెన్నాళ్లున్నా తన్ను అనుమానించదని అతనికి భార్య మీద ఒక వైపు అభిమానం: తెలివి తక్కువదని మరొకవైపు అనహేళన. యింత సమర్థంగా మోసగించగల తన తెలివి తేటలను గురించి సగర్వమైన సంతృప్తి. తృప్తి చెందిన అహంకారంవలన అతను భార్య పట్ల మరింత ఉదారంగా ప్రవర్తించేవాడు; పిల్లలను మరింత ఆప్యాయంగా ఆదరించేవాడు.

అతనికి అప్పుడప్పుడు ఆమెమీద విసుగు వచ్చేది. నాలుగైదు రోజులకొకసారిగానీ తమ సమావేశాలు కుదిరేవి గావు. అవైనా ఆమె యేర్పాటు చేయవలసిందేకాని అతని యిష్టానిష్టాల ప్రసక్తి యేమీ వుండేది కాదు. ఆమె కనిపించని నాడు మనసంతా ఆందోళనగా వుండేది. కలత నిద్రలో ఆమెను గురించే కలలు వచ్చేవి.

ఒకనాడు ఆమెను అడిగినాడు: "మన మిద్దరమూ యెప్పుడూ కలిసి వుండే మార్గం లేదా?"

"యేం? యిప్పుడు తృప్తిగా లేదా?" అన్నది ఆమె.

"యెప్పుడో వారానికొకసారి కలుసుకుంటాము. తక్కిన రోజుల్లో మనసంతా నీమీదనే. పగలంతా నిన్ను గురించిన ఆలోచనలే; రేయంతా నిన్ను గురించిన కలలే."

ఆమె నిశ్శబ్దంగా నవ్వింది. ఆమె తన మాట నమ్మ లేదని అతను చిన్నబుచ్చుకున్నాడు.

ఆమె శాంతంగా జవాబు చెప్పింది : "పోనీ నీవు కోరి నట్లు మన మిద్దరం కలిసి కాపురం చేస్తామనుకో. అప్పుడిక నన్ను గురించి ఆలోచనలూ రావు, కలలూ రావు. ఆ స్థితిలో మనం కలసి వుండవలసిన అవసరం కూడా వుండదు."

సమాధానం తోచక అతను తలవంచుకున్నాడు.

ఆనాడు అతనికి మరొక విషయం గుర్తుకొచ్చింది. యెన్నాళ్లు గడచినా ఆమెమీద తన కేమీ అధికారం యేర్పడ లేదు. ఆమె నిశ్చయ కంఠంతో మాట్లాడుతుంది; ఆమె మాటకు యెదురు చెప్పే శక్తి తనకుండదు. తన కామె తగి నంత చనువివ్వలేదా ? ఆమె యజమానురాలన్న గౌరవభావం తనకింకా పోలేదా? లేక—ఆమె వ్యక్తిత్వంలో యేదైనా గొప్ప తనం వుందా ? తనకు తన భార్య దగ్గర వున్న ఆత్మ విశ్వాసం ఆమె దగ్గర యెందుకుండదు ? భార్యకూ ఆమెకూ వున్న తేడా యేమిటో యెంత ఆలోచించినా అతనికి అంతు చిక్కలేదు.

*　　　*　　　*

హఠాత్తుగా శివరాం తలమీద పిడుగు పడినట్లైంది. "మనమింక కలుసుకోడానికి వీలుపడదు శివరాం." అన్నది ఆమె. ఒక నిముషం సేపు అతని నోట మాట రాలేదు.

తరువాత మెల్లగా "యెందుకు ?" అన్నాడు.

"మనం కలుసుకోవడం మనకిద్దరికీ క్షేమం కాదు. నీ వీ వూరు వదలి యెక్కడైనా పోవడం మంచిది."

దిగులుగా అతను ఆమె ముఖంలోకి చూసినాడు.

అతని దిగులు చూసి ఆమె చిరునవ్వుతో అన్నది: "అంత దిగులెందుకమ్మా? విడిపోవడమంటే అంత బాధగా వుందా?"

ఆ ప్రశ్న అతనికి విపరీతంగా కనపడింది. విడిపోవడం ఈమెకింత తేలికగా వుందా? ఆమె కంఠంలోని ప్రశాంతత అతన్ని రెచ్చగొట్టింది. ఆవేశంలో అతనికి యెన్నడూ కలగని సందేహం హఠాత్తుగా కలిగింది. ఆమె కన్నుల్లోకి తదేకంగా చూస్తూ, వణకుతున్న కంఠంతో అన్నాడు: "నీకేమీ బాధ లేదా? నేను ప్రేమించినాను గనుక నాకు బాధగా వుంది. నీవు ప్రేమించలేదు గనుక నీకు బాధగా లేదేమో?...అంతేనా?"

ఆమె విషాదంగా చిరునవ్వు నవ్వింది. "మనం విడిపోతున్నామని ఒక బాధ. నేను బాధ పడలేదని మరొక బాధ. యెన్ని బాధలు శివరాం నీకు?...నేను బాధపడలేదని యెందు కనుకున్నావ్? యెంత బాధ ఐనా మనం విడిపోవడమే క్షేమం. ఆ మాట అన్నందుకు నీకెంత ఆగ్రహం!"

శివరాం మౌనంగా తలవంచుకున్నాడు. ఆమె మాటకు యెన్నడూ యెదురు చెప్పి యెరగని తాను యీనాడు ఆమెను యెదుటనే నిందించినందుకు యేదో తప్పు చేసినట్లు సిగ్గుపడినాడు. ఆమెను నిందించే అధికారం తనకేమున్నది? ఆమె దగ్గర తాను నౌకరు. ఆ సంగతి తలచుకొని మరింత సిగ్గుపడినాడు.

ఆమె రెండు చేతులతోనూ అతని ముఖం పైకెత్తి జాలిగా అన్నది: "నేను నిన్ను ప్రేమించలేదనే అనుకో. అందువల్ల నష్టపడిన దాన్ని నేనేగాని నీవు కాదుగా. నీవైనా నన్ను ప్రేమించినావు గదా? అంతటి అపూర్వ అదృష్టం నీకు

నావల్లనే కదూ కలిగింది? కృతజ్ఞత చూపక పోగా, నిందిం చడం కూడానా?"

శివరాంకు కన్నుల్లో నీరు తిరిగింది. మెల్లగా అన్నాడు: "యిప్పుడు నన్ను పొమ్మనడం యెందుకు? కారణమైనా చెప్పవూ?"

"నా భర్తకు అనుమానం కలిగింది. ఆ బాధేదో నేనే పడతాను. నీవు వెళ్ళిపోతే నీక్కూ మంచిది, నాకూ సులభ మౌతుంది." వానిటీబాగ్‌లోనుండి ఒక పెద్ద కవరు తీసి అతని చేతిలోపెట్టి ఆమె అన్నది: "యీ ఐదువేలూ తీసుకొని పో. యెక్కడైనా వ్యాపారం చేసుకొని సుఖపడగలవు."

క్షీణకంఠంతో అతను అడిగినాడు: "యింత అభి మానం వున్న దానవు నా వెంట యెందుకు రాకూడదు? యీ డబ్బుతో మన మిద్దరమూ సుఖపడలేమూ?"

"నీ కింకా పసితనం వదల్లేదు శివరాం." లాలనగా ఆమె జవాబు చెప్పింది. "నీ భార్యాబిడ్డల నేం చేస్తావో చెప్పు."

ఆ మాట వింటూనే అతను మళ్ళీ తలవంచుకున్నాడు. పిల్లలిద్దరూ జ్ఞాపకం వచ్చినారు. పిల్లలమీద మమకారం తెంచుకోడానికి తీవ్ర ప్రయత్నం చేస్తూ వుండగానే భార్య దీన వదనం యెదుట నిలిచింది. తాను పోతే తన భార్య యేమౌ తుంది? యిద్దరు పిల్లలతో, నిరాధారంగా, నిస్సహాయంగా, అమాయకంగా, ఏకాకిగా—ఊహకందని భయంతో అతని దేహం కంపించింది. యీ ఐదువేలతో తన భార్యకు అచంచల మైన అంగరక్షగా నిలబడవచ్చు, తన పిల్లలకు ఉజ్జ్వలమైన భవిష్యత్తు నిర్మించవచ్చు.

ఐదునిముషాలు నిశ్శబ్దంగా గడచినాయి. బుజ్జగించే కంఠంతో ఆమె అన్నది : "వద్దు శివరాం. నీవు నీ భార్యా బిడ్డలను వదల్లేవు. నా భర్త ఐశ్వర్యాన్నీ, యీ సుఖాలనూ, యీ గౌరవమర్యాదలనూ, నేనూ వదలుకోలేను. అంత త్యాగం నీకూ లేదు, నాకూ లేదు. నా అల్పత్వం యెక్కడుందో నాకు తెలుసు. యీ క్షుద్ర సంస్కారాన్ని అధిగమించే సాహసం నాకు లేదు. సాహసం చేసినా నా సంస్కారం నన్ను సుఖపడ నివ్వదు."

సుకుమారమైన అనుతాపంతో నిండిన ఆమె కంఠం, యెక్కడో మరోలోకంవైపు చూస్తున్నట్లున్న ఆమె చూపులు, అతనికంతా అపూర్వంగా వుంది. కన్నులు పెద్దవిచేసి ఆమె ముఖం వైపే చూస్తూ కూర్చున్నాడు. అతని కేదో మైకంలో వున్నట్లుంది.

ఒక నిముషం తర్వాత అతని వైపు చూస్తూ తన మామూలు సరసమైన కంఠంతో ఆమె అన్నది: "యిక పోదాం పద. నీవు నన్ను మరచిపోకుండా మంచి చీర ఒకటి కొనియిస్తాను. నీ భార్య అది కట్టుకున్నప్పుడల్లా నేను జ్ఞాపకం వస్తుంటాను."

క్రీం కలర్ జార్జెట్ చీర భార్య చేతిలోపెట్టి శివరాం

# ఉదర నిమిత్తం

మధ్యాహ్నంనుండీ నరసింహులు నిప్పులు తొక్కినట్లు న్నాడు. భార్యమీద అతనికి పట్టరాని కోపం వచ్చింది. ఎంత బతకలేక హోటల్ పెట్టుకుంటే మాత్రం పరాయి మగ వాళ్ళతో సిగ్గులేకుండా వ్యవహరిస్తుందా ? మధ్యాహ్నం భోజనానికి వచ్చినపుడు ఆ రామిరెడ్డి సరసాలాడడమూ, యీ మనిషి ముసిముసి నవ్వులు నవ్వడమూ, తాను వసారాలో నుండి చూస్తూనే వున్నాడు. పట్టపగలు, మగడు చూస్తాడేమో అన్న జ్ఞానం కూడా లేకుండా......ఛీ! యీ మనిషిని యేంచేసినా పాపం వుండదు. అంత కోపం వున్నా, పెండ్లాన్ని చీవాట్లు పెట్టడానికి అతనికి పగలంతా తగిన సమయం చిక్కనేలేదు. దాంతో అతని మనస్సు మరీ చిరచిర లాడింది.

ఉన్న పదెకరాలూ చేసుకుంటూ వుండమని తమ్ముడినీ, తల్లినీ పల్లెటూర్లో వదలిపెట్టి, నరసింహులు టౌన్ చేరినాడు. టౌన్‌లో భోజనం హోటల్ పెట్టి ఇంకా నెలన్నర కాలేదు.

మొదట కొద్దిరోజులు హోటల్ జరుగుతుందో లేదో అని అను మానంగానే వుండినా, తరువాత వెంట వెంటనే వ్యాపారం అభివృద్ధిఐ, పని మనిషిని కూడా పెట్టుకోవలసి వచ్చింది. నెల తిరిగేటప్పటికి లాభ మేమీ లేకపోయినా భవిష్యత్తును గురించి భయం తీరింది. ఇక సుఖంగా బతకవచ్చునని తృప్తిపడుతూ వుండిన నరసింహులుకు భార్య ప్రవర్తన భయంకరమైన సమ స్యగా యెదురైంది.

టౌన్ చేరి హోటల్ పెడదామని సలహా యిచ్చింది కూడా అతని భార్యే. మొదటిసారి తల్లితో యీ మాట అన్నప్పుడు "యెవర్రా నీకీ పాడుబుద్ధులు నేర్పుతున్నది ?" అంటూ ఆమె యెగిరిపడింది. ఆ సలహా చెప్పింది తన కోడలే అని తెలుసుకొని "టౌన్ పిల్లను చేసుకోవద్దని మొత్తుకున్నా నా మాట వినకపోతివి. యింక నీకూ నాకూ ఋణాలు తీరి పోయినాయి" అంటూ ఆమె కండ్ల నీళ్లు పెట్టుకుంది.

"టౌన్ పిల్ల యిప్పుడు నిన్నేమన్నదమ్మా ? బతుకు దెరువుకు వుపాయం చెప్పడం కూడా తప్పేనంటావా ? యీ పదెకరాల చౌటి పర్రలో రెక్కలు విరుచుకున్నా మన కడు పులు నిండడం లేదు. పైగా యీ మూడేండ్లలోన్నూ వెయ్యి రూపాయలు అప్పు చేయవలసి వచ్చింది" అన్నాడు అతను.

"ఈసారి పండకపోతే ముందుకైనా పండక పోతుందా? వానలు రాకపోతే యెవరి భూములైతే పండుతాయి ?" అని తల్లి యెదురు వాదం ఆరంభించి "భూములు పండలేదని రైతు లందరూ టౌన్లు చేరి హోటళ్లు పెడుతున్నారా ?" అన్నది. అంతటితో ఆగకుండా "యివన్నీ దాని బుద్ధులే. దాని

కాఫీలూ, టిఫినులూ, యిక్కడ సాగలేదని యీ మెత్తు మొత్తింది'' అంటూ కోడలిమీద నిందలు వేసింది.

తన భార్య పని మనిషి కాదుగాని, స్కూలుమాస్టరు కూతురు కావడంవల్ల కొన్ని పని అలవాట్లు వెంట తెచ్చుకుంది. "మన పని పాటలకు ఆ పిల్ల పనికిరాదు." అని తల్లి చెప్పినా తాను వినకుండా, అందంగా నాజూగ్గా వుంటుందని మోజుపడి చేసుకున్నాడు. హోటల్ పెట్టుకుందామని ఆమె సలహా యిచ్చినప్పుడు కూడా ఆమె లోకజ్ఞానానికి తాను మురిసిపోయినాడు.

యివన్నీ నరసింహులు మనసులో మెదలినాయి. తల్లి మాటలన్నీ కోడలిమీద అత్తకుండే సహజమైన అసూయ అనే తాను అప్పుడు అనుకున్నాడు, కానీ యిప్పుడు ఆలోచిస్తే భార్యను గురించి తానే పొరపాటుపడినట్లుంది. భార్యమీద కోపానికి తోడు, నమ్మి మోసపోతిననే కించతో అతని హృదయం ఆ సాయంత్రమంతా కుతకుతలాడింది.

రాత్రి హోటల్ మూసిన తర్వాత, పని మనిషిని యింటికి పంపించిన వెంటనే తలుపులు మూసి అతను భార్యతో తీక్షణంగా అన్నాడు: "నీవు చేసే పని నాకేమీ బాగ లేదు."

ఆమెకు అర్థంగాక సహజ ధోరణిలో "యేం పని?" అన్నది.

పగలంతా అణచి పట్టుకున్న కోపం అతను ఒక్కసారి వెళ్ళగక్కినాడు. "పైగా నంగనాచి మాటలు కూడా నేర్చి నావు. మధ్యాహ్నం నీవా రామిరెడ్డితో సరసాలాడడం నేను చూళ్ళేదనుకున్నావా?"

ఒక క్షణంపాటు కామేశ్వరి నివ్వెరపోయింది. తరువాత తేరుకొని, చిరునవ్వు నవ్వుతూ అడిగింది : "నేను సరసాలాడడం మీరు చూసినారా?"

ఆమె చిరునవ్వు చూసి అతను నిప్పులు కక్కినాడు. "చూసే అడుగుతున్నాను."

"ఆ రామిరెడ్డితో నేనసలు ఒక మాట కూడా మాట్లాడలేదే?"

"మాట్లాడకపోతే సరా? అతని మాటలకు నీవు ముసి ముసి నవ్వులు నవ్వలేదూ? బుద్ధున్న మనిషివైతే అతని వెకిలి చేష్టలకు నీవు ప్రోత్సాహమిస్తావా?"

అతని ఆవేశం చూసి కామేశ్వరికి భయమైంది. రామిరెడ్డి వెకిలి చేష్టలు చేసింది నిజమే కానీ, తాను ముసి ముసి నవ్వులూ నవ్వలేదు, ప్రోత్సాహమూ యివ్వలేదు. యీ పిచ్చి మనిషికి యిట్లా అనుమానాలు కలిగి హోటల్ మూసివేస్తే యీ బ్రతుకు తెరువూ పోతుంది. యిప్పుడు కష్టపడినా కష్టానికి తగిన ఫలితమైనా దొరుకుతున్నది. మళ్ళీ పల్లెటూరు చేరితే, పుణ్యం పురుషార్థం లేని పొలంపనికి యిద్దరి జీవితాలూ అర్పించి నికృష్టమైన బ్రతుకులు బ్రతకవలసిందే. ఆమె నెమ్మదిగా అన్నది : "నేనో మాట చెప్తాను—శాంతంగా వింటారా?"

ఆమె కంఠంలోని గాంభీర్యం చూసి అతని కోపం తటాపటాయించింది. మంచంమీద కూర్చుంటూ "చెప్పు" అన్నాడు.

మంచం దగ్గరనే నేలమీద కూర్చొని కామేశ్వరి శాంతంగా ఆరంభించింది, "పల్లెటూర్లో బతకలేకనే యీ

టాస్కొచ్చి హోటల్ పెట్టుకున్నాము. నౌకర్లనూ వంట మనుషులనూ పెట్టుకునే యోగ్యత మనకులేదు. యిద్దరమూ కష్టపడితే తప్ప పొట్ట గడవదు. మనం యెంత కష్టపడినా పదిమందీ ఆదరించకపోతే హోటల్ జరగదు. . . యేమంటారు?"

ఆమె వాదం విని అతనికి వొళ్ళు మండింది. "పదిమందీ ఆదరించాలంటే తప్పుడు పనులు కూడా చెయ్యాలంటావా?"

ఆమె యింకా శాంతంగా సమాధానం చెప్పింది. "మాటి మాటికీ తప్పుడు పనులని యెందుకంటారు? మధ్యాహ్నం నేనేదైనా తప్పుపని చేసివుంటే మీరు అప్పుడే యెందుకు దండించకూడదు?"

"నలుగురిలోనూ నగుబాట్లు కావాలని వుందా నీకు?",

భర్త ముఖంలోకి చూసి కామేశ్వరి జాలిగా చిరునవ్వు నవ్వింది. "పోనీ మన వూళ్ళోనే ఆ రామిరెడ్డి అట్లా ప్రవర్తించి వుంటే యేంచేసి వుండే వాళ్లు?"

ఉద్ధృతంగా జవాబు చెప్పినాడు నరసింహులు: "అప్పుడే పండ్లు రాలగొట్టి పంపించేవాణ్ని."

"మరి యీ రోజు ఆ పని యెందుకు చేయలేదు?"

ఒక క్షణంపాటు అతను జవాబు చెప్పలేక ఉక్కిరిబిక్కిరైనాడు. మరుక్షణంలో రెట్టించిన ఆవేశంతో అన్నాడు: "ఐతే యేమిటి నీవనేది? నీ బుద్ధి గడ్డి తినింది గాక, ఆ రామిరెడ్డితో కొట్లాడలేదని నా మీదనే నెపం వేస్తున్నావా? నీవు మర్యాదగా నడుచుకుంటే యితరులను అనవలసిన పని

యేముంది? హోటలన్న తరువాత రకరకాల మనుషులు వస్తుం టారు. అందరితో కొట్లాటలు పెట్టుకుంటే యిక హోటల్ మూసుకోవాల్సిందే."

కామేశ్వరి నిబ్బరంగా చెప్పింది: "నేననేదీ అదే. హోటలన్న తరువాత రకరకాల మనుషులూ వస్తుంటారు. వాళ్ళతో కొట్లాటలు పెట్టుకుంటే హోటల్ మూసు కోవాల్సిందే."

నరసింహులుకు నోట మాట రాలేదు.

(ఫిబ్రవరి 1960)

# నీతిగానుగ

గోడమీది పాత గడియారం పన్రెండు కొట్టింది—ముల్లులు పదకొండున్నరే చూపుతున్నా. కండ్లు తెరవకుండానే ప్రక్కన వున్న వుయ్యాలను మరొకసారి అటూయిటూ వూపి సుబ్బరామయ్య కుడివైపు తిరిగి పండుకున్నాడు. గడియారం కొట్టిన గంటల శబ్దానికో, తండ్రి వుట్టిపాటుగా వూపినందు వల్లనో, వుయ్యాలలోని చంటిపిల్ల దీర్ఘంగా మూల్గింది. సుబ్బరామయ్య విసుక్కుంటూ మళ్లీ యెడమ వైపు తిరిగి వుయ్యాలను ఆడించడం ఆరంభించినాడు. నాలుగైదు నిముషాల తర్వాత పసిపిల్ల నిద్రపోయిందనే నమ్మకం కలిగి అతను మరొకసారి కుడివైపు తిరిగి గట్టిగా కండ్లు మూసుకొని నిద్రపోవడానికి ప్రయత్నించినాడు.

పొరుగింటిలోనుండి మళ్ళీ బూరగమేళం వినిపించింది. అర్ధ నిముషంలో సన్నాయీ తాళాలూ మద్దెలా తోడై యేదో సినిమా పాట యెత్తుకున్నాయి. పొరుగింట్లో పెండ్లి

జరుగుతున్న రాత్రి తాను నిద్రపోవడానికి ప్రయత్నించడమే అవివేకం అనుకుంటూ అతను లేచి కూర్చున్నాడు.

అస్తమించే సప్తమి చంద్రుని మసక వెన్నెల కిటికీగుండా లోపల పడుతున్నది. నవంబర్ మొదటి వారపు చల్లని పడమటి గాలికి యెర్రగన్నేరు కొమ్మలు మెల్లగా కదలుతున్నాయి. సుబ్బరామయ్య లేచి వచ్చి కిటికీ దగ్గర నిలబడినాడు. చల్లగాలి అతని ముఖాన్ని సుకుమారంగా స్పృశించింది. గన్నేరు కొమ్మ కొనలోని యెర్రని పూలగుత్తి వయ్యారంగా వంగి ఒకక్షణం అర్ధచంద్రునికి సంపూర్ణంగా అడ్డుపడింది. పెండ్లి యింటి ముందు లైట్ల వెలుతురులో వీధిలోని పిల్లలు కోలాహలంగా అల్లరి చేస్తున్నారు. వాళ్లతో కలిసి ఆనుకుంటూ వుండిన తన పదేండ్ల కొడుకు మురళిని అతడు తొమ్మిది గంటలప్పుడే బలవంతంగా లాక్కొని వచ్చినాడు. పిల్లవాడు వున్నాడో లేడో అని అతను తిరిగి చూసినాడు. టేబుల్ దగ్గర వున్న మంచంమీద మురళి కడుపులో కాళ్లు పెట్టుకొని నిద్రపోతున్నాడు. ఉయ్యాలకు అవతలవున్న భార్య మంచం ఖాళీగా వుంది. అతనికి భార్యమీద మనసుపోయింది.

తొమ్మిదిగంటలు కాకముందే తాను పెండ్లివారింట్లో భోంచేసి వచ్చినాడు. తన భార్య యీ రాత్రికి పెండ్లివారింట్లోనే వుంటానని చెప్పింది. మధ్యాహ్నంనుండి వాళ్లింట్లోనే వుంది, పెండ్లి పనుల్లో సాయం చేస్తూ. తమ అందరి భోజనాలూ యీ దినం పెండ్లి యింట్లోనే జరిగినాయి. పసిపిల్ల యేడిస్తే చెప్పి పంపమని ఒకటికి పదిసార్లు ఒత్తి ఒత్తి చెప్పింది. అంత శ్రద్ధ వున్నది అప్పుడప్పుడూ వచ్చి చూసిపోవచ్చునే ? చెప్పి పంపడానికి నౌకర్లు యెవరున్నారని ? ఉన్న

కోర్కె కలగడం తప్పని యెవరనగలరు? అదీ తప్పే ఐతే యింక తప్పొప్పులకు అర్థమేలేదు. తప్పుపని చేయకుండా కోర్కెలు తీర్చుకోడానికేగదా భర్తకు భార్యా, భార్యకు భర్తా వుండడం? కానీ అంత మాత్రం జ్ఞానం వుంటేనా యీ మనిషికి? యిప్పుడొక వేళ వచ్చినా, పిల్లకు పాలిచ్చి వెంటనే మళ్లీ పెండ్లి వారింటికి పోవాలంటుంది. తన కోర్కె వెల్లడిస్తే తానేదో నీచపు పని చేస్తున్నట్లు వెటకారంగా చూస్తుంది. యేం మనిషో!

అసలు వస్తేనా! వెటకారంగా చూస్తే చూస్తుంది–ఒకసారి వస్తే యెట్లైనా చావవచ్చు. వెక్కిరించినా వెటకారం చేసినా తన భార్యేగా! తన భార్య తన్ను యేమనుకుంటే యేం భయం? యేమనుకున్నా భార్య భార్యే. భర్త భర్తే.

యీ మనిషి యింక రాదు. తానెంతసేపు కాచుకున్నా యింక లాభం లేదు. తానింత వ్యధపడుతున్నాడే, యీ మనిషికి చీమకుట్టినట్లైనా వుండదేమో? యీ ఆడవాళ్లకు ప్రేమంటే యేమిటో తెలిస్తేనా! పూర్వకాలం పతివ్రతలే నయం–ప్రేమవున్నా లేకపోయినా మగవాళ్లను పూజించేవాళ్లు. యిప్పటి ఆడవాళ్లు భర్తలను పూజించనూ పూజించరు, ప్రేమించనూ ప్రేమించరు. అటు గౌరవమూ లేదు, యిటు ప్రేమా లేదు. లోకం యేమౌతున్నదో!

గోడ గడియారం అరగంట కొట్టింది.

పన్రెండయిందన్నమాట. ముహూర్తం రెండు గంటలకు. ఒంటిగంటకే వచ్చి లేపుతానన్నాడు సోమసుందరం. యిప్పుడింక పండుకున్నా, నిద్రపోవడమూ మళ్లీ ఒంటి గంటకు లేవడమూ కష్టంగానే వుంటుంది. యేదో విధంగా యీ గంట

సేవ్రూ మేలుకోవడమే మేలు. సోమసుందరం వచ్చి పిలవక ముందే తనే పోతే మరీ బాగుంటుంది. కల్యాణి పెండ్లికి తన్నొకరు పిలువవలసిన పని కూడా లేదు. సోమసుందరమూ తానూ యిరుగు పొరుగులే కాదు—పరస్పరం ఆత్మీయత కూడా వుంది. ఆడవాళ్ళ చెలిమి మరీ బలంగా వుంది. అందుకే తన భార్య మధ్యాహ్నంనుండి పెండ్లి పనుల్లో మునిగింది. అసలు కల్యాణి సోమసుందరం కూతురైనా ఆమెకు తన దగ్గరే యెక్కువ చనవుంది. తన్ను మామా అనీ, తన భార్యను అత్తా అనీ, పిలుస్తూ చిన్నప్పటినుండి తన యింట్లో తిరుగుతూ పెరిగింది. తెలివైన పిల్ల; యే మాత్రం కపటం లేని మనిషి. కన్న కూతురు కన్న మిన్నగా తన అభిమానం చూరగొనింది. యీ అమ్మాయి పెండ్లికి తానూ తన భార్యా పిలవకుండానే పోయి పెండ్లి పనులు జరిపించవలసిన బాధ్యత వుంది. అందుకే తన భార్య పోయిందిగా. తాను కూడా తనకు చేతనైనంత చేస్తూనే వున్నాడు. పెండ్లి కొడుకు పిల్లను చూడడానికి వచ్చిన రోజున తాను స్కూలుకు అర్ధదినం సెలవు పెట్టినాడు. పెండ్లి కొడుకుతో యింగ్లీషు మాట్లాడే వాళ్లు యెవరూ లేరని సోమసుందరం తన్ను మరీ మరీ ప్రాధేయపడినాడు. తమ రెండు కుటుంబాలకూ అరమరికలు లేని సంబంధం వుంది—తాను అంత మాత్రమైనా చేయక తప్పుతుందా? యీ పెండ్లి సంబంధం కుదరడంలో కూడా తన సహాయం అంతో యింతో వుంది. పెండ్లి కొడుకు కల్యాణి రూపురేఖలు మాత్రమే స్వయంగా చూసినాడు కానీ, ఆ అమ్మాయి తెలివి తేటలను గురించి తన మీదనే ఆధారపడినాడు. తాను చెప్పింది నమ్మినాడు. కల్యాణికి యింగ్లీషు వ్యాకరణం నేర్పింది

స్వయంగా తానే ఐతే! మా అమ్మాయి ముందర నీవు యింగ్లీషు మాట్లాడేవు, జాగ్రత్త, యీ కాలం బియ్యే చదువులు నాకు తెలియవూ, అన్నాడు తాను. సెప్టంబర్ పరీక్షలో మళ్ళీ రెండు పార్టులూ ఫెయిలై వచ్చిన ఆ పెండ్లి కొడుకు సరసంగా నవ్వినాడు. మంచివాడే పెండ్లి కొడుకు. అతని పేరు—ఆఁ—రఘుపతి—బియ్యే, పాస్ • కాలేకపోతేనేం — కావలసినంత ఆస్తి వుంది. కల్యాణికే లోటూ వుండదు. ఆ పైన ఆమె అదృష్టం.

అంతే—అదృష్టం కాక యెవరు చేసేదేముంది? యేదో తనకు చేతనైనంత తాను చేసినాడు. అంతకంటె తానేమి చేయగలడు? తన వుద్యోగంతోనే తనకు సరిపోతున్నది. యెంత మొత్తుకున్నా అక్షరం ముక్క అంటని అడ్డ గాడిదల కాంపోజిషన్ బుక్కులు కరెక్షన్ చేయడంతోనే తన ఆయుస్సు హరించిపోతున్నది. అన్నట్లు కరెక్షన్ చేయవలసిన బుక్కులు యింకా వున్నాయి. యీ గంటసేపూ వూరక వుండడంకంటే...

సుబ్బరామయ్య టేబుల్ దగ్గరకుపోయి లాంపూ, ఫిప్తుఫారం కాంపోజిషన్ పుస్తకాలూ తీసుకొని వచ్చి కిటికీలో పెట్టినాడు. వీపు విరిగిన పాత కుర్చీ తెచ్చి కిటికీ దగ్గర పెట్టి జాగ్రత్తగా కూర్చున్నాడు. ఒక పుస్తకం తెరచి కాంపోజిషన్ చూసినాడు. మొదటి వాక్యంలో మొదటి పదమే స్పెల్లింగు తప్పు! యీ వెధవలకు యింగ్లీషు నేర్పడంకంటె పందులకు పరిశుభ్రత నేర్పడం నయం! యెర్ర పెన్సిల్ కోసం జేబు తడవుకున్నాడు అతను. విసుక్కుంటూ లేచి టేబుల్

డ్రాయర్‌లో వున్న యెఱ్ఱ పెన్సిల్ తీసుకొని వచ్చి మళ్ళీ కరెక్షన్ ప్రారంభించినాడు.

సుబ్బరామయ్య యెఱ్ఱ పెన్సిల్ పిపుఫారం విద్యార్థుల యింగ్లీషు రచనా వైభవంమీద నిర్దాక్షిణ్యంగా దాడి చేస్తూ వుంది. పెండ్లి యింట్లో మంగళ వాద్యాలు విశ్రాంతి తీసుకుంటున్నాయి. పిల్లల అల్లరి కూడా చాలావరకు తగ్గింది. అర్ధచంద్రుడు అస్తమించినాడు. శుభ్రమైన నవంబర్ నీలాకాశపు నీలిరంగు మరింత మెరుగెక్కింది. అనామకమైన మరి కొన్ని కోట్ల నక్షత్రాలు నిక్క పొడిచినాయి. దిక్కు తెలియని శీతకాలపు పిల్ల తెమ్మెర దక్షిణంనుండి వచ్చి మంచుతో పదనెక్కిన గన్నేరు కొమ్మల మధ్య నిశ్శబ్దంగా సుడి తిరిగింది. యెఱ్ఱపెన్సిల్ ప్రయోగప్రవీణుడైన సుబ్బరామయ్య యివేమీ గమనించకుండా తన పనిలో పరవశం చెందినాడు.

మెల్లగా అస్పష్టంగా యేదో అలికిడైంది. భార్య వస్తున్నదేమో అని అతను ఆశగా వాకిలి వైపు చూసినాడు. ఉద్వేగంతో గుండె ఉబికింది. ఊపిరి బిగబట్టి యెదురు చూసినాడు. యెవరూ రాలేదు. వేసిన తలుపులు వేసినట్లే వున్నాయి. తన బ్రతుకు అంత మాత్రం అదృష్టం కూడానా! నిరాశ చేసుకొని తల కాంపోజిషన్ వైపు తిప్పినాడు.

కొద్ది క్షణాల్లో మళ్ళీ చప్పుడు వినపడింది. యీసారి స్పష్టంగా కిటికీగుండా వినపడింది. ఉలికిపడి అతను బయటికి చూసినాడు. లాంపు వెలుతురులో పని చేసుకుంటూ వుండిన అతని కండ్లకు బయటి చీకటిలో, కిటికీకి బారెడు దూరంలో,

మసక మసకగా అస్పష్టంగా ఒక అందమైన ఆకారం కన పడింది. గాజుల గలగలతో చేయెత్తి అతన్ని బయటికి రమ్మని సైగచేస్తూ వుంది. యెవరో తన్ను ఆహ్వానిస్తున్నారనే విన శక్యం అర్ధనిముషంసేపు అతని మనసు నాక్రమించి చైతన్య రహితుని చేసింది. యింతలో చూపులు చీకటికి అలవాటుపడి తన్ను కల్యాణి పిలుస్తున్నదని అర్థమైంది. అర్థమైన ఆ అర క్షణంలో అతని హృదయంలో వేయి వింత వికారాలు వికసించి నాయి. మనసులో పరస్పర విరుద్ధమైన పదివేల విపరీత భావాలు విజృంభించినాయి. చీకటి కోర్కెలూ ధార్మిక అను బంధాలూ వ్యక్తావ్యక్తంలో ఘర్షణపడినాయి. గుండె వేగంగా కొట్టుకుంది. కల్యాణి! తన్ను పిలుస్తున్నది! "యేమిటి కల్యాణి!" అన్నాడు అతను అకస్మాత్తుగా-అనాలోచితంగా.

కల్యాణి! పెండ్లి కూతురు! ఒంటరిగా వచ్చింది! అర్ధ రాత్రి సమయం! తన్ను రమ్మని సైగ చేస్తున్నది! అన్నిటి కంటె ముందు అప్రయత్నంగా అతని మెదడుకు అర్థమైంది ఆమె ప్రవర్తనలోని రహస్యస్వభావం.అందుకు అనుగుణమైనట్లు అతని కంఠం కూడా అప్రయత్నంగానే మెల్లగా పలికింది— "యేమిటి కల్యాణి!" ఆశ్చర్యమూ ఆందోళనా మేళవించిన ఆ కంఠంలో రహస్యగోపనా తత్పరత ప్రముఖంగా వుంది.

కల్యాణి మళ్లీ సైగ చేసింది. సుబ్బరామయ్య తొట్రుపాటుగా లేచి తలుపు తీసుకొని బయటికి వచ్చినాడు. కిటికీ దగ్గర వున్న కల్యాణి అతని కెదురుగా నాలుగడుగులు వడివడిగా ముందుకు నడిచింది. ఆమె నడక వేగానికి కొత్త బట్టలు కరకర లాడినాయి. నవంబర్ నక్షత్రాల మిణుకు మిణుకు కిరణాల చిరువెలుగులో ఆమె కన్నులు

కాంతివంతంగా మెరిసినాయి. ఆమె ముఖంలోని భావం యేమీ అతనికి అర్థం కాలేదు. దగ్గరకు వచ్చి "యేమి టమ్మాయ్? యేమి సంగతి?" అని ఆదుర్దాగా ప్రశ్నించినాడు.

కల్యాణి ముఖమెత్తి యేదో చెప్పబోయి మళ్ళీ తల దించుకుంది. ఆమె ప్రవర్తన చూస్తే యేదో తీవ్రమైన ఆందోళనకు గురి ఐనట్లుంది. అతనికి వెంటనే అనుమానం వచ్చింది- తన భార్య కేదైనా-"చెప్పమ్మా, మీ అత్త కేమైంది ?"

కల్యాణి మెల్లగా చెప్పింది : "నిన్ను నమ్ముకొని వచ్చి నాను మామా!"

"యేమిటమ్మా ? యేమిటి ? సరిగా చెప్పు."

"నాకీ పెండ్లి వద్దు." ఆమె ముఖమెత్తి అతని ముఖం లోకి చూసింది.

"ఆఁ! యిదేమిటి ! యెందుకు వద్దు ?"

ఆమె బదులు పలకకుండా అతని ముఖంలోకి చూస్తూ నిలబడింది.

"చెప్పు కల్యాణి-యేం జరిగింది ?"

ఆమె జాలిగా జవాబు చెప్పింది : "యీ పెండ్లి తప్పించు మామా-నీవు తప్ప నా కింకెవరున్నారు ?"

"యేమిటమ్మా, నీకేమైనా పిచ్చి పట్టిందా ? యింకొక గంటలో పెండ్లి కాబోతుంటే ?"

ఆమె మౌనంగా తల దించుకుంది.

"యింట్లోకి పోదాంరా-యేమిటో వివరంగా చెప్పుదువు గాని." సుబ్బరామయ్య అన్నాడు.

"వద్దు మామా-నీవు సహాయం చేయకపోతే తిరిగి పోతాను."

"యేమిటి కల్యాణీ నీ వెర్రి? సంగతేమిటో చెప్పకుం డా నే సహాయం యేమని చేయమంటావు? మంచు పడుతున్నది-యింట్లోకి పోదాం రా."

"యీ పెండ్లి తప్పిస్తానని మాటయిస్తే నస్తాను. చెప్పు మామా. లేకుంటే పోతాను."

"మళ్ళీ అదే మాటేనా? పెండ్లి తప్పించడమంటే మాటలనుకున్నావా? రా-యిక్కడ వుంటే యెవరైనా చూస్తారు-లోపలికి పోదాం రా."

కల్యాణి బరువుగా సమాధానం చెప్పింది. "వద్దులే-పోతాను. సహాయం చేయగల వానివి నీ వొక్కనివే వున్నావని నిన్ను నమ్ముకొని వచ్చినాను." ఆమె కంఠం దుఃఖంతో గద్గద మైంది. "నీవూ కాదంటే, నా బాధేదో నేనే పడతాను."

కల్యాణి కంఠంలోని బాధ సుబ్బరామయ్య గుండెల్లో గుచ్చుకుంది. ఆమెకూ తనకూ పదేడు పద్ధెనిమిదేండ్ల యెడ తెగని అనుబంధం వుంది. ఆమె జీవితంలో సగం తన యింట్లోనే గడిచింది. తల్లిదండ్రుల దగ్గర కంటె తన దగ్గర యెక్కువ చనువు సంపాయించుకుంది. చిన్నప్పుడు తన ఒడిలో కూర్చొని ఆడుకుంది. తన రొమ్ము యెక్కి తొక్కింది. తన వ్రేలు పట్టుకొని నడచింది. తన విస్తట్లో తిని పెరిగింది. తన దగ్గర పాఠాలు చెప్పించుకుంది. తన భార్యకు జబ్బు చేస్తే వచ్చి వండి పెట్టింది. తన పిల్లలకు సేవ చేసింది. ఒక్కసారి గతమంతా ముద్ద కట్టుకొని వచ్చి సుబ్బరామయ్య కన్నుల ముందు నిలిచింది. ఆమె కంఠంలోని గాద్గద్యం అతని వెన్నులో పొడిచింది.

"వుండమ్మా-యెక్కడ పోతావు? నీ పిచ్చి నీదే కాని

సంగతేమిటో చెప్పవూ?'' అతని కంఠంలో జాలీ అనురాగమూ తొణికిస లాడినాయి.

అతని కంఠంలో వచ్చిన మార్పుకు కల్యాణిలోని ఆవేదన తగ్గింది. ఆశ నిండిన చూపులతో, వికసించే ముఖ మెత్తి, నిండు గొంతుకతో ఆమె అడిగింది: ''చేస్తావా మామా-సాయం చేస్తావా?''

''యెందుకు చేయనమ్మా-నీవు కోరితే యేదైనా చేస్తాను.''

''ఐతే...'' కల్యాణి వెనక్కు తిరిగి చూసింది.

''యేమిటమ్మా?''

ఆమె వడివడిగా నడిచి గన్నేరు పొద వద్దకు పోయింది. పొద చాటునుండి ఒక యువకుడు యివతలికి వచ్చినాడు. యిద్దరూ కలిసి క్షణంలో సుబ్బరామయ్య దగ్గరికి వచ్చినారు. యెవరితను? యీ అమ్మాయి యెంత సాహసానికి ఒడిగట్టింది? ''యెవరు కల్యాణీ?'' సుబ్బరామయ్యకు మనసు మనసులో లేదు. అగాధమైన లోయ అంచున నిలబడినట్లు భయంతో హృదయం కంపించింది.

''నేనేనండి.'' ఆ యువకుడు జవాబు చెప్పినాడు.

''యెవరు? రాజగోపాలా?''

''ఔను మామా.'' కల్యాణి ఉత్సాహంగా జవాబు చెప్పింది. ''మేమిద్దరం ప్రేమించుకున్నాం. యెక్కడైనా పారి పోయి పెండ్లి చేసుకుంటాం.''

సుబ్బరామయ్యకు గుండె ఆగినట్లైంది. నోటమాట రాలేదు. యెంత పని చేసింది! తన కండ్ల ముందు పెరిగిన కల్యాణి! అమాయకమైన ఆడపిల్ల అని యిన్నాళ్ళూ తాను

కోన్న కల్యాణి! తన అంతులేని అభిమానానికి పాత్రమైన కల్యాణి! తన హృదయంలో గూడు కట్టుకున్న కల్యాణి! అతనికి ప్రపంచమే తలక్రిందులైనట్లైంది. నమ్మిన కులదేవతలే భూతాలై భయంకరంగా వికటాట్టహాసం చేసినట్లైంది.

"యేమంటావు మామా? మాకు సాయం చేస్తావు గదూ?" కల్యాణి ఉత్కంఠతో ప్రశ్నించింది.

భయమూ, బాధా, క్రోధమూ ముప్పిరిగొన్న కంఠంతో సుబ్బరామయ్య అన్నాడు: "యింత పని చేసిన దానవు నీ కొకరి సాయమెందుకు?"

"ఆఁ?"

"నీ కింకా యేం సాయం కావాలి?"

అతని కంఠంలోని పరుషత్వం ఆమెకు అర్థమైంది. "అదేమిటి మామా? నీ సాయమే మా కిప్పుడు చాలా అవసరం. నా ఒంటిమీద నగలున్నాయిగానీ డబ్బేమీ లేదు. రాజా దగ్గర కూడా డబ్బేమీ లేదు."

"అంతేనా?" సుబ్బరామయ్య వెటకారంగా అన్నాడు.

"డబ్బొకటే కాదు. నీవు మా వెంట వచ్చి మా పెండ్లి జరిపించు మామా. మా కింక యెవరున్నారు? నీ విప్పుడే రాలేకపోతే మమ్మెక్కడ పొమ్మంటావో చెప్పు. నీవేమి చేయమంటే అది చేస్తాం."

"నేను చేయమనడమెందుకు? చేయవలసిందంతా చేసి కూర్చున్నావు."

"అంతే కాదు మామా-ముఖ్యంగా నీవు మా నాన్నకూ అమ్మకూ నచ్చజెప్తావు కదూ? మా పెండ్లి ఐన తర్వాత నీవు

వాళ్లను ఒప్పిస్తే సరిపోతుంది. లేకపోతే బ్రతికినన్నాళ్లూ యెడ బాట్లు తప్పవు.''

''నీకు అమ్మా నాన్నా కనిపిస్తూనే వున్నారా?''

కల్యాణి తన ధోరణిలోనే చెప్పుకపోతున్నది. ''త్వరగా చెప్పు మామా. ఒంటిగంటకు రైలుంది. ఆ రైలుకు పోద్మాం టావా? మద్రాసుకు పోదామనుకున్నాము. యేమంటావు? నీవూ యిప్పుడే వస్తావా మా వెంట? త్వరగా కానీ మామా-రైలుకు టైమౌతున్నది.''

పరిస్థితి అనుకూలంగా లేదని రాజగోపాల్‌కు అ మైంది. ''కల్యాణీ, పోదాం రా'' అన్నాడు అతను.

''వుండు రాజా. యేం మామా-రైలుకు పోదామా?'' ఆదుర్దాగా అడిగింది ఆమె.

సుబ్బరామయ్య యింతసేపూ ఆలోచనలకు వ్యవధి యివ్వని ఆవేశాలకు లోనైనాడు. రాజగోపాల్ మాటలతో అతనికి హఠాత్తుగా కర్తవ్యం స్ఫురించింది. కల్యాణి ఆపదలో వుంది-తాను రక్షించగలడు. కల్యాణి సర్వనాశనమౌతున్నది-తాను వుద్ధరించగలడు. కల్యాణి దుస్సహమైన దురంతానికి ఒడిగట్టింది-తాను అడ్డుపడగలడు. చేయవలసిన పని ఒక క్షణంలో నిర్ణయించుకున్నాడు అతను. ''యింట్లోకి పోదాం రా. వివరాలన్నీ చెప్పితేగానీ నేనేమీ చెప్పలేను.'' అన్నాడు.

''వివరాలేమున్నాయ్? అసలింక టైం లేదు మామా-రైలు ఒంటి గంటకు వస్తుంది.''

సుబ్బరామయ్య విసుగు ప్రదర్శించినాడు. ''యేమిటి కల్యాణీ? యింట్లోకైనా పోకుండానే రమ్మంటావా నన్ను? అసలు మీకు డబ్బు కావద్దూ?''

అతని వెంట యింట్లోకి పోవడానికి పూనుకొని కల్యాణి ఒకడుగు ముందుకు వేసింది. రాజగోపాల్ తొందరగా అన్నాడు: "వుండుకల్యాణీ—డబ్బేమీ అక్కరలేదు—పోదాంరా."

"అదేమిటి ?" కల్యాణి ఆశ్చర్య పడింది.

"డబ్బు తెచ్చేటట్లుంటే ఆయనే పోయి తెమ్మను. మన మిక్కడనే వుందాం, బయటనే వుందాం."

కల్యాణి ఒక క్షణం రాజగోపాల్ వైపు చూసింది. తిరిగి సుబ్బరామయ్య ముఖంలోకి చూసింది.

సుబ్బరామయ్య నిశ్చలంగా అన్నాడు: "పోదాం రామ్మా— పైమాటన్నది."

కల్యాణి ముందుకు కదలుతూ అన్నది: "రా, రాజా— మా మామ మీదనే అనుమానమా ?"

సుబ్బరామయ్య ఆమె ప్రక్కన నడుస్తూ అన్నాడు: "అతనెందుకమ్మా ? అతన్నిక్కడనే వుండమను. నీతో నేను రెండు మూడు మాటలు మాట్లాడాలి."

"యేం మాటలు మామా ? రాజా వినకూడని మాట లేమున్నాయ్ ?"

"వినకూడని మాటలని కాదమ్మా. హఠాత్తుగా వచ్చి నన్నేదో చేయమంటున్నావు. యేమి చేయవలసిందీ నేను ఆలోచించుకోవద్దూ ? ఆలోచించుకోడానికి పరిస్థితి యేమిటో వివరంగా తెలుసుకోవద్దూ ? నీ మనసులో యేముందో నా కిప్పటికీ సరిగా అర్థమే కాలేదు."

వాళ్ళ వెనుక నడుస్తూ వుండిన రాజగోపాల్ కు తాను బయటనే వుండడం క్షేమమని తోచింది. "నేను బయటనే

వుంటాను కల్యాణీ.'' అన్నాడు అతను. "మీరు త్వరగా యేదో ఒకటి తేల్చండి.''

యిద్దరూ లోపలికి పోయినారు. కల్యాణి టేబుల్ దగ్గర గోడ కానుకొని నిలబడింది. సుబ్బరామయ్య తలుపు మూసి గడె వేసినాడు.

"అదేమిటి మామా? గడె యెందుకు వేస్తున్నావు?'' ఆమె ఆందోళనగా అడిగింది.

వాకిలి దగ్గరనే నిలబడి అతను పరుషంగా అన్నాడు: "ఇంక చెప్పు-నీకేమైనా తల చెడిందా? పెండ్లి కావలసిన పిల్ల చేయవలసిన పనేనా యిది?''

అతను చేసిన మోసం ఆమెకు హఠాత్తుగా, పిడుగు పాటుగా అర్థమైంది-భయంకరంగా, హృదయవిదారకంగా అర్థమైంది. "మామా'' అంటూ కేక వేసి తలుపు దగ్గరకు పరుగెత్తింది. గడె తీయడానికి ప్రయత్నించింది.

సుబ్బరామయ్య ఆమె చేతులు పట్టుకొని లాగినాడు. "నన్ను పోనీ, నన్ను వదలు'' అని పెనగులాడుతున్న కల్యాణిని లాక్కొని వచ్చి మంచంమీద పడవేసి, కోపమూ అసహ్యమూ కూరిన కంఠంతో అన్నాడు: "నీవు చేసే తప్పుడు పనికి సహాయం చేయాలా? నీకు బుద్ధి లేకపోతే నాకూ లేదనుకున్నావా? అసలు నీవు చేసిన పని యేమైందీ నీకు తెలుసునా? ఒక గంటలో పెండ్లి కావలసిన దానవు యెవరితోనో లేచిపోతే మీ అమ్మా నాన్నా యేమౌతారనుకున్నావు? యిప్పుడీ సంగతి పెండ్లి వాళ్ళకు తెలిస్తే నీ బ్రతుకు యేమౌతుందనుకున్నావు?''

కల్యాణి మంచం మీద కూర్చొని తడి కన్నులతో

అతని వైపు చూసింది. అతని ముఖం అసహ్యంగా కనపడింది. ఆకారం మూర్తీభవించిన మూర్ఖత్వంగా కనపడింది. కన్నీళ్లు కారుస్తూ బొంగురుపోయిన కంఠంతో ఆమె అన్నది: "నీ వింత మోసం చేస్తావనుకోలేదు."

"తప్పుడు పని చేయడంగాక నన్నే మోసం అంటు న్నావా ?"

"నేనేమీ తప్పుడు పని చేయడం లేదు. నా కిష్టంలేని పెండ్లి చేసుకొమ్మని బలవంతం చేస్తున్నారు. నా కాళ్లు కట్టి గంగలో త్రోయడానికి సిద్ధపడుతున్నారు. మీదే తప్పుడు పని."

"యెందు కిష్టం లేదు? యీ పెండ్లి కొడుక్కు యేమి లోటుందని ? నీ రాజగోపాల్ కంటె అతనెందులో తీసిపోయి నాడని ? నిన్ను లేపుక పోవడానికి వచ్చిన యీ వెధవకు రైలు ఛార్జీల కూడా గతిలేదు."

"మామా" కల్యాణి గట్టిగా అరచింది. "నీ వెవరినీ మాటలన నక్కరలేదు. నిన్ను నమ్ముకొని వచ్చినందుకు నీవు చేసింది చాలు. యేది కోరినా చేస్తానని నమ్మించి గొంతులు కోసే కిరాతకుడివి."

సుబ్బరామయ్య వికటంగా నవ్వుతూ మంచం దగ్గరికి వచ్చినాడు. "నీ మేలు కోరే వాళ్ళే నీకు కిరాతకులుగా కనపడు తున్నారు. నేను కిరాతకునే ఐతే నిన్నా వెధవ వెంట పంపి నీ జీవితం సర్వనాశనమైనప్పుడు సంతోషించి వుందును. నీమీద అభిమానం వుండబట్టే, నీ మేలు కోరి యీ పని చేస్తున్నాను."

"అభిమానం !" దుఃఖభారంతో ఆమె కంఠం గజగజ వణికింది. కన్నీళ్లు ధారగా కారుతున్నాయి. "నీవు చూపించిన

అభిమానం జీవితమంతా జ్ఞాపక ముంటుంది. నీ పేరు తలచు కొని ఏ రైలు క్రిందనో పడి చస్తాను.'' అరచేతులతో ముఖం కప్పుకొని తలవంచి ఆమె భోరున యేడ్చింది.

సుబ్బరామయ్య హృదయంలో ఏ మూలనో జాలి పొడసూపింది. మెల్లగా అతనన్నాడు: ''యెందుకమ్మా అంత దుఃఖం? రైలు క్రిందపడి చావ వలసిన ఖర్మ నీకే మొచ్చింది? రఘుపతిని చేసుకుంటే నీకేలోటూ వుండదు. నీ జీవితం సుఖంగా జరుగుతుంది?''

కన్నీళ్లతో తడిసిన ముఖమెత్తి కల్యాణి దీనంగా అడిగింది: ''బలవంతపు పెండ్లి చేసుకుంటే సుఖపడతారా మామా?''

''బలవంతం యేముందమ్మా? నీ సుఖం కాక మేము కోరే దేముంది?''

''సుఖం! ప్రేమ లేని పెండ్లి చేసుకొని యేమని సుఖపడ మంటావు?''

సుబ్బరామయ్య అపహాస్యంగా చిరునవ్వు నవ్వినాడు. ''పిచ్చిపిల్లవు గాకపోతే ప్రేమ యేమిటమ్మా! పడుచుదనపు కోర్కెలూ, పసితనపు భావాలూ! పెండ్లి చేసుకొని నీ భర్తను ప్రేమించు—నీ యిష్టం వచ్చినంత ప్రేమించు, యెవ రొద్దన్నారు?''

కల్యాణి మళ్లీ తల వంచుకుంది. అతని మాటలు ఆమెకు జుగుప్స కలిగించినాయి. అతనితో మాట్లాడడమే అసహ్యమనిపించింది. యెంత నీచంగా మాట్లాడుతాడు! యెంత అసహ్యమైన మనిషి! చిన్నప్పటినుండి మామా అంటున్న మనిషి యెంత నీచుడు! తన అభిమానమంతా త్రుమ్మరించిన మనిషి యెంత అల్పుడు! తన విశ్వాసమంతా

మూటగట్టి పెట్టిన మనిషి యెంత క్షుద్రుడు! తన కిన్నాళ్ళూ యెందుకు తెలియలేదు? మనిషేనా యితను? మనుష్యులందరూ యింతేనా? ఆమెకు మనుష్యులందరూ అసహ్యంగా కనపడి నారు. లోకమే జుగుప్సాకరమైంది. తన ఆశ లింక ఫలించవని నిరాశ క్రమ్మింది. యెదుటి మనిషి మీద అసహ్యంతో, తన భవిష్యత్తును గురించి నిర్వేదంతో, నిట్టూర్పులు నిగి డిస్తూ, తలవంచుకొని, కర్కశమైన కంఠంతో పలికింది: "నా ప్రేమను నీవింత చులకనగా చూస్తావనుకో లేదు. ప్రేమంటే నీకింత అసహ్యమైన అభిప్రాయాలున్నాయనుకో లేదు. చదువుకున్న వాని వనుకున్నాను. అంతో యింతో సంస్కారం వుంటుందనుకున్నాను. నా ప్రేమ నీకు అర్థమౌతుం దనుకున్నాను. సానుభూతి చూపిస్తావనుకున్నాను. సహాయం చేస్తావనుకున్నాను. నా కోసం యే పనైనా చేస్తావను కున్నాను. నా సుఖం కోసం యెంత త్యాగమైనా చేస్తావను కున్నాను."

సుబ్బరామయ్య తీవ్రంగా జవాబు చెప్పినాడు: "నీ కోసం కాకపోతే యిదంతా యెవరి కోసం అనుకున్నావు? అర్థ రాత్రి పూట నీతో యిన్ని మాటలు పడుతున్నది యెవరి కోసం అనుకున్నావు? నీవు చెడిపోతుంటే చూడలేక అష్ట పడడం యెవరి కోసం అనుకున్నావు? నీవు యే చిల్లర వెధవ తోనో లేచిపోతుంటే బాధపడడం యెవరి కోసం అను కున్నావు?"

కల్యాణి ఉద్రేకంగా లేచి నిలబడింది. "నీ వెవరినీ చిల్లర వెధవ లన నక్కరలేదు. చిల్లర వెధవలు యెవరైందీ తెలుస్తూనే వుంది."

"తెలుస్తూనే వుంది. చిల్లర వెధవ కాకపోతే, పెండ్లి కావలసిన పిల్లను సర్వనాశనం చేయడానికి పూనుకుంటాడా? నీ నగలమ్ముకొని బ్రతకడానికి సిద్ధపడిన నీచుడు! రైలు ఛార్జీల కూడా గతిలేని వెధవ!"

కల్యాణి రోషంతో బుసకొట్టుతూ తన రాజాను సమర్థించింది. "నీకు మర్యాదగా మాట్లాడడం కూడా చేతకాదు. రాజా నీయంత నీచుడేమీ కాదు. నా నగలమ్ముకొని బ్రతకవలసిన కర్మ అతని కేమీ లేదు. యీ పెండ్లి ఖాయమైనప్పటినుండి నన్ను తప్పించుకొని తిరుగుతున్నాడు. యెన్నిసార్లు పిలవనంపినా రాలేదు. కడసారైన కనపడమని వుత్తరం వ్రాసి పంపితే యిప్పుడు వచ్చినాడు. పెండ్లి చేసుకుని సుఖపడమనిచెప్పినాడు. పెండ్లి కాబోతున్నదానికి కళంకం కలిగించడం తన కిష్టం లేక రాలేదన్నాడు. నేనెంతో బలవంతం చేస్తేగాని నా వెంట రావడానికి యిష్టపడలేదు. యీ పెండ్లి జరిగితే ఆత్మహత్య చేసుకుంటానని కండ్ల నీళ్లు పెట్టితే అప్పుడు ఒప్పుకున్నాడు." ఆమె హృదయంలో క్రమంగా రోషం తగ్గి వేదన హెచ్చింది. "డబ్బు కొరకు ప్రయత్నం చేయడానికి యిద్దరికీ వీలు చిక్కలేదు. డబ్బు లేదని కూడా రాజా వెనుకాడినాడు. యే సహాయమైనా చేయడానికి మా మామ వున్నాడని నిన్ను నమ్ముకొని వచ్చినాను. యిటువంటి విషయాలలో పెద్దవాళ్ళ నెవరినీ నమ్మకూడదని రాజా యెంత చెప్పినా నా బుద్ధి గడ్డి తినింది. టిక్కెట్లు లేకపోయినా రైలెక్కి పోదామన్నాడు. రాజా యెంత చెప్పినా వినకుండా నిన్ను నమ్మి వచ్చినందుకు..." ఆ వేదన అధికమై ఆమెకు నోరు తడబడింది. కన్నీళ్ళు జాలుగా కారుతున్నాయి. రాజాను తలచుకొని, రాజా మీద తన కున్న

ప్రేమ తలచుకొని, సుబ్బరామయ్య చేసిన మోసం తలచుకొని, తనకు కలిగిన పరాభవం తలచుకొని, కడుపులో నుండి కట్టలు తెంచుకొని పొంగి వచ్చే దుఃఖం ఆపుకోలేక, వెక్కి-వెక్కి యేడుస్తూ ఆమె మళ్ళీ మంచంమీద కూలబడింది. "నేను సుఖపడడం మీకు కిష్టం లేదు నేను బ్రతకడం మీ కిష్టం లేదు. బ్రతికినంత కాలం మీరు పన్నిన వుచ్చులలో విలవిల తన్నుకొని చావవలెనని మీ కోరిక. మీ మర్యాదలకు నన్ను గడ్డి తినమంటున్నారు. మీ ప్రతిష్ఠలకు నన్ను బలి చేస్తున్నారు. మీరు పశువులు. మీ పిల్లలు సుఖపడితే చూసి ఓర్వలేని కిరాతకులు. మీ గౌరవాలకోసం పిల్లలనే బలియిచ్చే రాక్షసులు. పిల్లల ప్రాణాలతో ప్రతిష్ఠలు నిలబెట్టుకొనే పాపాత్ములు."

సుబ్బరామయ్య నిశ్చేష్టుడైనాడు. యింత ఆవేదన, యింత ఆవేశం, అతనెన్నడూ చూసి యెరగడు. ఒక క్షణం పాటు అతనికి మనసు కరిగింది. ఆమె కోరినట్లు నడుచుకుందామన్నంత కనికరం కలిగింది. కల్యాణికి యెంత బాధ కలిగింది! తన కల్యాణికి యెంత దుఃఖం కలిగింది! పద్ధెనిమిదేండ్లుగా పెరిగిన మమకారం ఉప్పొంగి ఒక క్షణం పాటు హృదయమంతా ఆక్రమించింది. కన్నులు చెమ్మగిల్లినాయి. మరుక్షణంలోనే అతనికి నైతిక బాధ్యతలన్నీ జ్ఞాపకం వచ్చినాయి. నాగరిక సాంఘిక ధర్మాల క్రింద కనికరం అణగి పోయింది. నిత్య జీవిత నియమాల క్రింద మమకారం ముడుచుకపోయింది. యెన్నడూ అనుభవించని హృదయ మధనంతో అతను ఒక నిముషం సేపు నిశ్చేష్టుడై నిలబడినాడు.

"కల్యాణీ," కిటికీ గుండా రాజగోపాల్ గొంతు విన

పడింది. యిద్దరూ కిటికీ వైపు చూసినారు. "యింక లాభం లేదు. మీ నాన్న వస్తున్నాడు." సమాధానం కొరకు యెదురు చూడకుండా రాజగోపాల్ చీకటిలో అదృశ్యమైపోయినాడు. కల్యాణి బిక్క మొఖంతో సుబ్బరామయ్య వైపు చూసింది. సుబ్బరామయ్య తెప్పరిల్లి గబగబా గడె తీసి తలుపులు తెరచి నాడు. "యింకనైనా తెలివి తెచ్చుకొని మర్యాదగా మసలు. యే మాత్రం అల్లరి ఐనా నీ జీవితమంతా నాశనమౌతుంది." అని కల్యాణితో చెప్పి అతను వాకిలి దాటి బయటికి వచ్చి నిలబడినాడు. తరువాత రెండు క్షణాల్లో పెట్రోమాక్సు లైటు తీసుకొని యిద్దరు మనుషులూ సోమసుందరమూ వచ్చినారు.

## 2

వీధి చివర విడిది యింట్లో ఆడవాళ్లు ముహూర్తానికి ముస్తాబౌతున్నారు. ఒక ప్రక్క పరుపుల మీదా చాపలమీదా పది పన్రెండుమంది పిల్లలు ఒకరి మీద ఒకరుపడి నిద్రపోతున్నారు. పెండ్లి కొడుకు అక్క కనకలమ్మ, విడిది యింటినుండి పెండ్లి యింటికీ, పెండ్లి యింటినుండి విడిది యింటికీ, అప్పటికే నాలుగుసార్లు తిరిగి యెవరికి అవసరమైన వస్తువులు వాళ్ళకు అందిస్తూ అందరినీ తొందరపెడుతున్నది. యింటి ముందరి విశాలమైన వసారాలో యెడమ వైపు కంబడి పరచుకొని పెండ్లి కొడుకు తండ్రి తాంబూలం వేసుకుంటూ బంధువులతో కబుర్లు చెప్పుకుంటున్నాడు. మేడమీద నిద్రపోయే వాళ్లందరూ ఒక గదిలో నిద్రపోగా, మరొక గదిలో కొంతమంది పేకాట ఆడు

తున్నారు. పెండ్లి కొడుకు రఘుపతి మిత్రుల దగ్గర కూర్చొని పేకాట చూస్తున్నాడు.

కమలమ్మ మరొకసారి అందరి వైపూ కలయజూసింది–యింకా యెవరికైనా యేమైనా కావాల్నా అన్నట్లు. పౌడరు డబ్బాలూ, నూనెసీసాలూ, తల పిన్నులూ, యెవరికీ యేమీ అవసరమున్నట్లు లేదు. యెవరి అలంకరణలో వాళ్లు మునిగి యెవరూ యే పనీ పురమాయించక పోవడంతో, ఆమె నిద్ర పోతున్న కూతురు దగ్గరకుపోయింది. "లెయ్యమ్మా, తల దువ్వి జడవేస్తాను" అంటూ ఆ రేండ్ల శారదను చంకలో వేసుకొని దొడ్డి వాకిలి దగ్గర బానలో వున్న చల్లనీళ్ళతో ముఖం తుడిచింది. శారదకు చివ్వున మెలకువ వచ్చి తల్లి చేయబోయే సింగారాన్ని తీవ్రంగా ప్రతిఘటిస్తూ తారా స్థాయిలో యేడుపు యెత్తుకుంది. శారద యేడుపు విని రఘుపతి మేడమీద నుండి దిగి వచ్చినాడు. తమ్ముని చూసి కమలమ్మ "యేమి రఘూ, యింకా యిక్కడనే వున్నావా ? ఒంటి గంటైనా నిన్ను పిల్చుక పోవడానికి పెండ్లి వాళ్ళెవరూ రాలేదూ ?" అన్నది.

రఘుపతి చేతి గడియారం చూసుకొని "ఒంటి గంట కాలేదులే, యింకా పంద్రెండున్నరకూడా కాలేదు." అంటూ విప్పిన జడలు విరబోసుకొని యెగిరెగిరి యేడుస్తున్న శారదను యెత్తుకున్నాడు.

"ముహూర్తం మించి పోతున్నది. వీళ్ళకు అన్నీ మనమే చెప్పి చేయించవలసి నట్లుంది. ఒకసారి పెండ్లి యింటికి పోయి వస్తాను–యింకా ఆలస్యం కాకుండా." అంటూ ఆమె ప్రయాణమైంది.

రఘుపతి ఆమెను వారించినాడు: "యెందుకక్కా–

వాళ్ళకు మాత్రం తెలియదూ ? ప్రతిదానికీ నీవు అనవసరంగా తాపత్రయ పడతావు.''

''సరేలే. యింతలో నీ వీ పిల్లను సమదాయించు. వెంటనే వచ్చి జడ వేస్తాను. మళ్ళీ నిద్రపోతుందేమో కీడ పిల్ల-జాగ్రత్తరా.'' అంటూ ఆమె తిరిగి చూడకుండా వెళ్లి పోయింది.

శారదను యెత్తుకొని రఘుపతి వసారాలోకి వచ్చినాడు. తండ్రీ, మేనమామా, యింకా దగ్గరి దూరం బంధువులూ, వసారాలో మాట్లాడుకుంటున్నారు. రఘుపతి శారదను భుజం మీద పండబెట్టుకొని జోకొట్టుతూ అటూ యిటూ తిరుగు తున్నాడు.

''యింక యీ సంవత్సరం వానరాదు.''రఘుపతి తండ్రి వెంకట రమణయ్య అన్నాడు. ''వచ్చేటట్లుంటే పోయిన శని వారం నాడే రావలసింది. వర్షానికి అంత బలమైన ముహూర్తం యింక లేదు.''

'' పంచాంగాలకేమిలే-బలం వున్ననాడు వాన రాక పోతే, బలం లేనినాడు రాకూడదా ?'' రఘుపతి మేనమామ శేషాచలం అన్నాడు.

''బలం వున్నప్పుడే రాకపోతే, లేనప్పుడెట్ల వస్తుం దోయ్ ?'' అన్నాడు వెంకటరమణయ్య, బావమరది అజ్ఞా నాన్ని అపహాస్యం చేస్తూ.

''మరి అంత బలంవుంటే శనివారం నాడు యెందుకు రాలేదు ?'' శేషాచలం సవాల్ చేసినాడు.

''బలం వుండబట్టే అంతగా మబ్బులు పట్టినాయి. లేక

పోతే అదీ లేదు." అన్నాడు ఒక దూరపు బంధువు. అతను యెవరైందీ రఘుపతికి అర్థం కాలేదు.

"పంచాంగాలను నమ్ముకొని యింతవరకూ యెవరూ బాగుపడలేదు." అన్నాడు యింకొక పెద్ద మనిషి తీర్మానంగా. అతని కంఠంలోని నిశ్చితత్వానికి రఘుపతి చిరునవ్వు నవ్వుకున్నాడు.

వెంకటరమణయ్య సమర్థించుకున్నాడు: "మనలో యింత మాత్రం న్యాయం యేమున్నది! మనం సరిగా లేనప్పుడు పంచాంగాలు మాత్రం సరిగా యెట్లుంటాయి?" తండ్రి మాటలు పంచాంగాలను సమర్థించడమో, పంచాంగాలు సరిగా నడవకపోవడాన్ని సమర్థించడమో రఘుపతికి అర్థం కాలేదు. అర్థం కాకపోయినా తండ్రి మాటల్లో యేవో నిజాయితీ వున్నట్లు అతనికి తృప్తి కలిగింది.

శారద రఘుపతి భుజం మీదనే నిద్రపోయింది. వసారాలో కుడి వైపు కొనన వున్న బెంచీ దగ్గరకు పోయి అతను శారదను పండబెట్టి బెంచీ మీద కూర్చున్నాడు. యింతలో మేడమీదనుండి అతని మిత్రుడు సూర్యం దిగి వచ్చి దూరంగా వున్న రఘుపతిని చూసి అక్కడికే వచ్చినాడు.

"యేం సూర్యం, పేకాట విసుగైందా?" అంటూ రఘుపతి అతన్ని పలకరించినాడు.

"అదేం లేదు—డబ్బైపోయింది." అన్నాడు సూర్యం పెదవి విరుస్తూ.

"యివ్వమంటావా ఒక యిరవై రూపాయలు?" రఘుపతి జేబులోనుండి పర్సు తీయబోయినాడు.

"అక్కర్లేదులే" అంటూ సూర్యం శారద కాళ్లు

ప్రక్కను సర్ది బెంచీమీద కూర్చొని "మరి నీవేం ఒంటిగా కూర్చున్నావే? పెండ్లౌతున్నదని దిగులు పడుతున్నావా?" అన్నాడు హాస్యంగా.

హాస్యానికి రఘుపతి నవ్వుతూ "దిగులెందుకూ?" అన్నాడు.

"ఒంటరి జీవితంలోని బేషరతు ఆనందం అంత మౌతున్నదని."

"అందులో నీవేదో ఆనందం కనిపెట్టినట్లుందే? అందు కేనా నీవింకా పెండ్లి చేసుకోంది?" సరసంగా మిత్రునిమీద నింద మోపి రఘుపతి తన చమత్కారానికి తానే నవ్వినాడు.

ఆ సరసానికి సూర్యం చిరునవ్వు నవ్వుతూ అన్నాడు: "అందరికీ వుండవద్దూ నీ యంత అదృష్టం? బియ్యే పాస్ కాక ముందే పదివేల రూపాయలతో పెండ్లి! సరేకాని–మరి పెండ్లి కూతురు యెట్లుంది? అందంగానే వుందా?"

రఘుపతి ముసిముసి నవ్వులు నవ్వుతూ అన్నాడు: "యింకో గంటలో చూస్తావుగా! చూసిన తర్వాత నీవే చెప్పు–యెట్లుందో."

"ఒకరి సర్టిఫికెట్లు నీ కెందుకోయ్!" సూర్యం బిగ్గరగా నవ్వి, అంతలోనే తాను నవ్వడం వసారాలో అవతలి వైపు వున్న వాళ్లు విన్నారేమో అని తిరిగి చూసి, మెల్లగా అన్నాడు: "నీకు బాగుంటే సరి. పెండ్లి కూతురు అందం పెండ్లి కొడుక్కు నచ్చితే సరిపోయింది–మేమంతా యెవరం మధ్యన?"

"ఐనా మీ కండ్లకు యెట్లుందో అని?"

"మా కండ్లతో నీకేం పని? నీవు పెండ్లి చేసుకుంటున్నా వంటే నీ కండ్లకు బాగుందనే అర్థం. అంతగా నీకు

సర్టిఫికెట్ కావాలంటే అమ్మాయిని చూడకుండానే వ్రాసి స్తాను తీసుకో-అద్భుతం, అమోఘం, అపూర్వం, అజేయం అని." సూర్యం పకపక నవ్వినాడు.

రఘుపతి కూడా నవ్వుతూ "చూడకుండానే అంత పెద్ద సర్టిఫికెట్లా?" అన్నాడు.

"ఔను మరి. నీ కండ్లకు బాగుందిగా! నీవు ఒప్పు కున్నావు గాబట్టి ఆమె జగన్మోహినిగా వుంటుందనే నా నమ్మకం."

"జగన్మోహినేం కాదులే-యేదో ఒక విధంగా వుంటుంది. ఐనా జగత్తుకంతా మోహిని ఐతే నాకేం పని కొస్తుందిలే."

ఉలికిపడి సూర్యం హాస్యధోరణి వదలి ఆందోళనగా అన్నాడు: "ఛీ ఛీ-అదేమిటి రఘూ? నేనన్నమాటను నీ వెక్కడికో లాక్కుపోతున్నావు. నేనేమీ తప్పు వుద్దేశంతో అనలేదు."

అనాలోచితంగా తన నోటికి వచ్చిన చమత్కారంలో యిమిడివున్న అనర్థమంతా రఘుపతికి అప్పుడు మెదడు కెక్కింది. ఒక్కసారి మనిషి నిలువునా కంపించి అపస్వరం పలుకుతున్న కంఠంతో తొందర తొందరగా అన్నాడు: "పొరపాటు సూర్యం, నాదే పొరపాటు. యేదో ధోరణిలో, యేమంటున్నానో నాకే తెలియకుండా అన్నాను."

యింకేం మాట్లాడడానికీ సూర్యానికి తోచలేదు. యిద్దరూ మౌనంగా వుండిపోయినారు. మౌనం రఘుపతికి దుర్భరంగా వుంది. యేదో ఒకటి మాట్లాడడానికి ప్రయత్నం

చేస్తూ అతనన్నాడు: "నీ సంగతి చెప్పు సూర్యం. యింకా యెప్పుడు పెండ్లి చేసుకుంటావ్ ?"

"యెప్పుడో ఒకసారి చేసుకుంటాన్లే - తొందరేమొచ్చింది ?"

"ఉద్యోగం కూడా దొరికింది. యింకా ఆలస్యమెందుకు ?"

"చేసుకోకుండడనేం కాదులే. యేవో ప్రయత్నాలు చేస్తూనే వున్నారు మా వాళ్లు. యేదీ కుదరడం లేదు."

"యేం? నీకు సరిపోయే వాళ్లెవరూ దొరకలేదా ?"

"నాకు సరిపోతే మా వాళ్ళకు సరిపోదు. మా వాళ్లకు సరిపోతే నాకు సరిపోదు."

"మీ వాళ్ళకు సరిపోవడమేమిటి ? నీకు సరిపోతే చాలదూ ?"

"యేముందీ-డబ్బే. యేడెనిమిది వేలైనా లేకుంటే మా వాళ్లు ఒప్పుకోరు."

రఘుపతి అర్ధనిముషం యేమీ మాట్లాడలేదు. తరువాత అన్నాడు: "యెన్నాళ్లని పెద్దవాళ్ల మీద ఆధారపడతావ్ ? నీవే యెక్కడైనా ఒక అందమైన అమ్మాయిని చూసి చేసుకో."

సూర్యం ఒక క్షణం రఘుపతి ముఖంలోకి చూసి నిదానంగా అన్నాడు: "నీవు మాత్రం డబ్బు లేకుండా చేసుకుంటున్నావా రఘూ ?"

"లేదులే. కానీ మా నాన్న మరీ అంత డబ్బుకు గడ్డి తినేవాడు కాదు. నీవైనా యేదో ఒక విధంగా మీ వాళ్లను

ఒప్పించు. పెద్ద వాళ్లు మన జీవితాలతోనే వ్యాపారం చేయాలని చూస్తారు.''

సూర్యంకు యీ సంభాషణ రుచించలేదు. ఉభయులూ బలవంతంగా మాట్లాడుతున్నట్లు అతనికి తోచింది. కొద్దిక్షణాలు మౌనంగా వుండి అన్నాడు: ''మేడ మీదికి పోదాం రా రఘూ—అందరూ అక్కడనే వున్నారు.''

ఆ సూచన రఘుపతి ఆహ్లాదంగా స్వీకరించినాడు. ''నీవు పద. మా అక్క వస్తానే యీ పాపను ఆమె చేతికిచ్చి నేనూ వస్తాను.''

సూర్యం లేచి మేడమీదికి పోయినాడు. అతను పోయినందుకు రఘుపతికి ఒక వైపు తృప్తిగానే వుంది—గుండెమీద నుండి యేదో బరువు తగ్గినట్లు. మరొక వైపు పశ్చాత్తాపంగా వుంది—ఆ బరువుకు తానే కారణమన్న జ్ఞాపకంతో. దిగులుగా అస్పష్టమైన ఆలోచనలతో అట్లే బెంచీ మీద కూర్చొని వున్నాడు అతను. అవతల వైపున అతని తండ్రీ మేనమామా తక్కిన వాళ్లూ యేదో మాట్లాడుకుంటూనే వున్నారు. వాళ్ల మాటలేవీ అతని చెవికెక్కనే లేదు.

కమలమ్మ పెండ్లి యింటినుండి వేగంగా వచ్చి వాకిట్లో నిలబడి ''నాన్నా, యిటు రా.'' అని తండ్రిని పిలిచింది. వెంకట రమణయ్య తీరికగా లేచి తాంబూలం ఉమ్మేసి, జరీ వంచ సవరించుకుంటూ, లోపలికి పోయినాడు. లోపల ఒక మూల యెవరూ లేని చోట కమలమ్మ నిలబడివుంది. వెంకట రమణయ్య ఆమె దగ్గరికి పోయి ''యేమిటమ్మా?'' అన్నాడు.

కమలమ్మ తండ్రికి దగ్గరగా ఆనుకొని వచ్చి, అతని చెవి దగ్గర నోరుపెట్టి, ఉద్వేగం నిండిన కంఠంతో, మెల్లగా

చెప్పింది: "పెండ్లి కూతురు కనిపించలేదు."

"పెండ్లి కూతురు!" వెంకటరమణయ్య ఆశ్చర్యంతో ఉక్కిరి బిక్కిరి ఐనాడు. "యేమిటమ్మా? యెవరన్నారు?"

"ఒకరనడమేమిటి నాన్నా-నేను చూసి వస్తుంటేను! ఈ పాడు సంబంధం మన పాలిటికే వచ్చి పడింది!"

వెంకటరమణయ్య కూతురుమీాద విసుక్కున్నాడు. "సంబంధానికేమైందీ యిప్పుడు? వాళ్ళే ఖర్చులు పెట్టుకొని పదివేలు యిస్తున్నారు."

కమలమ్మ ఆవేశంలో గొంతు హెచ్చించింది. "పాడు పదివేలు! పిల్ల సంగతి చూడు నాన్నా ముందు. చెడిన పిల్ల పది లక్షలు తెస్తే మాత్రం యెందుకు?"

"ఛీ! యేం మాటలవి!" కూతురు మీాద అతను మండిపడినాడు. "మనం చేసుకోబోయే పిల్లమీాద మనమే నిందలు వేయడం?"

"యింకా నిందలేమిటి నాన్నా? మనకీ సంబంధం వద్దే వద్దు. రైలు దొరుకుతుందేమో విచారించు-వెంటనే వెళ్ళిపోదాం."

"యేమిటమ్మా-నీకేమైనా తల చెడిందా? పెండ్లి కూతురు కనిపించక యెక్కడ పోతుంది!"

కమలమ్మకు విసుగూ, కోపమూ, తండ్రి తన మాట నమ్మలేదనే బాధా, అన్నీ ఒక్కేసారి కలిగినాయి. "యెక్కడ పోయిందో నాకేం తెలుసు? పోయే వాళ్లందరూ నన్నడిగే పోతారేం? పిల్ల కనిపించలేదని తండ్రి వెదకడానికి పోయినాడు. తల్లి యేడుస్తూ మూల కూర్చున్నది."

వెంకటరమణయ్యకు యేమనడానికీ తోచలేదు.

"యేమిటో నేను విచారించుకొని వస్తానుండు." అని అతను అంటూ వుండగానే, రఘుపతి శారద నెత్తుకొని వాళ్ళున్న చోటికి వచ్చినాడు. ఆందోళనగా వున్న తండ్రి ముఖమూ, చిరచిరలాడుతున్న అక్క ముఖమూ చూసి అతను "యేమిటక్కా?" అని కమలమ్మను ప్రశ్నించినాడు.

ఆమె దూకుడుగా జవాబు చెప్పింది. "యింకా యేమిట్రా! పెండ్లి కూతురు కనిపించడంలేదు."

రఘుపతికి విషయం యేమీ అర్థం కాలేదు. తన అక్క యెప్పుడూ అతిశయంగా ఆవేశాలు ప్రదర్శిస్తుందని అతనికి తెలుసు. అతను తేలికగా అన్నాడు: "కనిపించక యేమైంది?"

అతని నిర్లక్ష్యానికి కమలమ్మకు ఒళ్ళు మండి, ఆవేశం రెట్టించింది. "యేమైందో నాకేం తెలుసు? యెవరితోనో లేచి పోయి వుంటుంది."

రఘుపతికి నోటమాట రాలేదు. వెంకటరమణయ్య తీవ్రంగా "యేమిటా పిచ్చి కూతలన్నీ?" అంటూ కూతురును మందలించి, "నేను కనుక్కొని వస్తానుండండి. ఒరేయ్ రఘూ, మీ అక్క నోరు జాగ్రత్త! అల్లరి ఔతే యెవరికి అవమానం అయ్యేది కూడా యీ మనిషికి జ్ఞానం లేదు." అని బయటికి పోయినాడు.

తండ్రిపోతూనే రఘుపతి బిక్క ముఖం వేసుకొని "యేమిటక్కా?" అని దీనంగా ప్రశ్నించినాడు.

తమ్ముని ముఖం చూసి కమలమ్మకు దుఃఖం వచ్చింది. "యేమిటో నాకు మాత్రం యేం తెలుసురా? ముహూర్తానికి ఆలస్యమౌతున్నదని పెండ్లి యింటికి పోయినాను. పెండ్లి కూతురు కనిపించలేదని ఆడవాళ్లందరూ గుంపులు గుంపులు

చేరి గుసగుస లాడుకొంటున్నారు. తండ్రి వెదకడానికి పోయి నాడని అన్నారు. యీ మాట అన్నందుకే నాన్నకు నా మీద అంత కోపం! యెటువంటి సంబంధం చేసుకోవలసి వచ్చిందిరా మన యోగ్యతకు!" కమలమ్మ పైట చెరగుతో కండ్లు తుడుచుకుంది.

రఘుపతి యేమీ పలకలేదు. తల వంచుకొని దిగులు ముఖంతో మౌనంగా వున్నాడు. మళ్లీ కమలమ్మే అన్నది: "మనకీ సంబంధం వద్దు రఘూ. పెత్తనం చేసేటప్పుడు నన్నైనా పిలవకపోతిరి. ఆడవాళ్ల సంగతులు ఆడవాళ్లకు తెలుస్తాయి గానీ, మీకేం తెలుస్తాయ్? యిప్పుడైనా మించిపోయింది లేదు. యీ పిల్లను చేసుకోనని నాన్నతో కచ్చితంగా చెప్పేసెయ్."

రఘుపతి తల యెత్తి ఒకక్షణం అక్క ముఖంలోకి చూసినాడు. మళ్లీ తల దించుకున్నాడు. పెండ్లి కూతురు లేచిపోయింది! లేచిపోయిందని తన అక్క కూడా స్పష్టంగా అనడం లేదు. వేయరాని అభాండం మాత్రం ఒకటి వేసి నిశ్చింతగా కండ్ల నీళ్లు పెట్టుకుంటున్నది. అక్క మాటలు సంపూర్ణంగా నిజమనీ అతనికి నమ్మకం లేదు. సంపూర్ణంగా అబద్ధమనుకోడానికీ ఆధారం లేదు. నిజమా అబద్ధమా అని వితర్కించుకోడానికి కూడా అతని బుద్ధీంద్రియానికి స్థిరత్వం నశించింది. హద్దులు కనపడని ఆవేదన కటిక చీకటివలె మన సంతా ఆక్రమించి ఆలోచనాశక్తిని అణచిపెట్టింది. తన కాబోయే భార్య లేచిపోయింది! మర్మాంతకమైన ఆ మాట హృదయమంతా దహిస్తున్నది. నిశ్శబ్దంగా అతను భుజం మీద నిద్రపోతున్న శారదను కమలమ్మ చేతికి అందించి, వెను

దిరిగి పోబోయినాడు. కమలమ్మ ఆత్రంగా ఒకడుగు ముందుకు వచ్చి "యేమంటావ్ రఘూ? మనకేం పిల్లలే కరువైనారా? యింతకంటె మంచి సంబంధం నీకు మూడు రోజుల్లో దొరుకుతుంది," అన్నది.

రఘుపతి కమలమ్మ వైపు చూడకుండా, మెల్లగా బయటికి నడిచినాడు.

వసారాలో తండ్రీ మేనమామా తప్ప తక్కిన వాళ్లంతా అక్లే కూర్చొని వున్నారు - యేదో లోకాభిరామాయణం మాట్లాడుకుంటూ. రఘుపతి వసారా దిగి వీధిలోకి వచ్చి నిలబడినాడు. పెండ్లి యింటి వైపునుండి కుక్కలు మొరుగుతున్న ధ్వని సన్నగా వినపడుతున్నది. వూరి బయటికి ముఖం తిప్పి అతను పది అడుగులు నడిచినాడు. చలిగాలి యెదురుగా వచ్చి ముఖంమీద ముసిరింది. కండ్లు మూసుకొని ఒక్కసారి చల్లని గాలి ఊపిరి తిత్తులనిండా పీల్చుకున్నాడు. మరి నాలుగు అడుగులు ముందుకు వేసినాడు. వసారాలోని లైటు వెలుతురును దాటి చీకటిలో ప్రవేశించినాడు. రోడ్డుమీద చిన్న గుంతలో కాలుపడి ఒళ్లంతా అదిరింది. అతను మరి నాలుగడుగులు ముందుకు వేసినాడు. రోడ్డు ప్రక్కన పండుకొని వున్న కుక్క ఉలికిపడి లేచి గా అంటూ మొరిగింది. వీధి చివర రోడ్డు కిరువైపులా వున్న వూరి గుడిసెలు దాటి అతను వూరి బయటికి వచ్చినాడు. పరధ్యానంగా ఒక ఫర్లాంగు దూరం నడిచినాడు.

రోడ్డుకు పదిగజాల దూరంలో పెద్ద వేపచెట్టు చీకటిలో కొమ్మలు విరబోసుకొని బ్రహ్మరాక్షసివలె వుంది. రోడ్డు వైపువున్న కొమ్మ క్రింద అతను నిలబడినాడు. చలిగాలి బుస్సున వచ్చి కొమ్మలలో దూరి దీనంగా మూల్గింది. కొమ్మ

చివరవున్న మంచు బిందువు ఒకటి అతని ముఖంమీద పడింది. వెలుగుతున్న నక్షత్రాలను లెక్క చేయకుండా నల్లని ఆకాశం ఠీవిగా దిక్కులన్నీ ఆక్రమించింది. నెత్తిమీద కృత్తికారాశి మినుకు మినుకుమంటూ యెవరినో వెక్కిరిస్తున్నది. వెనుక వైపు మరొక చెట్టుమీదనుండి గూబ మూల్గింది. దూరాన నక్కలు జాలిగా అరుస్తున్నాయి. చలిగాలి మరొకసారి అతని కుడిచెంప మీద పారాడి గగుర్పాటు కలిగించింది.

రఘుపతి వేపకొమ్మ క్రింద నిశ్చలంగా నిలబడినాడు. అతని హృదయమే స్పందనశక్తి కోల్పోయినట్లుంది. బాధకూ దుఃఖానికీ అతీతమైన వేదన యేదో దేహమంతా వ్యాపించి నట్లుంది. ఆలోచనలు గుంపులు గుంపులుగా, గంద్రగోళంగా, పెనవేసుకొని, సుడులు తిరిగి మనసంతా కలయబెట్టి కల్లోలం చేస్తున్నాయి.

పెండ్లికూతురు లేచిపోయింది. తానసలు పెండ్లి చేసుకోవాలనే అనుకోలేదు. లేచిపోయిందో లేదో, నింద మాత్రం వచ్చింది. పిల్లను చూసి రమ్మన్నాడు తండ్రి. తాను చూసి వచ్చి బాగనే వుందన్నాడు. లేచిపోతూ అనవసరంగా తన మెడకు తెచ్చిపెట్టింది. తండ్రి పెండ్లి ప్రయత్నం చేస్తూ వుంటే అభ్యంతరం చెప్పవలసిన కారణం తనకేమీ కనబడ లేదు. యెవరి వెంట లేచిపోయిందో? బియ్యే పాసై పెద్ద వుద్యోగం చేస్తాననుకున్నాడు చిన్నప్పుడు. పెండ్లికూతుర్లు లేచి పోతారని తన కప్పుడు తెలియదు. తానింక బియ్యే పాస్ కాలేదు. పెద్ద వుద్యోగం వుంటే పెండ్లి కూతురు లేచి పోదేమో? నగలతో కలిసి పదివేలిస్తారని తండ్రి అన్నాడు. నగలతో కూడా లేచిపోయిందేమో? లేవదీసుకపోయిన

వాడు బియ్యే పాసైనాడేమో ? మార్చి పరీక్షకు పోదునా వద్దా అని కొత్త పెండ్లి కూతురును అడుగుదామను కున్నాడు. లేచిపోయే పెండ్లి కూతురు పామ్మనే సలహా చెప్పుతుంది. చెప్పినా తాను వినడు. తనకసలు బియ్యే పాసౌ తాననే నమ్మకం లేదు. పెండ్లి కూతురు స్కూల్ ఫైనల్ పాసైంది. స్కూల్ ఫైనల్ పాసైతే లేచి పోతారు. బియ్యే పాస్ కాకుంటే లేచి పోతారు. అందంగా వున్న వాళ్ళు లేచి పోతారని అనుకునే వాడు. తన పెండ్లి కూతురు జగన్మోహిని కాదని సూర్యంతో అన్నాడు. సూర్యం చిరునవ్వు నవ్వాడు. అంత అందంగా లేకున్నా యింగ్లీషు చదువు వచ్చునని సంతో షించినాడు. యింగ్లీషు చదువు లేచి పోయింది. తన అక్కకు యింగ్లీషు చదువురాదు. లేచి పోయిన యింగ్లీషు చదువు తన అక్కకు రాదు. సూర్యంతో లేచిపోయి వుండినా బాగుండును. తన అక్క లేచిపోయి వుండినా బాగుండును. తన అక్క సూర్యంతో...

ఛీ! రఘుపతి తల విదలించుకున్నాడు. యిదేమిటి? అర్థంలేని ఆలోచనలు! దరిద్రపు ఆలోచనలు! ఆలోచనల గుప్పిటినుండి తప్పించుకోడానికి అతను చెట్టు చుట్టూ తిరిగి నాడు. చెట్టు క్రింది చీకటిలో రాయి తగిలి కాలు జిల్లుమన్నది. నిలబడి వూరివైపు నడిచినాడు. రోడ్డువైపు నడిచినాడు. లేచి పోయిన పెండ్లి కూతురు కొరకు వెదకుతుంటారు. దిక్కుల దిక్కులా వెదకుతుంటారు. వెదకుతూ వెదకుతూ యీ వైపుకు వచ్చి తన్ను చూస్తారు. తన్ను చూసి తనతోనే లేచి పోయిం దనుకుంటారు. అనుకున్న వాళ్ళ అవివేకానికి అతనికి నవ్వు వచ్చింది. లేచిపోయిన పెండ్లి కూతురు వెదకితే దొరుకు

తుందా! దొరక్కుండా యెక్కడ దాచి పెట్టుకుందో! యీ వేప చెట్టు చాటున వుందేమో? అతను రోడ్డుమీద నిలబడి చెట్టు వైపు చూసినాడు. యిందాకా తాను చూసిన చెట్టే అది. అక్కడ లేదు. వుంటే తనకు కనపడదూ? తనకు కన పడితే యేమంటుందో? వదలిపెట్టమని ప్రార్థిస్తుంది. తాను వదలి పెట్టడు. పెండ్లి కూతురును యెవడైనా వదలి పెట్టాడా! తన అక్క ఐతే వదలిపెట్ట మంటుంది. అక్కను వదలి పెట్ట వచ్చు. కానీ పెండ్లి కూతురును యెవడైనా వదలి పెడతాడా! అక్కను బావ వదలిపెడతాడు. తాను వుంచుకుంటాడు. అక్కనూ పెండ్లి కూతురునూ యిద్దరినీ వుంచుకుంటాడు.

ఛీ! ఆలోచనల వైపరీత్యానికి అతనికి భయం కలి గింది. యెంత భయంకరమైన ఆలోచనలు! యెంత అమా నుషమైన ఆలోచనలు! యెక్కడనుండి వస్తున్నా యీ ఆలో చనలు! యింత కల్మషం తన మనసులో యెక్కడవుంది? ఆలో చనల సుడిగుండంనుండి బయటపడడానికి అతను రోడ్డు వెంట వేగంగా నడిచినాడు. యెవరో తరుముకొని వస్తున్నట్లు మరింత వేగంగా నడిచినాడు. నాలుగు ఫర్లాంగులు నడిచేటప్పటికి ఒళ్లు వేడెక్కింది. నిలబడి ఆయాసం తీర్చుకున్నాడు. చలిగాలి సుఖంగా వుంది. పది నిముషాలలో మనసు కుదుటబడింది. తన కెందుకు యిన్ని ఆలోచనలు? పెండ్లి కూతురు లేచిపోతే తన కెందుకు బాధ? తాను హాయిగా మరొక పెండ్లి కూతు రును చేసుకుంటాడు—అంతే. లోకంలో పెండ్లి కూతుర్లే కరు వైనారా? యీ ఆలోచనతో అతనికిసంపూర్ణంగా మనశ్శాంతి యేర్పడింది. పెండ్లి కూతురు వుంటే తాను పెండ్లి చేసు కుంటాడు. పెండ్లి కూతురు లేకుంటే, పెండ్లి చేసుకునే ప్రశ్నే

లేదు, అతనికి ఆశ్చర్యమైంది—సమస్య యింత సులభంగా తెగి పోయినందుకు. యింతసేపూ యిన్ని ఆలోచనలు యెందుకు వచ్చినట్లు! యింత ఆందోళన యెందుకు పడినట్లు! తన అవి వేకానికి తానే నవ్వుకుంటూ అతను మెల్లగా వూరి దారి పట్టినాడు.

రఘుపతి విడిది యింటి దగ్గరికి వచ్చేటప్పటికి అతని తండ్రీ మేనమామా అతని కోసమే ఆందోళనగా వెదకుతూ వుండినారు. అతను కనపడుతూనే "యెక్కడపోయి వుంటివిరా యింతసేపు?" అంటూ వెంకటరమణయ్య గట్టిగా కేకలు వేసినాడు.

"యిప్పుడెందుకు బావా యింక అరవడం?" అని శేషాచలం బావకు సర్ది చెప్పి, రఘుపతిని యింట్లోకి పిల్చుకొని పోయినాడు. వెంకటరమణయ్య వాళ్లను వెంబడించినాడు. ముగ్గురూ కలిసి దొడ్డి వాకిలి దాటి యింటి వెనుక బయలులో గోడ ప్రక్కన చేరినారు.

యేదో విశేషముందని రఘుపతికి మళ్ళీ మనసులో ఆందోళన ప్రారంభమైంది. వాళ్లు చెప్పిందాకా మౌనం భరించలేక "పెండ్లి కూతురు యేమైంది మామా - దొరికిందా?" అని మామను ప్రశ్నించినాడు.

సంభాషణ యెట్ల ప్రారంభించవలసిందీ అర్థంకాక అవస్థపడుతూ వుండిన శేషాచలం ఆ ప్రశ్నకు వెంటనే సమాధానం చెప్పినాడు. "పెండ్లి కూతురు యేమౌతుందిరా? యింట్లో వుంది. ముహూర్తానికి అంతా సిద్ధంగా వున్నారు. త్వరగా పోదాం పద."

"ఐతే!• పెండ్లి కూతురు కనిపించలేదన్నది అబద్ధమేనా?" రఘుపతి ఆశగా మామ వైపు చూసినాడు.

వెంకటరమణయ్య కొడుకును కసరుకున్నాడు. "అవన్నీ యిప్పుడెందుకు రా? త్వరగా పోదాం రా."

తండ్రి కోప కారణం రఘుపతికి అర్థం కాలేదు. ఆశ్చర్యంతో అతను వెంకటరమణయ్య ముఖం వైపు చూసినాడు. తనను యెందుకు యిక్కడికి పిల్చుకవచ్చినారు - యేదో రహస్యం వున్నట్లు?

"వుండు బావా-ఉన్న విషయం చెప్పడం మంచిది గదూ. వీడేం పసిపిల్లవాడా?" శేషాచలం బావను శాంత పరచినాడు. "రఘూ, యేదో జరిగిపోయింది జరిగిపోయిందనుకో. యిప్పుడవన్నీ అనుకోవడం మంచిది గాదు. యింకా రెండు వేలు యివ్వడానికి సోమసుందరం ఒప్పుకున్నాడు. నీకు సమ్మతమే కదూ?"

"యేమిటి మామా - సరిగా చెప్పు."

వెంకటరమణయ్య కోపంగా సమాధానం చెప్పినాడు. "యేముందిరా? ముందు పది వేలు యిస్తామన్నారు గదూ? యిప్పుడింకా రెండు వేలు యెక్కువ యిస్తున్నారు. యింకేం-డబ్బు చేదా మనకు?"

"రెండు వేలేమిటి?" రఘుపతి మామ వైపు తిరిగి ప్రశ్నించినాడు. "యెందుకిస్తున్నారు యెక్కువగా?"

రఘుపతి వెనుకనుండి కమలమ్మ కంఠం వినపడింది. చీకట్లో యెప్పుడు వచ్చిందో తమ్ముని వెనుక నిలబడి వుంది ఆమె. "యెందుకైతే నీ కెందుకు రా? పెద్ద వాళ్లు చెప్పినట్లు వినరాదూ?"

ఆమె మాటలలో అతనికి పెండ్లి కూతురు లేచిపోయిందన్న వార్త నిజమో అబద్ధమో తేలలేదు. కానీ అందరూ కలిసి తన్ను యీ పెండ్లికి ఒప్పించడానికి ప్రయత్నం చేస్తున్నారని స్పష్టంగా అర్థమైంది. ఒప్పించడం యెందుకు? యెప్పుడో ఒప్పుకున్న పెండ్లికి యిప్పుడు ఒప్పించడమేమిటి? అతను దీనంగా కమలమ్మను ప్రశ్నించినాడు: "పెండ్లి కూతురు యేమైందక్కా?"

"యేమౌతుంది రఘూ?" కమలమ్మ తమ్ముని బుజ్జగించింది. "నిన్ను చేసుకోడానికి సిద్ధంగా వుంది. పోదాం పద."

"నీవే అన్నావు-పెండ్లి కూతురు లేచిపోయిందని." అంత దైన్యంలోనూ అతని కంఠంలో యెక్కడనో ధిక్కారం తొంగి చూసింది.

కమలమ్మ జవాబు చెప్పే లోపలనే వెంకటరమణయ్య కంఠం కస్సుమంది. "ఛా-యేం మాటల్రా అవి? మాటిమాటికీ లేచిపోయిందంటూ—నీకేం తల చెడిందా? కాబొయ్యే పెండ్లాన్ని గురించి మర్యాదగా మాట్లాడడం కూడా తెలియదా?"

శేషాచలం కంఠం హెచ్చించి వెంకటరమణయ్యను కసురుకున్నాడు. "కేకలెందుకు వేస్తావ్ బావా? నీ కేకలతోనే వాడు మరీ గందరగోళంలో పడుతున్నాడు." తరువాత అతను కంఠం తగ్గించి రఘుతో అన్నాడు: "నేను చెప్తాను విను రఘూ. పెండ్లి కూతురు యెక్కడా పోలేదు. లక్ష్మీదేవి మాదిరీ ఒంటినిండా నగలుపెట్టుకొని లక్షణంగా యింట్లో

వుంది—ముహూర్తానికి సిద్ధంగా. మనం పోవడమే ఆలస్యం—పది నిముషాల్లో తలంబ్రాలు పోసుకోవచ్చు."

"ఐతే" రఘు మెల్లగా, జాలిగా ప్రశ్నించినాడు: "లేచిపోవడం అబద్ధమేనా?"

వెంకటరమణయ్య మళ్ళీ కన్నుమన్నాడు. "మళ్ళీ అదే కూతేనా?"

శేషాచలం సానునయంగా రఘుపతి ప్రశ్నకు సమాధానం చెప్పినాడు: "అబద్ధం రఘూ—పచ్చి అబద్ధం. లేచి పోయిన పిల్లను నీకు కట్టబెట్టి మేమేం మూటగట్టుకుంటాం చెప్పు. నిన్ను మోసం చేస్తే మాకు ఒరిగేదేముంది? నీ సుఖం కాకపోతే మాకింక యేం కోరిక వుంటుంది?"

ఒకక్షణం నిశ్శబ్దంగా గడచింది. మెల్లగా, తనలో తాను మాట్లాడుకున్నట్లు, రఘుపతి ప్రశ్నించినాడు: "రెండు వేలు యెక్కువ యెందుకిస్తున్నారు?"

కమలమ్మ వెనుకనుండి విసుగ్గా అన్నది: "యిప్పుడెందుకురా యీ యక్షప్రశ్నలన్నీ? ఆ మూడు ముళ్ళూ పడితే తరువాత తీరిగ్గా మాట్లాడుకోకూడదూ?"

ఆమెను వారించి శేషాచలం శాంతంగా చెప్పినాడు: "యిటు చూడు రఘూ. రెండు వేలు యెక్కువగా యిస్తున్నారంటే, పెండ్లి కూతురు లేచిపోయిందని అనుకుంటున్నావా? చదువుకున్నందుకు యిదేనా ప్రయోజనం? యేదో సాకు దొరికితే, దాని వుపయోగించుకొని రెండు వేలు యెక్కువగా రాబట్టుతున్నామనుకో. అదైనా యెవరికోసమంటావ్? నీ కోసం గాకపోతే మా కోసమా? రెండు వేలు సులభంగా

వచ్చేటప్పుడు యెందుకు వదలి పెట్టాలని రాబట్టుతున్నాంగానీ, లేకపోతే మేం మాత్రం రెండు వేలకు గడ్డి తింటామనుకున్నావా? ...యేమంటావ్ రఘూ?"

"రెండు వేలూ యేమని రాబట్టుతున్నారు?"

"అదే..." సమాధానం చెప్పలేక శేషాచలం కంఠం ఒక క్షణం తటపటాయించింది. మరుక్షణంలోనే ఆలోచనతో తేరుకొని సాఫీగా సాగింది. "సుబ్బరామయ్యను చూసినావు గదూ-హైస్కూలు టీచరు-పెండ్లివాళ్ల యింటికి పొరుగున్నే వున్నాడు. పెండ్లి కూతురు చిన్నప్పటినుండి వాళ్లింట్లో పెరిగింది, వాళ్ళను అత్తా మామా అంటూ. ఆ సంగతి నీకూ తెలుసుగా. పన్నెండు గంటలప్పుడు పెండ్లి కూతురు వాళ్ళింటికి పోయింది, ఆ సుబ్బరామయ్య భార్యను పిలుచుకరావడానికి. ఇంతలో పెండ్లి కూతురుకు స్నానం చేయించాలని ముత్తైదువలు అనడమూ, పెండ్లి కూతురు యేదీ అంటే యేదీ అని నలుగురూ అటూ యిటూ చూడడమూ, సరిగా ఆ సమయానికి మీ కమలమ్మక్క అక్కడికి పోవడమూ, అన్నీ కలిసి నిష్కారణంగా ఆ అమ్మాయిమీద నింద వేయడానికి అక్కరకొచ్చినాయి. ముగ్గురాడవాళ్లు కలిస్తే ముల్లోకాలకూ నిప్పు ముట్టిస్తారనుకో. పాపం, అక్కడ పెండ్లి కూతురు సుబ్బరామయ్య భార్యతో కలిసి అప్పుడే యింటికి వచ్చింది. కానీ యేం లాభం? యింతలో మీ అక్క యిక్కడికి వచ్చి పెండ్లి కూతురు కనిపించలేదని పుకారు పుట్టించింది."

వెనుకనుండి కమలమ్మ కంఠం దుఃఖం ప్రకటించింది. "నిజమే రఘూ-అన్యాయంగా ఆ అమ్మాయిమీద నింద వేసినాను. నా పాపిష్టి నోరు కాల్చినా పూరకుండదు. వచ్చేజన్మలో

నేనెన్ని నిందలు మోయవలసివస్తుందో!" అంతలోనే ఆమె కంఠం ఉత్సాహంతో పొంగిపోయింది. "యింతకూ నీ అదృష్టం రఘూ. మంచి సంబంధం. పైగా రెండు వేలు అను కోకుండా చేతికి వస్తున్నాయ్."

శేషాచలం మళ్ళీ మెల్లగా ఆరంభించినాడు. "యిప్పు డంతా అర్థమైందా రఘూ? మీ నాన్నా నేనూ అక్కడికి పోయి పెండ్లి కూతురు యేదీ అనేటప్పటికి పాపం సోమ సుందరం గుండె నిలిచిపోయినంత పనైంది. యీ పెండ్లి యెగిరి పోతుందేమో అని మనిషి నిలువునా అదిరిపోయినాడు. లేచి పోయిందనే నిందవేసి పెండ్లి యెగరగొట్టే, ఆ పిల్లకు యింక యీ జన్మలో పెండ్లయ్యే మార్గమేముంది చెప్పు. అందుకని పాపం అతను వెంటనే యింకో రెండు వేలిస్తానన్నాడు. పెండ్లి కూతుర్ని గురించి మనకేమీ అనుమానాలు లేవుగా – అందు కని ఫ్రూరక వచ్చే రెండు వేలు యెందుకు పోగొట్టుకోవాలని వెంటనే ఒప్పుకున్నాం. యింక దీన్ని గురించి నీవేమీ ఆలో చనలు పెట్టుకోనక్కు. సరేనా?"

కమలమ్మ శేషాచలంకు ప్రోత్సాహం యిచ్చింది. "యింకా ఆలోచన యేముంది మామా? రఘుకు యింత దూరం చెప్పాల్నా? మనందరికంటె వీడే తెలివిపరుడు. అదృష్ట వంతుడు కూడా. పోదాం పద రఘూ."

రఘుపతి హృదయం చక్రబంధంలో చిక్కుకున్నట్లుంది. తండ్రీ, తోబుట్టువూ, మేనమామా, ముగ్గురూ కలిసి ఏక ముఖంగా తనమీద సామ దాన భేద దండోపాయాలన్నీ ప్రయోగిస్తున్నారు. ఇంతమంది ప్రయోగించే యిన్ని ఆయు ధాలను ఒకేసారి యెదిరించే సాహసంగానీ సామర్థ్యంగానీ

అతనికి హృదయానికి లేదు. తన దుస్థితిని జూచి అతనికే జాలి కలిగింది. తానొక అమాయకుడైన యువకుడు—అసమర్థుడైన యువకుడు. తన్ను ఒంటరివాణ్ని చేసి, ఒల్లని పెండ్లికి బలవంతం చేస్తున్నారు. స్వకరుణతో అతని హృదయం ద్రవించిపోయింది. తన భవిష్యత్తును గురించి యెన్నో బంగారు కలలు గన్నాడు. తన జీవితంలో యేమేమో సాధించగలనని ఊహా సౌధాలు నిర్మించుకున్నాడు. ఆ గాలిమేడలన్నీ ఒక్క ఊపుతో నేల మట్టమౌతున్నాయి. కడకు కళంకంలేని భార్యను పొందే భాగ్యం కూడా లేదు తనకు. చదువుకున్న భార్యతో కలిసి స్వర్గానికి నిచ్చెనలు నిర్మించవచ్చు ననుకొన్నాడు. కానీ,తుదకు యీ భార్యతో కలిసి నలుగురిలో ముఖమెత్తుకొని తిరిగే అవకాశం కూడా లేదు. తన యోగ్యతకు తనకు పట్టవలసిన దుర్గతికాదు యిది. గౌరవమూ మర్యాదా గల కుటుంబంలో పుట్టినాడు. తన తండ్రికి ఏకైక పుత్రుడు. లక్ష రూపాయల ఆస్తికి వారసుడు. విద్యో చదివినాడు. యీ పెండ్లి కూతురును వెంట బెట్టుకొని పోయి తన వూర్లో తాను యేమని గౌరవంగా బ్రతగ్గలడు ? ఈ పెండ్లి చేసుకొని యీ అత్తగారి వూర్లో మాత్రం తాను యేమని బజార్లలో తిరగగలడు ? ఫలానా సోమసుందరంగారి అల్లుడని అందరూ వ్రేలెత్తి చూపుతారు. లేచిపోయిన పిల్లను చేసుకున్నవాడని పది మందీ పరిహాసం చేస్తారు. డబ్బుకు గడ్డి తిని యెవనికో మనసిచ్చిన భార్యతో కాపురం చేస్తున్న నీచుడు అని తన్ను వూరందరూ ఆడిపోసు కుంటారు. స్వకరుణతో అతను తన పరిస్థితిని అతి దయనీయంగా ఊహించుకున్నాడు. పెండ్లి కూతురు లేచిపోయినట్లుగానే స్థిర పరచుకున్నాడు. ఈ పెండ్లి చేసుకుంటే తన ఆత్మ గౌరవానికి

తీవ్రమైన ఆఘాతంగా చిత్రించుకున్నాడు. యీ పిల్లని పెండ్లికి ఒప్పించడానికి తన్ను తండ్రీ, మేనమామా, అక్కా, బలవంతం చేయడం ప్రపంచ చరిత్రలో యెవరికీ జరగని అపచారంగా భావించుకున్నాడు. తనకు సంభవించిన యీ దీనావస్థ యే యుగంలోనూ యెవరికీ సంభవించి వుండదనుకున్నాడు. తన దురవస్థమీద అతనికి విపరీతమైన జాలి కలిగింది. వివర్ణమైన ముఖమెత్తి తండ్రివైపూ, మామ వైపూ శూన్య దృక్కులు ప్రసరిస్తూ అతను దీనంగా అన్నాడు: "యీ పెండ్లి చేసుకొని యీ వూళ్లో ముఖమెత్తుకొని తిరగలేను."

వెంకటరమణయ్య పరుషంగా గద్దించినాడు: "యేం? తిరగ లేక యేం రోగమొంది? యేం తప్పు చేసినావని తిరగ లేవు?"

శేషాచలం సానునయంగా అడిగినాడు: "యీ వూళ్లో తిరగవలసిన పని యేముంది రఘూ? యీ వూరితో మన కేమి సంబంధమని?"

కమలమ్మ ఉత్సాహంగా సమస్యకు పరిష్కారం సూచించింది. "రఘు యీ వూళ్లో వుండ వలసిన పని లేకుండా యేర్పాటు చేస్తాం మామా. యీ రాత్రికే కార్యం చేయమందాం. ప్రొద్దున్నే పెండ్లికూతురుతో కూడా అందరం మన వూరికి వెళ్ళిపోదాం. రఘు మళ్లీ యీ వూరికి రావలసిన పనే వుండదు." తన సూచనకు తానే ఉప్పొంగిపోతూ ఆమె విజయగర్వంతో శేషాచలం వైపు ప్రశ్నార్థకంగా చూసింది.

శేషాచలంకు యీ సూచన అమోఘంగా కనపడింది. వెంటనే అతను వెంకటరమణయ్య వైపు తిరిగి "యేమంటావ్ బావా? యీ రాత్రికే వీలుంటుందా?" అన్నాడు.

రఘుపతికి అసహ్యం కలిగింది—తన మనసులోని బాధను

యింత తృణప్రాయంగా చూసిన ఆ ముగ్గురి మీదా అతనికి పరమ అసహ్యం కలిగింది. తన ఆత్మగౌరవాన్ని యింత అల్పంగా వెలగట్టిన ఆ ముగ్గురి మీదా అతనికి అంతు లేని ఆగ్రహం వచ్చింది. అకస్మాత్తుగా అతని హృదయం ధిక్కారంతో నిండి పోయింది. హఠాత్తుగా "నాకీ పెండ్లి వద్దు" అనే మాటలు అతని నోటి నుండి వెలువడినాయి.

వెంకటరమణయ్య అదిరిపడినాడు. యింత సేపూ శాంతంగా మాట్లాడుతూ వుండిన శేషాచలం ఆందోళనగా అన్నాడు: "అదేమిటి రఘూ? అన్ని యేర్పాట్లూ ఐన తర్వాత ఆఖరు క్షణంలో వద్దంటే మన మర్యాద యేమౌతుందనుకున్నావ్?"

"నా మర్యాద యేమౌతుందనుకున్నారు?"

కమలమ్మ గద్గద కంఠంతో తమ్ముని బుజ్జగించింది. "నా మాట విను రఘూ. యింత మంచి సంబంధం మనకు మళ్ళీ దొరకదు. ఒప్పుకో రఘూ. యిప్పుడు వద్దంటే యెంత మందికి తలవంపులుగా వుంటుందో చూడు."

వెంకటరమణయ్య కోపంతో నోట మాటరాక, బుస కొట్టుతూ, అందరి ముఖాల వైపూ చూస్తున్నాడు.

శేషాచలం జాలిగా అన్నాడు: "మరో రెండు వేలు కూడా యిస్తామన్నారు. యిప్పుడు కాదనడం బాగుండదు. ఆఖరు క్షణంలో కాదంటే వాళ్ల గతి యేమౌతుంది చెప్పు. మనమే అన్యాయంగా ఆ పిల్ల జీవితం నాశనం చేసి నట్లౌతుంది."

"అంత అభిమానం వున్న వాళ్లు అన్యాయంగా అపనింద వేసి రెండు వేలు వసూలు చేయడానికి యెట్ల తయారైనారు?"

రఘుపతి వాదం వెంకటరమణయ్య భరించలేకపోయినాడు. సంభాషణ ధోరణే అతని సహనశక్తిని మించిపోయింది. కోపం పట్టలేక అతను హఠాత్తుగా కొడుకు చేయి పట్టుకొని "మర్యాదగా నోరు మూసుకొని నా వెంట రా— ముహూర్తం మించిపోతున్నది" అంటూ రఘుపతిని చరచర యీడ్చుకుంటూ యింట్లోకి వచ్చినాడు. వాకిలికి యిరుపంచలా చెవులు నిక్కబెట్టుకొని వీళ్ల సంభాషణ వింటున్న పదిమంది ఆడవాళ్లు గబగబా నలుదిక్కులకూ చెదరిపోయినారు. అందులో ఒక పడుచు ముత్తైదువ నవ్వు పట్టలేక పైట చెరగు నోట కుక్కుకొని ఊపిరాడక ఉక్కిరిబిక్కిరైంది.

# 3

కల్యాణి దేవుని గదిలో ఒంటరిగా కూర్చొని వుంది. ఒంటి నిండా ఆభరణాలతో, తళతళలాడే సిల్కు బట్టలతో, వాటితో పొత్తు కుదరని వాడిన ముఖంతో, యేడ్చి యేడ్చి యెరుపెక్కిన కన్నులతో, కల్యాణి గోడ కానుకొని దీనంగా కూర్చొని వుంది. మెడలో మంగళసూత్రం మిలమిల మెరుస్తున్నది. తలమీద వెంట్రుకలలో యింకా ఒకటి రెండు బియ్యపుగింజలు యిరుక్కొని వున్నాయి. బయటి హాలులో నుండి పెట్రొమాక్సు లైటు వెలుతురు వాకిలి గుండా లోపలికి వచ్చి ఆమె కాళ్ల ముందు పడుతున్నది. ఎదురుగా దేవుని మూల ఆముదం దీపం మినుకు మినుకు మంటున్నది.

స్పృహ లేని మనిషి వలె కల్యాణి నిశ్చలంగా కూర్చొని వుంది—ఎదురుగా వున్న ఆముదం దీపం వైపు తదేకంగా చూస్తూ. శక్తికి మించిన సమస్యలతో ఆమె మనసు మూగ

బోయింది; అనుభూతికి అతీతమైన వేదనతో హృదయం అచేతనమైపోయింది. మైకంలో వున్నట్లు ఆమె నిశ్చలంగా పరధ్యానంగా కూర్చొని వుంది.

తన పెండ్లి ఐపోయింది. అంతా కలలో మాదిరీ జరిగిపోయింది. యెవరో తన్ను బలవంతంగా నడిపించుకొని పోయి పీటలమీద కూర్చోబెట్టినారు. యెవరెవరో తన దేహాన్ని ఆజ్ఞాపించినారు. యెవరో తన తల పట్టుకొని మెడలో మంగళసూత్రం కట్టించినారు. యెవరో తన చేతులు పట్టుకొని పెండ్లికొడుకు తలమీద బియ్యం పోయించినారు. యెవరో తన్ను పిల్చుకొని వచ్చి యీ గదిలో కూర్చోబెట్టినారు. తన పెండ్లి ఐపోయింది. అంతా యాంత్రికంగా పరాధీనంగా జరిగిపోయింది. తన అనుమతి లేకుండా తన యిచ్ఛకు వ్యతిరేకంగా తన పెండ్లి జరిగిపోయింది. ఇప్పుడు తానొక భార్య. తన జీవితమంతా మరొకరికి అమ్ముడుపోయింది.

తన జీవితాన్ని యీ విధంగా అమ్మివేసింది యెవరు ? తనకీ పెండ్లి చేసింది యెవరు ? తన యిచ్ఛకు వ్యతిరేకంగా తన్ను జీవితాంతం బంధించింది యెవరు ? యెవరీ శత్రువులు ? యెవరో ఆమెకు అర్థం కాలేదు. అందరూ తన బంధువులే. అందరూ ఆప్తులే. అందరూ తన్ను ప్రేమించి తన క్షేమం కోరే వాళ్ళే. అందరూ కలిసి తన్ను నట్టేటిలో ముంచినారు. తన కాళ్లు చేతులు కట్టి నడి సముద్రంలో త్రోసినారు. అందరూ శత్రువులే. తన బంధువులే తనకు శత్రువులైనారు. తన ఆప్తులే తన పాలిట యమదూతలైనారు. తన్ను ప్రేమించే వాళ్ళే తన జీవితంలో నిప్పులు పోసినారు. తన క్షేమం కోరే వాళ్ళే తన భవిష్యత్తును

నాశనం చేసినారు. యెందుకు? యెందుకీ విధంగా జరిగింది? తన వాళ్ళే తన కెందుకు శత్రువులైనారు? అందరూ యెందుకు తన మీద పగ బూనినారు? యెందుకో ఆమెకు అర్థంకాలేదు. అర్థం కాని ప్రశ్నలు, అస్పష్టమైన ప్రశ్నలు, అనంత వేదనా పూరితమైన ప్రశ్నలు, సమాధానం దొరకని ప్రశ్నలు, తన జీవితాన్ని ముక్కలు ముక్కలు చేసిన ప్రశ్నలు—పద్దెనిమిదేండ్ల పడుచు హృదయం ప్రశ్నల పరంపరతో నిండిపోయింది. తుది మొదలు లేని ప్రశ్నల రూపం దాల్చిన వేదనతో ఆమె హృదయం నిర్జీవమైపోయింది. మూగగా, మొండిగా, శూన్యంలో వున్నట్లు, మరో ప్రపంచంలో వున్నట్లు, కల్యాణి నిశ్చలంగా కూర్చొని వుంది.

సుబ్బరామయ్య భార్య శాంతమ్మ మెల్లగా వాకిలి దగ్గరికి వచ్చి తొంగి చూసింది. నిశ్శబ్దంగా వచ్చి కల్యాణి దగ్గర కూర్చొని ఆదరంగా అన్నది: "లెయ్యమ్మా, స్నానం చేస్తువుగాని."

కల్యాణి దీనవదనం పైకెత్తి శూన్యంలోకి చూసినట్లు ఆమె వైపు చూసింది. శాంతమ్మ మరింత మమకారంతో "లెయ్ తల్లీ" అంటూ కల్యాణి నెత్తిమీద బియ్యపుగింజలు యేరివేసి వెంట్రుకలు సవరించింది.

"యెందుకత్తా?" కల్యాణి గద్గద కంఠంలో ప్రశ్న కొట్టుకలాడింది. గొంతు సవరించుకొని ఆమె మళ్ళీ ప్రశ్నించింది: "యెందుకు?"

"యీ గంటసేపు మేం చెప్పినట్లు విను తల్లీ. అంతటితో ఐపోతుంది."

"పెండ్లి ఐపోయిందిగా?"

"ప్రొద్దున్నే నిన్ను మీ అత్తగారి వూరికి పిలుచుక పోతారంట. యీ రాత్రికే..." చెప్పలేక శాంతమ్మ తటపటాయించింది. కల్యాణి నిశ్చలంగా ఆమె ముఖంలోకి చూస్తూనే వుంది. కల్యాణి చూపులు తప్పించుకొని ఆమె మెల్లగా చెప్పింది: "యీ రాత్రికే కార్యం చేయాలంటున్నారు."

కల్యాణి తల వంచుకున్నది. శాంతమ్మ సానునయంగా ఆమె గడ్డం పట్టుకొని పైకెత్తింది. కల్యాణి కన్నులలో నీరు చూసి ఆమె ఆందోళనగా "అదేమిటి తల్లీ-అమంగళం!" అంటూ రెండు చేతులతో కల్యాణి ముఖం పొదివి పట్టుకున్నది. ఆమె వైపు చూడలేక కల్యాణి చూపులు వాల్చింది. కనుకొలుకులలోనుండి నీటి బిందువులు జోట జోట కారినాయి ఆదుర్దాగా శాంతమ్మ పైట చెరగుతో కల్యాణి కన్నీళ్ళు తుడిచింది. ధారాపాతంగా కారుతున్న కన్నీళ్లతో కల్యాణి ముఖమంతా తడిసింది. అవమానంతో ఆత్మగ్లానితో గడ్డ కట్టుకపోయిన కల్యాణి హృదయానికి శాంతమ్మ అనునయ వాక్యాలతో మళ్ళీ చైతన్యం వచ్చింది. మూగపోయిన హృదయంలో మళ్ళీ దుఃఖం సుడులు తిరిగింది. కన్నీరు ఏకధారగా ప్రవహించింది. ఆమెను ఓదార్చే మార్గం తెలియక శాంతమ్మ కల్యాణి తల నిమురుతూ మౌనంగా కూర్చొని వుంది.

రెండు నిముషాలు నిశ్శబ్దంగా గడచినాయి. అంతలో "యింకా లేవలేదా?" అంటూ కల్యాణి తల్లి అక్కడికి వచ్చింది. శాంతమ్మ ఉలికిపడి, కల్యాణి చేయి పట్టుకొని "లెయ్యమ్మా" అంటూ లేచి నిలబడింది. ఆమెతో పాటు

కల్యాణి కూడా యంత్రంవలె లేచి నిలబడింది. తల్లీ శాంతమ్మా, చెరొక చేయి పట్టుకొని ఆమెను నడిపించుకొని పోయినారు. నీళ్లు నిండిన కన్నులతో, కబోదివలె ఆమె అచేతనంగా వాళ్ల వెంట నడిచింది.

కల్యాణికి స్నానం చేయిస్తున్నారు. దేహం పరాధీనం చేసి ఆమె కొయ్యబొమ్మవలె కూర్చున్నది. ఆలోచనలూ ఆవేదనలూ పెనవేసుకొని మనసును కలచి వేస్తున్నాయ్. తనకు మళ్ళీ స్నానం చేయిస్తున్నారు. ఈ రాత్రికి యింతటితో ముగిసిందనుకున్న పెండ్లి యింకా ముగియలేదు. ఈ రాత్రికే తన దేహాన్ని భర్తకు అర్పించమంటున్నారు. ఈ రాత్రికే! తనకు కలగబోయే అత్యాచారాన్ని తలచుకొని కల్యాణి హృదయం కంపించింది. పెండ్లి ఐన తర్వాతనైనా తన రాజాను కలుసుకోవచ్చునని హృదయంలో యే మూలనో అవ్యక్తంగా వున్న ఆశ మొదలంట కూలిపోయింది. తానింక యేమని రాజా ముఖం చూడగలదు? తన సర్వస్వమూ యెవరికో అర్పించి రాజామీద యేమని ఆశపెట్టుకోగలదు? తన భవిష్యత్తంతా అంధకారమైంది. తానింక బ్రతికి ప్రయోజనం యేముంది? యింత అత్యాచారానికి గురై, సర్వస్వమూ కోల్పోయి, బ్రతకడం యెందుకు? యీ బ్రతుకు బ్రతకడం కంటె ఆత్మహత్య చేసుకోవడం మేలు. తనకింక ఆత్మహత్య తప్ప గత్యంతరం లేదు. ఔను—తాను తప్పక ఆత్మహత్య చేసుకుంటుంది. రేపే చేసుకుంటుంది. రేపు సాధ్యంకాక పోతే

మరునాడు తప్పక చేసుకుంటుంది. కల్యాణి మనస్సు ఆత్మ హత్యా మార్గాలను అన్వేషించడంలో నిమగ్నమైంది.

స్నానం ముగిసింది. కల్యాణికి కొత్త బట్టలు కట్టి అలంకరణ చేస్తున్నారు. దేహం పరాధీనం చేసి ఆమె కొయ్య బొమ్మవలె కూర్చున్నది. బాధామయమైన ఆలోచనలు ప్రభంజనంవలె మనసును కల్లోలం చేస్తున్నాయి. యీ అలం కరణ అంతా యెవరి కోసం? యెవరో ముక్కూ మొగ మెరుగని పురుషుని కోసం!తన మనసుకు వ్యతిరేకంగా తన మెడలో తాళి గట్టిన భర్తకోసం! రఘుపతిని ఊహించుకోబోయి ఆమె దేహం నిలువునా కంపించింది. తన రాజా-తాను మనసారా ప్రేమించిన రాజా వుండవలసిన పవిత్రస్థానాన్ని యెవరో పరాయి వ్యక్తి ఆక్రమించుకున్నాడు! ఇంత భయంకరమైన దుర్ఘటన తన కెందుకు సంభవిస్తున్నది? ఇంత మహావమానకర మైన అత్యాచారానికి తానెందుకు తల ఒగ్గుతున్నది? కాదు- తాను తల ఒగ్గదు-ప్రతిఘటించి తీరుతుంది. రేపే ఆత్మ హత్య చేసుకుంటుంది. తన్నింత ఘోరమైన దుర్గతికి పాల్జేసిన వారందరూ గుండెలు బాదుకునేటట్లు తాను ఆత్మహత్య చేసు కుంటుంది. రేపే చేసుకుంటుంది. తప్పితే మరునాడు తప్పక చేసుకుంటుంది. ఆత్మహత్య తప్ప యీ జీవితానికింక మార్గాంతరం లేదు. కల్యాణి మనస్సు ఆత్మహత్యకు అనువైన పద్ధతులను వెదకడంలో నిమగ్నమైంది. ఆ ప్రయత్నంలో ఆమె మనస్సుకు ఒక విధమైన స్వస్థత చిక్కింది.

అలంకరణ పూర్తి అయింది. కల్యాణిని రెక్కలు పట్టుకొని మేడ మీదికి నడిపించుకొని పోయినారు. పడక గది దగ్గరికి తీసుకపోయి మెల్లగా లోపలికి నడిపించి తలుపులు మూసినారు. వాకిలి పంచన గోడకానుకొని సర్వాభరణ భూషితమైన కల్యాణి తల వంచుకొని కొయ్య బొమ్మవలె నిశ్చలంగా నిలబడి వుంది. ఆమె మనసులో యిప్పుడే ఆందోళనా లేదు. తనకెందుకు భయం? తనకు భయపడవలసిన స్థితి దాటిపోయింది. తాను తప్పక రేపు ఆత్మహత్య చేసుకుంటుంది. ఈ జీవితానికిది ఆఖరు రాత్రి. యీ ఘడియలో తన దేహం మీద అసహ్యకరమైన అత్యాచారం జరగబోతున్నది. యీ అత్యాచారానికి తాను ప్రతీకారం చేసి తీరుతుంది. రేపు ఆత్మహత్య చేసుకొని అందరికీ తగిన శిక్ష విధిస్తుంది. తన ప్రేమను, తన సుఖాన్ని, తన జీవితాన్ని, యింత నిర్లక్ష్యంగా చూసిన లోకంమీద తాను తప్పక పగ సాధిస్తుంది. రేపు తప్పక ఆత్మహత్య చేసుకుంటుంది. గుండె రాయి చేసుకొని కల్యాణి కొయ్య బొమ్మవలె గోడ కానుకొని, తల నేలకు వంచుకొని, నిశ్చలంగా నిలబడి వుంది.

గది మధ్యలో మెల్లగా అలికిడైంది. కల్యాణి రెప్పలెత్తి చూసింది. పట్టె మంచంమీద కూర్చొని తన భర్త, తన మెడలో తాళిగట్టిన పెండ్లికొడుకు, తనవైపే చూస్తున్నాడు. కల్యాణి మళ్ళీ చూపులు నేలకు వాల్చింది. రఘుపతి లేచి వచ్చి ఆమె దగ్గర నిలబడినాడు. ఆమె భుజం పట్టుకొని

మెల్లగా మంచం దగ్గరికి నడిపించుకొని పోయినాడు. కల్యాణి దేహం పరాధీనం చేసి కొయ్యబొమ్మనలె అతని ప్రక్కన నడిచింది. ఆమెను మంచంమీద కూర్చోబెట్టి అతను ప్రక్కనే కూర్చున్నాడు.

"ఇటు చూడు" అన్నాడు అతను.

ఆమె పలకకుండా, కదలకుండా, నిశ్చలంగా వుంది.

అతను ఆమె తలమీద చేయిపెట్టి, ముఖం తన ప్రక్కకు తిప్పుకున్నాడు. తల కొంచెం పైకెత్తి ఆమె ముఖంలోకి చూసినాడు. కల్యాణి నిశ్చలంగా అతని కన్నుల్లోకి చూసింది. నిశ్చలంగా నిర్వికారంగా వున్న ఆమె చూపులు భరించలేక అతను తన చూపులే ప్రక్కకు తిప్పుకున్నాడు. ఆమె మెల్లగా మళ్ళీ తల వంచుకుంది.

"యీ పెండ్లి నీ కిష్టం లేదా?" రఘుపతి ప్రశ్నించినాడు.

యిష్టం! నా యిష్టా నిష్టాలను యెవరడిగినారు! నాకు యిష్టా నిష్టాలు వున్నాయని యెవరనుకున్నారు!

"చెప్పు—యీ పెండ్లి నీ కిష్టం లేదా?" రఘుపతి మళ్లీ ప్రశ్నించినాడు.

మళ్లీ అదే ప్రశ్న! ప్రశ్న అడిగే అధికారం యెవరిచ్చినారు యీ మనిషికి! యెవరితను! ప్రశ్నలకు జవాబివ్వవలసిన అవసరం తనకేమీ లేదు. తాను రేపు ఆత్మహత్య చేసుకుంటుంది.

"మీా వాళ్లు బలవంతంగా పెండ్లి చేసినారా?"

తనవాళ్లు! యెవరు తన వాళ్లు! తనకెవరూ తనవాళ్లు లేరు. అందరూ శత్రువులే. అందరూ అతని వాళ్లే. అతనూ వాళ్లలో వాడే. యీా లోకమంతా వాళ్ళే యేలుకోనీ. తన కెందుకు? తాను రేపు ఆత్మహత్య చేసుకుంటుంది.

కల్యాణి తల నిమురుతూ రఘుపతి ఆప్యాయంగా అన్నాడు: "పలకవా?"

పలకవలసిన పని యేముంది? తానెవరు? యిత నెవరు? తనకూ యితనికీ యేమి సంబంధం? యేమి సంబంధ మున్నా యీా ఒక్క రాత్రికే. తాను రేపు తప్పక ఆత్మహత్య చేసుకుంటుంది.

"పలికితే నోటి ముత్యాలు రాలుతాయా?"

యేమిటీ అసహ్యమైన సరసం! తనతో సరసమాడే హక్కు యితని కెవరిచ్చినారు! యెన్ని సరసాలాడినా యీా ఒక్క రాత్రికే. తాను రేపు యీా లోకమే విడిచిపోతున్నది.

యెన్ని ప్రశ్నలు వేసినా కల్యాణి మౌనంగా వుంది. గుండె రాయి చేసుకొని కొయ్యబొమ్మవలె నిశ్చలంగా వుంది. ఆమెతో ఒక్క ప్రశ్నకు కూడా సమాధానం రాబట్టుకోలేక రఘుపతి సిగ్గుపడినాడు. కంఠం మార్చి అతను ఠీవిగా అన్నాడు: "నీవు చేయరాని తప్పు చేసినావు. ఐనా నిన్ను క్షమించి ఉదారంగా పెండ్లి చేసుకున్నాను."

ఛీ! యేమిటీ స్వాతిశయం! ఔదార్యమంట! నాకింతటి

మహోపకారం చేసిన వ్యక్తికి నేను కృతజ్ఞత చూపించవలె నంట! ఎంతటి నైతిక దురహంకారం! ఎంతటి దుర్భరమైన మనిషి! ఎంత దుర్భరమైనా యీ రాత్రికే. తాను రేపే దేహం వదలిపెడుతున్నది.

ఆమెతో ఒక మాట కూడా పలికించుకోలేక రఘుపతి విసుగు చెందినాడు. రెండు నిముషాలు నిశ్శబ్దంగా గడచినాయి. తరువాత అతను మెల్లగా ఆమె వీపుమీద చేయివేసినాడు. క్రమంగా ఆమె దేహాన్ని స్వాధీనం చేసుకోడానికి ప్రయత్నించినాడు.

కల్యాణి గుండె రాయి చేసుకొని కొయ్యబొమ్మవలె నిశ్చలంగా తన దేహం అతనికి అప్పగించింది.

(మార్చి 1960)

# KALASINA GUNDELU




A VIDYODAYA PUBLICATION

BY RACHAMALLU RAMACHANDRA REDDY

Jacket Printed at Neo Art Press, Madras 2

